# ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

గ్రంథాలయ నిర్వహణానికీ
వయోజన విద్యాప్రచారానికీ
సంబంధించిన సలహాలు కావలసినవారు
కార్యదర్శి, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమం
పటమటలంక (వయా) బెజవాడ
చిరునామాకు వ్రాయండి.

తెలంగాణమునకు ఖమ్మంమెట్టు (యస్. యస్. రైల్వే) లోనూ రాయలసీమకు ఆనందాశ్రమం, మైదుకూరుపోష్టు, కడపజిల్లాలోనూ ప్రత్యేకంగా శాఖాకార్యాలయాలు ఏర్పడినవి. ప్రాంతీయ సమస్యలకు సంబంధించిన సమస్యల విషయమై శాఖాకార్యాలయాలే సలహాలిస్తున్నవి. రాష్ట్రేతర, ఖండాంతరాలలోని మా కార్యక్రమాన్ని జెంషెడ్పురంలోని మా సహాయకార్యదర్శి శ్రీ కోడుగంటి తిరుమలరావు గారు చూస్తున్నారు.

---

## గ్రంథాలయశాస్త్ర ప్రథమ పాఠములు

కర్త: శ్రీ పాతూరి నాగభూషణం, డి. యల్. యస్.
ఆంధ్ర దేశ గ్రంథాలయసంఘ కార్యదర్శి

గ్రంథాలయధర్మాలూ, లక్షణాలను తెలిపే గ్రంథం.
గ్రంథాలయశాస్త్రంలోని ప్రధానసూత్రాలను చర్చించిన గ్రంథం.
గ్రంథాలయ నిర్వహణాన్ని ఆధునిక శాస్త్రపద్ధతులతో సాగించడానికి తోడ్పడుతుంది.

గ్రంథాలయకార్యకర్తలంతా చదువదగింది.

వెల రెండురూపాయలన్నర. పోస్టేజి వేరు.

ప్రతులకు: గ్రంథాలయపుస్తకశాల, పటమటపోష్టు, కృష్ణాజిల్లా.

ఇరువదియైదవ

# ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## సింగరేణి కాలరీస్ (నైజాం)

౧౯౪౪ ఆగష్టు ౨౪, ౨౫, ౨౬

## నివేదిక




ప్రకాశకులు

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

పటమటలంక (వయా) బెజవాడ

# మాతృస్తవము

వందేమాతరం మాతరం ॥వం॥

సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం ॥వం॥

శుభ్రజ్యోత్స్న పులకితయామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం
సుహాసినీం సుమధురభాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥వం॥

---

# మేలుకొలుపు

స్వర్గీయ శ్రీ కోటాటి రామకృష్ణరావుగారు, సూర్యాపేట

లెమ్ము లెమ్ము నిదురించుటకిది
సమయంబే ఆంధ్రపుత్రకా! ॥లెము॥
జ్ఞానభాను పరిసర్పిత కిరణము
లానభూమి విహారము సల్పెడి ॥లెము॥
ఐకమత్యదేవాలయ భూమిని
అంజలి ఘటియింపంగన్ సేవిక ॥లెమ్ము॥
ప్రేమామృత పూరిత కలశమ్మును
సోదరులకు త్రావింపగ తరియిడె ॥లెమ్ము॥
విశ్వమంత వ్యాపించు ప్రకాశము
నీదు దేశమున నిలుపగ తోడ్పడ ॥లెమ్ము॥





రావిచెట్టు రంగారావు దంపతులు

# అంకితము

ఆంధ్రభాషాభివృద్ధికై
తమ జీవితాన్ని అర్పించినట్టియు
తమ యర్ధాంగి
శ్రీ లక్ష్మీనరసమ్మ గారి
సాహాయ్యముతో
స్త్రీల విద్యాభివృద్ధికి పాటుపడినట్టియు,
ఆదర్శజీవియు,
తెలంగాణపు ప్రథమ గ్రంథాలయ
సేవకులును నగు
కీ. శే. రావిచెట్టు రంగారావు గారికి
తెలంగాణమున మొదటిసారి జరిగిన
ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభా
రజతోత్సవ సమావేశ సంచికను
భక్తిపూర్వకముగ సమర్పించినాము

# ప్రకాశకుల విజ్ఞప్తి

అనేక ఆటంకాలను దాటి మూడుసంవత్సరాల క్రితం తెలంగాణంలో మొట్టమొదట జరిగిన ఇరువదియైదవ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ సంచికను నేటికైన ప్రకటించ గలిగినందుకు మాకు ఆనందంగావుంది. ఈసమావేశం ఆంధ్రగ్రంథాలయోద్యమ చరిత్రలో ప్రసిద్ధివహించినది కావడంచేత దీనిసంచికను సర్వాంగసుందరంగా ప్రకటన చేయవలెనని మేము కుతూహలపడ్డాం. కాని మాకు తటస్థమైన అసౌకర్యాలమూలంగా మాసంకల్పం నెరవేరలేదు.

మహాసభ శాఖాసమావేశాలలో చదివినవ్యాసాలలో తెనాలితాలూకా పెదపాలెం వాస్తవ్యులు శ్రీపుతుంబాక సీతారామయ్యగారి 'నాగ్రంథాలయానుభవము' విశాఖపట్టణ పురవాసులు శ్రీమారేపల్లి రామచంద్రశాస్త్రిగారి 'పాత పుగుడి కడంక- ఈడుమీరినవారిచదువు' అనేవ్యాసాలు విడిపొత్తములుగ ప్రకటించ దగియున్నందువలన యిందులో చేర్చలేదు. అరికలోపమూ, కాగితపుకరువూ కారణంగా మొదట దీనిలో చేర్చడానికి సంకల్పించిన దిగువవ్యాసాలను నిలిపివేయవలసివచ్చింది. వీలువెంట వీటిని మేము పునరుద్ధరించనున్న సంఘపత్రికయగు 'గ్రంథాలయ సర్వస్వము' లో ప్రకటించ ప్రయత్నింతుము. కనుక యిప్పటికి వీనికర్తలు మమ్ము క్షమించ గోరుచున్నాము.

| వ్యాసము | కర్త |
|---|---|
| 1. గ్రంథాలయమహాసభలు | శ్రీ పాతూరి నాగభూషణం |
| 2. గ్రంథాలయోద్యమము | ,, దేవులపల్లి రామానుజరావు |
| 3. నిజాంరాష్ట్ర ఆంధ్ర గ్రంథాలయోద్యమము | ,, కోదాటి నారాయణరావు |
| 4. గ్రంథాలయాలు | ,, బెల్లంకొండ చంద్రమౌళీశ్వరశాస్త్రి |
| 5. గ్రంథాలయాల నిర్మాణ నిర్వహణలకు కొన్నిసూచనలు | ,, కొత్తపల్లి రంగారావు |
| 6. ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమము | ,, మల్లెల శ్రీరామమూర్తి |

నిర్వహణ శాఖాసమావేశాధ్యక్షులు తమ ఉపన్యాసాన్ని వ్రాసిపంపనందున దీనిని ప్రచురించడం కుదరలేదు. మదరాసు యూనివర్సిటీ మాజీ భాండాగారి రావుసాహెబ్ యస్. ఆర్. రంగనాథన్‌గారు ఈసమావేశానికి ప్రత్యేకంగా పంపిన 'తెలుగు సాహిత్యము కోలన్ వర్గీకరణము' అనే ఆంగ్లవ్యాసాన్ని ఈసంచికయొక్క ప్రత్యేకానుబంధంగా విడిగా ప్రకటిస్తున్నాము.

# కృతజ్ఞత

మహాసభ విజయానికి తోడ్పడ్డ ఆహ్వానసంఘము వారికీ, మహాసభను సమర్థతతో నిర్వహించిన అధ్యక్షులు శ్రీ బూరుగుల రామకృష్ణారావుగారికీ, అనారోగ్యకారణంచేత తాము సభకు రాజాలకపోయినా అమూల్యమైన సలహాలతో తమ ఉపన్యాసాన్ని వ్రాసిపంపిన సభాప్రారంభకులు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారికీ, ప్రదర్శనావిష్కర్తలు శ్రీ చెరుకువాడ వెంకటనరసింహంగారికీ, శాఖాసమావేశాల అధ్యక్షకార్యదర్శులకూ, ఈసమావేశాలకు శ్రమపడి తమ అనుభవముల వ్రాసిపంపిన వ్యాసకర్తలకూ, వివిధప్రాంతాలనుండి స్వయంప్రయాసలకు లోనై సభకువచ్చి తమకు గల గ్రంథాలయోద్యమాభిమానాన్ని వెల్లడించిన ప్రతినిధులకూ, ఓపికతో సేవచేసిన స్వచ్ఛందసేవాదళము వారికీ, మహాసభకు ఆశీస్సుల బంపిన పెద్దలకూ, చిరకాలంగా విశాలాంధ్ర సమ్మేళనానికై తహతహలాడే తెలుగువారికి చక్కని అవకాశాన్ని కల్పించజాలిన మహాసభ సమావేశానికి కారణభూతులైన మిత్రులు శ్రీ కోదాటి నారాయణరావు, అకల లక్ష్మీనారాయణగార్లకూ, సభకు స్వయంగా హాజరుకాకున్నా దీనినిర్వహణకు యేలాటి ఆటంకాలుగాని కలుగకుండా మొదటినుండి తుదివరకూ తమ సలహా సహాయములతో మాకండగానిలచిన ఆంధ్రపితామహులు శ్రీ మాడపాటి హనుమంతరావుగారికీ మా హృదయపూర్వక నమస్కారములు. మహాసభ ఖర్చులక్రింద తమ ధనమునుండి రు 250 0 0 ల మొత్తమును సమర్పించిన సింగరేణికాలరీస్ లోని శ్రీ సీతారామాంజనేయ హిందూవర్తక గ్రంథాలయ కార్యకర్తలు ప్రశంసాపాత్రులు. వీరికిని, తాముసేకరించిన ధనంలో యీసంచిక అచ్చునిమిత్తం రు 50-0 0లు మిగిల్చి యిచ్చిన ఆహ్వానసంఘం వారికినీ మాధన్యవాదములు.

మహాసభ జరుపుకోడానికీ, ప్రతినిధుల నివాసానికీ, భోజనాదుల యేర్పాటుకూ, సభ జరిగినంతకాలమూ అతిథుల కేలాటిలోటూ రానీయకుండ కనిపెట్టి, వీడుకోలుకుముందు రుచివంతమైన ఉపాహారముతోపాటు, మహోన్నతభావాలతో కూడిన అమృతవాక్కులతోకూడ మాకు విందొసర్చిన క్రీ. శే. శ్రీ సీతారాం శేట్ గారిని మేము మరువలేము. పరమేశ్వరుడు వీరి ఆత్మకు శాంతి ప్రసాదించు గాక !

అం. దే. గ్రం. సంఘము<br>
పటమటలంక<br>
29-5-1947

ఇట్లు విన్నవించు,<br>
పాతూరి నాగభూషణం<br>
కార్యదర్శి

# పెద్దల అభిప్రాయములు

## ఆంధ్రపితామహులు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు

వరంగల్లు జిల్లాలోని ఇల్లెందులపాడు (సింగరేణి కాలియరీస్) అను చోట 8వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ సమావేశమగుటయు, అది జయప్రదముగా ముగియుటయు నిజాంరాష్ట్రాంధ్రులమగు వారందరకు చాల సంతోషప్రదమైనది. బ్రిటిషాంధ్ర దేశమున గ్రంథాలయోద్యమము సక్రమ పద్ధతులపైన ప్రారంభమైన తరువాత ముప్పది సంవత్సరములకు, నిజాంరాష్ట్రములో గ్రంథాలయోద్యమమున పాటుబడుచున్న ఆంధ్రులును, బ్రిటిషాంధ్రములోని సోదర కార్యకర్తలును ఒకచోటుగూడి వయోజన విద్యావ్యాప్తి కత్యంతము తోడ్పడు నీ మహాకార్యమును గూర్చిన సాధనోపాయముల నాలోచించు నవకాశము కలుగుట యుండు మనకు ఎంతో ఉపయోగకరము కాగలదని తలచితిని. ఉద్యమ కార్యకర్తలు బ్రిటిషిండియా వారగుట వలన మహా ఘనత వహించిన నిజాము ప్రభుత్వాధికారులు ఈ సమావేశమునకు ఏవేని యంతరాయముల కల్పింతురేమోయను సంశయము మనస్సును వేధించుచుండెను. కాని ఎట్టెట్లో దైవానుగ్రహమునను, మా ప్రభుత్వము వారి ఉదార దృక్పథము వలనను మహాసభ చక్కగా జరుగుటయే కాక తరువాతిదగు వార్షిక సమావేశము కూడ మా నిజామురాష్ట్రములోని ఈంపూరు తాలూకాకు ఆహ్వానింపబడినది. ఇది నిజాము రాష్ట్రవాసులమగు మాకే కాక మా ప్రభుత్వాధికారులకుకూడ గౌరవావహమనదగిన యంశము.

మన ఆంధ్ర గ్రంథాలయోద్యమము విశాలాంధ్రమును నిర్మించుటలో తోడ్పడుగాక!

(సం.) మా. హనుమంతరావు

## పూజ్య శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు

సింగరేణిలో జరిగిన 8వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ యిప్పటికి చరిత్రకెక్కినది. నైజాములో ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ జరగడానికి యిదే ప్రప్రథమము. అక్షరాస్యతా ప్రచారము చేయు యువకులు బహు సంఖ్యాకులుగ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభకు హాజరు కావడానికి యిదే మొదటి పర్యాయము. నైజామాంధ్ర రాష్ట్రములలో వేరువేరు రాజకీయాభిప్రాయముల పెద్దలు, యువకులు నొక్కటిగా జేరుటకు ఇది చాలా ప్రబలానుకూలమైనది.

శ్రీ రావి నారాయణరెడ్డిగారు హాజరు కావడముతో ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమం, నిజాంరాష్ట్ర గ్రంథాలయోద్యమం, నిజామాంధ్రోద్యమం, సేనకూడ నుండుటచేత ఆంధ్రరాష్ట్రోద్యమం అన్నీ ఒక్కచోట భాషాధారకమైన విజ్ఞానవికాస మహోద్యమంలో పాల్గొనడము సంభవించినది. స్థానిక గ్రంథాలయానికి వార్షికోత్సవము జరగడంకూడా యిప్పుడే తటస్థించినది. అక్షరాస్యతా ప్రచారోద్యమ ప్రాముఖ్యం ప్రకటితమైనది. నోటిమాటలతో గాక తక్షణము చందాలు వేసుకొని

గ్రంథాలయము సంవత్సరము పొడుగున అక్షరాస్యతను వ్యాపింపజేయడానికి పూనుకొన్నది. ఇది ఆంధ్ర దేశ గ్రంథాలయాలకు మార్గసూచకమైనది.

ఇదివరలో అక్షరాస్యత గ్రంథాలయాలకు విధ్యుక్త ధర్మమని హెచ్చరిస్తుండిన గ్రంథాలయమహాసభ నేడుదీనిని ప్రధానాంగముగ నిర్వహించ వలసినదని తీర్మానించడం హృదయానికి పరిపూర్ణ సంతృప్తిని కలిగించినది. ఈవిషయములో అధ్యక్షులైన బూర్గుల రామకృష్ణారావుగారు ప్రచారక శాఖాధ్యక్షులైన ఓరుగంటి వేంకటేశయ్యగారు, మహాసభ ప్రారంభించిన ప్రతాపరెడ్డిగారు, ఇతరోపన్యాసకులు యేకముఖాభిప్రాయ మివ్వడము గమనించ దగినది. దక్షిణహిందూ దేశ వయోజన విద్యా సంఘ నిర్వాహకులు, ప్రతినిధులు సందేశాలుపంపడము గ్రంథాలయోద్యమానికీ, నిరక్షరాస్యతానిర్మూలనానికీ వుండే అవినాభావ సంబంధమును స్పష్టపరచింది.

ఈ తరుణములో నైజాము యిలాకాలోని కొందరు యువకులు, కొందరుదార ప్రజాహిత జీవులు బాగాపరిచయము కావడము సంభవించినది. ఇదివరలో పేర్కొన్న వ్యక్తులేగాక మరి కొందరిని పేర్కొంటేగాని నామనస్సు తృప్తిపడదు. కచ్చితముగా మాట్లాడి, కచ్చితముగా కార్యముచేసే ఆహ్వానసంఘ కార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావు ఇందులో మొదటివాడు. ఇంకిద్దరు నారాయణరావు లున్నారు. హృదయాన్ని రెచ్చగొట్టె గేయాలు, కవిత్వాలు వ్రాసేవారుకాళోజీ. కోమరగిరి నారాయణరావు రెండవవాడు. అలంపూరు, రాయచూరు జిల్లాలనుంచి వచ్చి మహాసభను వచ్చే సంవత్సరమునకు ఆహ్వానించిన యువకవి గడియారము రామకృష్ణశర్మ మరియొకడు. విగ్రహము చూస్తే కార్యపరునిగ కనుపించినాడు. నడవడిని చూస్తే నమ్రప్రవర్తనవాడని తోచినది. సంఘములో కలుపుగోలు తనము చూస్తే అభివృద్ధి మార్గానుసారిగా తోచినాడు. ఇతడు కోదాటి నారాయణరావుతో కూడాచేరి సంవత్సరము పొడుగున పనిచేయుటయే గాక వచ్చే మహాసభను యింకా దిగ్విజయముగ చేస్తాడని నావిశ్వాసము. మరియొకవ్యక్తి నాకంటికి బడవాడు సీతారాం శేటు. అసలుమార్వాడి ఐనా తెలుగువాడయి పోయినాడు. తా నెక్కువ చదువుకోలేదంటూ చాల విషయగ్రహణశక్తిగల మనిషిగా కనుపించినాడు. సంస్కారాభిలాషిగానున్నాడు. మరి యిద్దరు యువకులమాట చెప్పతాను. ఖమ్మంమెట్టు సుగ్గల అక్షయలింగం గుప్త కార్యపరుడు. తానువెళ్లిన చోట తన ఉద్యమానికి సహాయం సంపాదించడములో ప్రవీణుడు. ఆ రెండవ యువకుడు ఆకుల లక్ష్మీనారాయణ సభ్యులలో సభ్యుడుగ నాకు కనుపించినాడు. ఇతరుల కాదరాభిమానములు చూపే గుణగరిష్ఠుడు. సింగరేణి కాలరీసులో ఉద్యమానికి పట్టుగొమ్మ.

మరొక ముసల్మాను సోదరుని చెప్పకుండ నాఅనుభవాన్ని పూర్తిగ వివరించలేను. ఆడదాలీ ఇక్బాలుకవి వ్రాసిన ఒక గేయాన్ని మధుర కంఠముతో మహాసభలో వినిపించినాడు. అది బ్రాహ్మణునిగురించి సంబోధించినది. దేవాలయములోని విగ్రహములలో దేవుని జూచే ఓబ్రాహ్మణుడా! ప్రజాహిత జీవనములో దేవుడున్నాడు చూడమన్నాడాయన. అదే సందేశము హిందూ ముసల్మానుల కిచ్చినాడీ యువకుడు. సెలవుకొన్నాం.

(సం.) గా. హరిసర్వోత్తమరావు

# విషయ సూచిక

వాయు వెట్టులు స్వేచ్ఛమై ప్రజకు దొరుకు
నట్లె జ్ఞానంబుకూడను నబ్బవలయు
ఉదకమెల్లర కేరీతినొదవు నట్లె
జ్ఞానముంగూడ సేవ్యంబు గాగ వలయు
సూర్యచంద్రుల తేజంబు చూరలాడ
నెల్లవారికి లభ్యమై యెసగు నట్లె
జ్ఞానముంగూడ సులభంబు గాగ వలయు

# ౨౫ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## సింగరేణి కాలరీస్ (ఇల్లెందు)

చిరకాలమునుండి ఎడబాసివుండి ఒకరి క్షేమం ఒకరికి తెలియకుండావున్న ఏకకుటుంబీకులు ఏదో శుభకార్య సందర్భమున కలసికొని ఆనందంలో తన్మయులయ్యే సంఘటన స్ఫురిస్తుంది, - ౨౫ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభాదృశ్యాన్ని చూస్తే. వేరువేరు యేలుబడులలోనున్న వివిధ ఆంధ్ర ప్రాంతాలనుంచి 100 గురు ప్రతినిధులు, బహుళసంఖ్యలో ప్రేక్షకులూ విచ్చేశారు. సభ నాల్గురోజులు విజ్ఞానవ్యాప్తికై నడుము బిగించిన గ్రంథాలయ సేవకులతోను; వీరందరి అనుభవాల వల్ల విజ్ఞానాన్ని పొందవచ్చిన ప్రేక్షక ప్రజానీకంతోను సింగరేణి కాలరీస్‌నందు కన్నులపండువుగా కలకల్లాడింది. స్థానికయువకులు వారంరోజులు ముందునుండే పట్టణాన్ని, సభాస్థలాన్ని అలంకరించటం మొదలుపెట్టారు. వాలంటీర్లకు శిక్షణ గరుపబడింది. ఆహ్వాన సంఘం ఏర్పాట్లు చాలా శ్రద్ధతో జరుపబడ్డాయి. మహాసభకు ఒకరోజు పూర్వమే 23-8-44వ తేదీన స్థానిక శ్రీసీతారామాంజనేయ హిందూవర్తక గ్రంథాలయ వార్షికోత్సవము జయప్రదంగా జరిగింది. దీని సభాపతి శ్రీ నాగులపల్లి కోదండ రామారావు ఎం. ఎస్. సి., ఎల్ ఎల్. బి. గారు. ప్రారంభకులు ప్రముఖులు, స్థానిక న్యాయవాదులు శ్రీ గొట్టుపర్తి సుబ్బారావుగారు. ఈ వార్షికోత్సవానికే గ్రంథాలయోద్యమ నాయకులు పలువురు విచ్చేశారు. శ్రీ చెరుకువాడ వెంకట నరసింహం, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, మారేపల్లి రామచంద్రశాస్త్రిగార్ల ఉపన్యాసాలతో సభ జయప్రదంగా జరిగింది. వయోజన విద్యనిమిత్తం సభికులను ఉత్తేజపరచి దాదాపు రూ 2000 లు శ్రీ సుగ్గల అక్షయలింగంగుప్తగారు, ఖమ్మంమెట్టు చందాలు వేయించారు. అదేరోజు సాయంత్రం రైలులో గ్రంథాలయ మహాసభాధ్యక్షులు, సుప్రసిద్ధాంధ్ర నాయకులు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు, యితర ప్రముఖులు విచ్చేశారు. మహాసభా ప్రతినిధు

లకు, ప్రేక్షకులకు ఓర్నకల్లునందు శ్రీ ప్రజాహిత గ్రంథమండలి కార్యకర్తలు శ్రీ గండి అనంతరామయ్యగారు ఉచిత భోజనవసతులు ప్రశంసనీయంగా ఏర్పాటు చేశారు. సింగరేణి కాలరీస్ స్టేషన్‌నుండి బాలురుదీర్చి స్వచ్ఛందసేవకులు, పౌరులు స్టేషన్‌వద్ద అతిథులకు స్వాగతమిచ్చి ప్రబోధగీతాలతో గ్రామప్రదక్షిణము చేసి విడుదులలో వసతి ఏర్పాటు చేశారు.

ది 24 8 44 ఉదయం గ.9-0 లకు సభ వందేమాతరం గీతంతో ప్రారంభమయింది. శ్రీ చందాల రామకవిగారు స్వాగత పద్యాలు చదివారు. యువకులు ప్రబోధగీతాలు చదివారు. శ్రీ చెరుకువాడ వెంకట నరసింహం పంతులుగారు గ్రంథాలయ ప్రదర్శనాన్ని బహిరంగపరచారు. ఆహ్వానసంఘాధ్యక్షులు రానందున కార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావుగారు స్వాగతోపన్యాసాన్ని చదివారు. సభాప్రారంభకులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు నారికురుపుచే బాధపడుచుండి రాలేక వారి ఉపన్యాసాన్ని పంపినందున దానిని శ్రీ నారాయణరావుగారు చదివారు. సభాధ్యక్షులు అధ్యక్షపీఠాన్ని అలంకరించి ఉత్తేజకరమైన తమ ఉపన్యాసాన్ని వినిపించారు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారి నివేదిక అనంతరం సభకు రాజాలక సభ జయప్రదంగా జరగాలని కోరుతూ ప్రముఖులు పంపిన సందేశాలు శ్రీ కోదాటి నారాయణ రావుగారు చదివి వినిపించారు. ఇంతటితో ఉదయపు సమావేశం ముగిసింది.

## శాఖాసమావేశములు

**వయోజనవిద్యాశాఖ:** సాయంత్రం గం 7-0 లకు వయోజన విద్యాశాఖా సమావేశం శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను జరిగింది. హాలంతయు స్త్రీపురుషులచే క్రిక్కిరిసి పోయింది. ప్రారంభంలో వందేమాతరం గీతంపాడబడింది. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు చదువును గురించి, నిరక్షరాస్యత నిర్మూలాన్ని గురించి చక్కని గేయాలు మధుర కంఠంతో గానంచేశారు. నాగయ్య, మల్లిఖార్జునరావుగార్లు ప్రబోధగీతాలు పాడారు. శ్రీ సత్యనారాయణగారు "గ్రంథాలయమున కెళ్లవలెనన్నా" అనేగీతాన్ని పాడారు

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు స్వానుభవపూరితమైన తమ వయోజనవిద్యా ప్రచారాన్ని వివరిస్తూ రెండు గంటలు చక్కని ఉపన్యాసం యిచ్చారు. ఉపన్యాసం కడపటి వయోజనవిద్యా పద్ధతులను నల్లబల్లపై వివరిస్తూ బోధించారు. ఈ శాఖాసమావేశ కార్యదర్శి శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు వయోజనవిద్యా ప్రచారనివేదికను చదివి వినిపించారు. వివిధప్రాంతములనుండి వచ్చిన గ్రంథాలయ సేవకులు వయోజన విద్యను గురించిన తమ స్వానుభవాలను నివేదించారు. సమావేశం అంతటితో ముగిసింది.

ది 25-8-44 ఉదయం గం 9-0 లకు శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు వయోజనవిద్యకు ప్రచారం చేయవలసిన పద్ధతిని గురించి తమ పథకాన్ని వివరించారు. మనం స్వతంత్రం అనుభవించాలంటే నూటికి నూరుపాళ్ళు విద్యావంతులుగా తయారు కావలెనని గంభీరోపన్యాసం చేశారు. ఆలంపూరు గ్రంథాలయ కార్యదర్శి శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు 'ఆంధ్ర తేజము' అనే తమ పద్యాలను వినిపించారు.

నిర్వహణశాఖ:— మధ్యాహ్నం గం 11-0 లకు వయోజన విద్యాశాఖా సమావేశం ముగిసి నిర్వహణశాఖాసమావేశం మొదలయింది. ఈ సమావేశానికి ప్రఖ్యాత గ్రంథాలయసేవకులు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు అధ్యక్షత వహించి సమావేశాన్ని నిర్వహించారు. "పాఠకుడి దృక్పథం ఎట్లుండవలెను" అనే విషయంపై శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, గ్రంథాలయంలో ఏ ఏ గ్రంథములుండవలయును అనేవిషయంపై శ్రీ నూరపురాజు కోటయ్యగారును ఉపన్యసించారు. శ్రీ దాశరథి కృష్ణమాచారి, పాతూరి నాగభూషణంగారు తమ పద్యాలను చదివారు. మద్రాసు విశ్వకళాపరిషత్తు గ్రంథభాండాగారి, గ్రంథాలయ నిర్వహణ శాస్త్రవేత్త, అఖిలభారత గ్రంథాలయ సంఘాధ్యక్షులు అయిన శ్రీ ఎస్. ఆర్. రంగనాథన్ గారు "తెలుగుసాహిత్యము, కోలన్ వర్గీకరణము" అనేవిషయంపై ఇంగ్లీషు లోపల ఉన్న ఉపన్యాసములోని సూచనలను శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు తెలుగులో అనువదించారు. మధ్యాహ్నం ఒంటిగంటకు సమావేశం ముగిసింది.

మధ్యాహ్నం విషయనిర్ణయసభా సమావేశం జరిగింది. సాయంత్రం గం 5-0లకు తిరిగి నిర్వహణ శాఖాసమావేశం జరిగింది. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు గ్రంథాలయ నిర్వహణనుగూర్చి స్వీయానుభవాలతో గూడిన అనేక సూచనలను చేస్తూ ఉపన్యసించారు.

ప్రచారశాఖ:— సాయంత్రం గం 7-0 ల నుంచి ప్రచార శాఖా సమావేశం శ్రీ ఓదురు వెంకటశేషయ్యగారి అధ్యక్షతను సమావేశమయింది. అధ్యక్షులు సారస్వతానికి, గ్రంథాలయాలకు గల సంబంధాన్ని, ప్రచార పద్ధతులను గురించి విపులంగా ఉపన్యసించారు. వివిధ గ్రంథాలయ సేవకులు తమతమ ఉపన్యాసాలను వినిపించారు. నెల్లూరునుండు "నగరజ్యోతి" అనే పేరుగల గోడపత్రిక నిమిత్తం

చందాలు వసూలుచేయనైనది. రాత్రి గం 11-0 లకు సమావేశం ముగిసింది. భోజనానంతరం శ్రీ సీతారామాంజనేయ హిందూవర్తక గ్రంథాలయంలో విషయ నిర్ణయసభ సమావేశం జరిగింది. అదే సమయంలో సభాప్రాంగణంలో శ్రీ కందుకూరి వీరేశలింగంగారి జీవిత చరిత్ర బుర్రకథ రూపంగా శ్రీ వట్టికోట నాగేశ్వరరావు ప్రభృతులచే చెప్పబడింది.

28.8-44 ఉదయం గం 9 లకు మహాసభ చివరి సమావేశం జరిగింది. గ్రంథాలయోద్యమానికి సంబంధించిన 27 తీర్మానాలు సభలో చర్చించబడి తీర్మానించబడినవి. ఆంధ్రమహాసభాధ్యక్షులు శ్రీ రావి నారాయణ రెడ్డిగారు తమ సందేశాన్ని వినిపించారు. రాబోవుమహాసభ రాయచూరుజిల్లా ఆలంపూరునకు ఆహ్వానించ బడింది. చివరకు సభికు లందరికోరికపై శ్రీ చెరుకువాడ వెంకట నరసింహంపంతులు, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగార్లు ఉపన్యసించారు.

ఆహ్వానసంఘ కార్యదర్శి కృతజ్ఞతావందన సమర్పణానంతరం శ్రీ రుద్రదేవుగారి శాంతిపాఠంతో మధ్యాహ్నం గం 3-0 లకు సమావేశం ముగిసింది. సాయంత్రం గం 4-0 లకు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ సర్వసభ్యుల సమావేశం శ్రీ సీతారామాంజనేయ హిందూవర్తక గ్రంథాలయంలో జరిగింది. సమావేశానంతరం సభకు విచ్చేసిన ప్రతినిధులకు శ్రీ సీతారాంసేట్‌గారు తమయింటియందు అల్పాహార విందు నొసంగిరి. తర్వాత ఛాయాచిత్రము తీయుబడింది. జయజయధ్వానాలతో కార్యక్రమం పరిసమాప్తి జెందింది. సాయంత్రం రైలులో ప్రతినిధులు తమతమ స్వస్థానానికి వెళ్ళారు.

---

# స్వాగత పద్యములు

శ్రీ చందాల కేశవకవిగారు.

ఆంధ్రవైజ్ఞానికులకును ఆంధ్రకవుల
కాంధ్రనాయకులకును మాయాంధ్రజనని
కాంధ్రదేశపు గ్రంథాలయముల సభకు
స్వాగతం బిది గొందు సుస్వాగతంబు!

శ్రీకాకుళపు మహాశ్రీకి సంతతి నెల్ల
నొకచోటజూడ కోరికయొ యేమొ
ధాన్యకటకపు రాజధాని దర్బారును
మచ్చికై గనుగొను ముచ్చటేమొ
గోదావరీకృష్ణలే దాదులై సాక
పెరుగు జోదుల గాంచు మురిపెమేమొ
భరతభూమికి సార్వభౌములై
పాటలీపుత్ర మేలుటగాంచు బుద్ధియేమొ
ఆంధ్రమాతకు బిడ్డలమైన మనల
కొలువు సేయించి గద్దెపై కొడుకు నుంచి
పాతవైభవమెల్ల నీవగిదిజూచి
చిత్తశాంతిని కొంతేని జేసుకొనునొ?

ఆంధ్రవిజ్ఞాన చంద్రిక లఖిలదిశల
వెల్లివిరిసెను విశ్వమే వినుతిసేయ
అట్టివిద్యానగర దీప్తులందు కొన్ని
ఇందు గననయ్యె ధన్య. విల్లెందుపురము.

జాతిరతనాల గనివోలు జాతి నకట
చిల్లకొల్లారుగా జిమ్మి చెరగివైచె
పిల్లలను మేప వెలసిరీ బ్రిటిషు కోడి
విభజనము వారి రాజ్యాంగ విధముగాన.

జాతినిటు వేరు సేయగా జాలగాని
తరముగాదయ్యె జాతీయతను హరింప
మాడపాటియు అయ్యంకి జోడుశక్తు
లిట్లు వైజ్ఞానికపు నేస్తమాయ లేదె? 5

ఒక్కనెత్తుటి చుక్కతో నుద్భవించి
కాలవశమున వేరైన కారణమున
ఆంధ్రజాతీయతను జీల్చనగునె నదులు
చీలి ప్రవహించి ఒకటిగా జాలవౌకొ!! 6

తెలుగువానికి తెలియని కళలు కలవా?
పోషణము జీర్ణమై పోయెగాక
దొరతనము మాతృభాషను గరపదొకటి
ధనికులకు విద్యయెడ ననాదర మదొకటి. 7

జాతిచైతన్యమును గాంచి ఖ్యాతినంద
గోలుపోయిన స్థైర్యముఁ గూర్చుకొనగ
ఒక్క గ్రంథాలయము దక్క దిక్కుగలదె
ఎన్ని విధముల తర్కించు కున్నగాని. 8

ధనికులెల్లరు ధనము గ్రంథముల కొరకు
కొంతలో కొంత దాన మీకున్న యెడల
విద్యగలవారు జనులకు విద్య నేర్ప
కున్న దేశమునకు క్షేమమున్న సున్న. 9

ఇట్లు,
చందాల రామకవి

# స్వాగతోపన్యాసము

శ్రీ కోదాటి నారాయణరావుగారు.

సోదరులారా!

దట్టముగా వ్యాపించియున్న కారు చీకట్లను పారద్రోలి దేశాన్ని ప్రకాశవంతంగా చెయ్యవలెననే తదేక దీక్షతో అనేక కష్టాల నెదు రొ్కంటూ గ్రంథాలయోద్యమాన్ని ముందుకు సాగించుకుపొయ్యే మీకందరికీ మాప్రేమపూర్వక స్వాగతము!

దేశములో అవిద్యను అజ్ఞానాన్ని నిర్మూలించవలెనంటే విద్యాలయాలెంత అవసరమో అంతకన్న గ్రంథాలయాలు ఎక్కువ అవసరం. ఈనాడు గ్రంథాలయమంటే అక్షరాస్యులకు మాత్రమే పనికివచ్చే పుస్తకశాలగాదు. నిరక్షరాస్యులకు విద్యాభిరుచిని కలిగించి చదువు నేర్పే వయోజన విద్యాలయం. అక్షరాలు రానివారికికూడా శ్రవణేంద్రియముద్వారా ప్రపంచజ్ఞానాన్ని బోధించే విజ్ఞాన ప్రచారసంస్థ. తోలుబొమ్మలు, సినిమాలు, మ్యాజిక్ లాంతర్లు మొదలైన దృశ్యమార్గాల మూలంగా ప్రపంచజ్ఞానాన్ని నేర్పే జ్ఞానదాయిని. చివరకు గ్రుడ్డివారికికూడా చదువునేర్పే విద్యాపీఠము.

ఇట్టి మహాసంస్థల నడిపించుటకు పూనుకొన్న మిమ్ముల నందరిని ఒకవేదికపై సమావేశపరచి విజ్ఞానవ్యాప్తికై సులభమార్గముల వెదకింప జేయగలుగు అవకాశము మాఆహ్వాన సంఘానికి లభించుట మహాభాగ్యము.

మిమ్ము ఆహ్వానించిన ఈసభ ప్రత్యేక ప్రాముఖ్యత గడించుకొన్నది. ఉత్తరసర్కారులు, తెలంగాణా, రాయలసీమ మొదలైన వివిధప్రాంతాలలో ఉన్న ఆంధ్రులంతా ఒకసమిష్టి వేదికపైన సమావేశము కావటము ఇదే మొదటి పర్యాయము. ఇది ఆంధ్రజాతి కల్యాణానికి, ఆంధ్ర సంస్కృతి పునర్నిర్మాణానికి ఒకనూతనశోభను చేకూర్చగలదని మానమ్మకము. ఈసమావేశము గ్రంథాలయోద్యమ

చరిత్రలో ఒకనూతన ఘట్టాన్ని ప్రారంభించి ఇతర రాజకీయేతర ఉద్యమాలన్నిటికీ దారిచూపించ గలుగుగాక!

మహాంధ్రజాతి నవయుగ నిర్మాణము తెలంగాణాను వదలివేస్తే అసమగ్రమే కాదు, అసహ్యాస్పదం కూడా అవుతుంది. అసఫియా ప్రభువుల యేలుబడిలోనున్న ఆంధ్ర ప్రజానీకం భారతదేశం అంతటాగల తెలుగు బిడ్డలసంఖ్యలో మూడవవంతు. ప్రదేశవైశాల్యాజూచిన ఆంధ్ర భూభాగంలో అంతే. చరిత్ర దృష్టిలో చూస్తే తెలంగాణాలోని ప్రతిశిల ఆంధ్రజాతి ప్రాచీనవైభవాన్ని చాటుతున్నది. ప్రతిరాయీ, ప్రతివాగూ ఇంకా ఆంధ్రుల యశోగానాన్ని చేస్తూనేవున్నవి. ఇంతేగాదు, పూర్తిగా విదేశవ్యామోహం ఇంకా ఆవహించకపోవటం వల్ల ప్రాచీన సాంప్రదాయ చిహ్నాలు, భాషాప్రయోగాలు, తెలంగాణాలోనే ఎక్కువగా దొరుకుతవి. ఈ విధంగా పెనవేసుకొన్న మమ్ములను విడచిన ఆంధ్ర జాతీయతకు అర్థమే లేదు.

సామాజిక జీవితములో రాజకీయాల ప్రభావము చాలా గాఢమైనదిగా ఉంటుందనడంలో సందేహం లేదు. దైనందిన జీవితములోని సమస్యలన్నిటిని ఈ దృక్కోణముతంచే చూడవలసి వస్తుంది. కాబట్టి బ్రిటీష్ ఆంధ్రులకు, నిజామాంధ్రులకు చాలా సమస్యలు విభిన్నముగా వుంటవి. అంతమాత్రముచేతనే సమిష్టి వేదిక లేదని అనుకోవటం పొరబాటు. నిద్రాణమైయున్న మమ్ములను మేల్కొల్పిన ఆంధ్ర సేవామూర్తి శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు యీ విషయాన్ని విస్పష్టము చేశారు. వారు చూపించిన త్రోవయే మమ్ములనీ ప్రయత్నానికి పురికొల్పింది

## నిజాంరాష్ట్ర ఆంధ్రగ్రంథాలయోద్యమము

బ్రిటీష్ భారతదేశపు అభివృద్ధికీ సంస్థానాలప్రజల అభివృద్ధికిగల తేడాయే బ్రిటీష్ ఆంధ్రులకు మాకు ఉన్నది. అభ్యుదయావకాశాలు చాల తక్కువగా వుండటంవల్ల మాఅభివృద్ధి తాబేటి నడకన సాగు

చున్నది. అంతేకాని, సేవాదీక్ష తక్కువయైకాదు. ఇరువదవ శతాబ్దారంభమునుంచి నేటివరకు ఆంధ్రాభ్యుదయ కృషి సాగుతూనే వున్నది.

మానవుని ప్రాథమిక స్వత్వాలు లేశమైన అనుగ్రహింపబడని మేము ఈ కాస్త ముందుకు సాగామంటే ఎంతగట్టి విసుగులేని సేవా దీక్ష మాకున్నదో వూహించుకోవచ్చును. మాయీ సేవాదీక్షకు గ్రంథాలయోద్యమమే పట్టుకొమ్మ యైనది. మాయీ సభాప్రయత్నాలలో జరిగిన పరిశోధనలో నిజాంరాష్ట్రములో మొదటి గ్రంథాలయం క్రీ. శ. ౧౮౭౨లో స్థాపించినట్లు బయటపడ్డది. ఇదే రూఢియైతే ఆంధ్ర దేశానికల్లా మొదటి గ్రంథాలయ మిదేకావచ్చును. కాని, చైతన్య పూరితమైన సార్వజనిక గ్రంథాలయాల్లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయాన్ని ౧౯౦౧ లో శ్రీ రావిచెట్టు రంగారావు దంపతులు చెమటోడ్చి నెలకొల్పారు. గ్రంథాలయోద్యమ సేవకులమైన మనకు ఆదంపతులు చిరస్మరణీయులు, సానుభూతిపూరితమై గ్రంథాలయానికి అంకితమైన యీదంపతుల త్యాగ జీవిత చరిత్రను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము ప్రకటించుగాక!

నాటినుంచీ నేటివరకు అవిచ్ఛిన్నంగా గ్రంథాలయోద్యమము సాగుచున్నది.

నిజాంరాష్ట్రాంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి సారథియైన హనుమంతరావుగారే గ్రంథాలయోద్యమానికి అధినేత. ఇప్పుడు రాష్ట్రంలో రెండువందల గ్రంథాలయాలకుపైగా వున్నట్టు తెలుస్తున్నది. కనీసం నూరైనా బాగాపనిచేస్తున్నవని అనుకోవచ్చు.

గ్రంథాలయాలన్నింటిని ఒకవేదికపైకి తీసుకవచ్చు ప్రయత్నములునూ్న జరిగినవి. కాని అనుకున్నట్లు సఫలముకాలేదు. రెండు నిజాంరాష్ట్రాంధ్ర గ్రంథాలయ మహాసభలు జరిగినవి. గ్రంథాలయ సంఘము స్థాపించబడి కొంతపని జరిగించింది. తిరిగి నిద్రావస్థను పొందింది. శుభోదయ సమయమైన ఈవేళ దేశారాధకులైన యువకసేవకులు దీక్షబూనితే విజ్ఞానోద్యమం వెల్లివిరియగలదు.

## ఒరంగల్ జిల్లా

తెలంగాణా ప్రాంతంలో ఒరంగల్ జిల్లాకు ప్రత్యేక ప్రాముఖ్యత వున్నది. ఇది కేవల చారిత్రకప్రఖ్యాతియే కాదు. ఆధునికాభ్యుదయ కృషికికూడా శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం తరువాత రెండవ గ్రంథాలయం హనుమకొండది. రాష్ట్రంలో ౨౦౦ గ్రంథాలయా లలో ౫౦ కి పైగా యీ జిల్లాలే.

ప్రథమ నిజాంరాష్ట్ర ఆంధ్ర గ్రంథాలయ మహాసభ యీ జిల్లాల లోనే సమావేశమైనది. నేడు యీ జిల్లా అన్నిరంగాలలోను ప్రాముఖ్యతను గడించుకొంటున్నది. ఇది నేను గర్వింపదగిన విషయమని చెప్పడము గాదు. అందువల్ల సోదర ప్రాంతీయులకు దారిచూపించవలసిన బాధ్యత ఒరంగల్ జిల్లాదై యున్నది. ఈ ౨౫ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను మేము ఆహ్వానించి సాహసించిన దందుకే

ప్రతిభావంతులు, ప్రభావవంతులు, విద్యాధికులైన ధనికులు చాలమందివుండగ ఇవియేవిలేని, చివరకు సంఖ్యాబలము, అనుభవం కూడాలేని కొద్దిమంది యువకులు యీ ప్రయత్నానికి పూనుకొన్నారు. చాలసాహసమే. కాని దేశాభివృద్ధికి గ్రంథాలయాలు ప్రథమసోపానాలన్న విశ్వాసము మమ్ములను నిందులకు పురికొల్పినది. ఎవరోఒకరు పూనుకో వలెగదా? అందుకై శక్తికిమించిన పనియైన సాహసించవలసి వచ్చినది. ఒరంగల్లు తెలంగాణములో ప్రాముఖ్యత గడించినదన్న మాత్రంలో, జిల్లాఅంతా అభివృద్ధికరమైన ప్రాంతమని తలచరాదు. జిల్లాయందు సగముకుపైగా వెనుకబడ్డప్రాంతమే. ములుగు, పాకాల, ఇల్లెందు, పాల్వంచ తాలూకాలును, గార్లజాగీరును, పాల్వంచసంస్థానమును మన్యప్రాంతాలు. మానుకోటతాలూకా పూర్తిగ మన్యప్రాంతంగాకున్నా వెనుకబడ్డదే. ఎటుతిరిగి మధిర, ఖమ్మం, ఒరంగల్లు తాలూకాలు మాత్రమే కొంతవరకు ప్రసిద్ధి జెందినవి.

ఈ వెనుకబడ్డ ప్రాంతాలలో గూడా కాళరాత్రిలో చుక్కలవలె గ్రంథాలయాలున్నవి. గ్రంథాలయసేవకులు వ్రేళ్లపై లెక్కపెట్ట

తగ్గవారే వున్నారు. కాని వీరిని ప్రోత్సహించి పనిచేయించవలసిన బాధ్యత అభివృద్ధిచెందిన ప్రాంతాలవారిదే. ఇదిగమనించియే మా ఆహ్వానసంఘ కార్యదర్శులు ఈ మహాసభను మాప్రాంతమున చేయ సమకట్టినారు. తరుచు ఇట్టిసభలు జరుగుట మూలంగా ఈ ప్రాంతాలుగూడా అభివృద్ధిలోనికి రాగలవు. ఈ ప్రదేశము సింగరేణి కాలరీస్ కంపెనీ ప్రారంభంతోనే ప్రాముఖ్యతను సంపాదించిన పల్లె పట్టు. యిక్కడనుండి కంపెనీవ్యవస్థ తొలగుటతోడనే ప్రాముఖ్యత గూడా పోయినది. నేను మాపురమొక బ్రతికిచెడ్డవాని సంసారము వంటిది. ఎట్టిసౌకర్యములులేని మారుమూల. అడవిప్రాంతము. శ్రీ సీతారామాంజనేయ హిందూవర్తక గ్రంథాలయమొకటే పురపు ప్రధానప్రజాసేవా సంస్థ.

మీరు దూరదూరాలనుంచి చాలా శ్రమవహించి వచ్చారు. విజ్ఞులు, దేశారాధకులు. మాపరిస్థితులు మొదటనే మేము తెలిపినాము. మేముచేయు నేర్పాటులలో అనేక లోపాలున్నవని మీకు తెలుసు. కాని మాశక్తి చాలమి లోపాలుండటం అనివార్యమైనది. దేశసేవాభిలాషతప్ప మరే శక్తిలేని మాయధార్థస్థితిని తెల్పి సానుభూతితో లోపాలను మన్నింప ప్రార్థించుటకంటే మేము ఏమి సపర్యలు చేయగలము?

మరొకసారి మేము మా హృదయపూర్వకమైన స్వాగత మిస్తున్నాము. మన మందరము శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి నాయకత్వమున ఈ సభను జయప్రదముగ, చరితాత్మకంగాను కొనసాగింతము. శ్రీరామకృష్ణారావుగారు బహుభాషా కోవిదులు, కవులు, రాజకీయవేత్తలు, ఆంధ్రనాయకులు. ఇంతేకాదు, ఈ రాష్ట్రములో ప్రధాన గ్రంథాలయమైన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయానికి వారు కార్యదర్శిగనుండి రజతోత్సవమును మహావైభవముగ జరిపించారు. వారిజోక్యములేక యీనాడు మా రాష్ట్రములో యేఅభ్యుదయోద్యమముగాని జరుగుటలేదు. అట్టివారు మనకు సభాపతి.

శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు మీకు చిరపరిచయులే. వారు ప్రాచీన గ్రంథాలయోద్యమ విషయంలో పరిశోధనచేసి తరచిచూచిన వారు. వారుపత్రికా సంపాదకులు. పండితులు అనేక భాషావైజ్ఞానిక విద్యాసంస్థల నిర్వాహకులు. మనగ్రంథాలయ సంఘానికి ఉపాధ్యక్షులు. ౧3వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభాధ్యక్షులు. నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ వీరి అధ్యక్షతనే ప్రారంభమైనది. ఈ అపూర్వ మహాసభగూడ వీరి చేతిచలువనే ప్రారంభింప బడటం భవిష్యత్తుకు శుభచిహ్నము. శ్రీ రెడ్డిగారికి సభాప్రారంభానికి స్వాగత మిస్తున్నాను.

ఇట్లు,

కోదాటి నారాయణరావు

# ప్రారంభోపన్యాసము

శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు, బి.ఎ.. బి ఎల్.,

చాలాకాలానికి ఆంధ్రగ్రంథాలయ భాగీరథి మా తెలంగాణము దిక్కు ప్రవహించినది. మేము పవిత్రుల మైనాము. తెలంగాణములో ఆంధ్ర సరస్వతి తన రజతోత్సవమును చేసుకొనుచున్నదన్నమాట. రజతోత్సవము బొగ్గుగనులలో జరుగుట అపూర్వసంఘటనము కాదా? బొగ్గులనుండి మణులు సిద్ధమగునని రసాయనశాస్త్రవేత్తలంటారు. కావున విరోధాభాసము కుదిరింది.

బ్రిటిష్ ఇండియాలో యీ ముప్పైయేండ్లలో ౨౮ ఆంధ్ర గ్రంథాలయమహాసభలు చేయుచుండినది గమనించుచూ వచ్చినాము. ఆమహాసభ ఇంతవరకు కృష్ణానదినిదాటి తెలంగాణమునకు వచ్చియుండలేదు. ఇదే ప్రథమపర్యాయము. ఉత్తరసర్కారుసీమయొక్కయు, రాయలసీమ యొక్కయు, తెలంగాణము యొక్కయు భాషా త్రివేణి సంగమము యీసింగరేణికాలరీస్‌లో కలిగినది.

గంగాస్నానానికి కొందుభొట్లు 'ఆజ్ఞ' వలె యీదాసుడు శుభమస్తు, అవిఘ్నమస్తు అని సంకల్పము చెప్పవలెనని గ్రంథాలయ సంచాలకాచార్యుల ఆజ్ఞయైనది. తథాస్తుఅని ఉపక్రమించుచున్నాను. 'భాషాసేవయే రాష్ట్రసేవ' 'భాషావిజృంభణమే ప్రజాభ్యుదయ హేతువు' 'సారస్వతాభివృద్ధియే సంస్కృతివ్యాప్తికి మూలము 'ధనికుల ద్రవ్యము సరస్వతీపూజకే ప్రధానముగా వినియోగము కావలెను' లక్ష్మీపుత్రులు సరస్వతినిగూడా ఆరాధింపవలెను; గణపతియే విద్యాపతి. అతడు శబ్దగణములకు అధిదేవత. మనమతని తిండిపోతనిత్టి విఘ్నేశ్వరుడని పేరుపెట్టి, విఘ్నాలను ఆహ్వానించినాము. విద్యాపోషణమే నిజమైన విఘ్నేశ్వరపూజ. మనప్రాచీనులు విద్యను గులాంగిరికి ఎన్నడునూ తార్చుటకై ప్రయత్నించి యుండలేదు. వారి దృష్టిలో భారతీదేవి ఆడపాప కాకుండెను. ఇప్పుడు మనమేమి చేయుచున్నామో అందరికిన్నీ తెలియును.

విద్య నేర్చుకొనిన చాందసు లౌదురని జనులందురు. "వేదనిదో జడః" అన్న సామెత యీనాటిదా మరి? "బుద్ధిజాడ్య జనితోన్మాముల్ కదా! శ్రోత్రియుల్" అని అన్న పెద్దన్నగారి కాలానికంటే చాలా ముందు కాలములోనే యీ భావన యేర్పడెను. అది వేదముల స్వర సహితముగా కంఠపాఠము చేయుచుండిన వారి ముచ్చట. మనప్రాచీనులు విద్యను ఆశ్రమాలకు పనికివచ్చుటకొరకు మాత్రమే సాధించి యుండలేదు. జనకాదులు రాజ్యవ్యవహారములు సాగించుచూ ఋషులకే బోధించిరి. వారికాలములో విద్య సర్వకల్యాణములకు ఆధారమై యుండెను. అది ఒక వర్గమువారికి గుత్తాగా ఏర్పడి యుండలేదు.

గృహ్యసూత్రాలలో విద్యవలన ధనము, అధికారము సాధించవలెనని శాసించిరి.

జైమిని గృహ్యసూత్రములలో ఉపనయన కాలమందు వటువును గూర్చి గురువిట్లు ప్రార్థించవలెనని నిర్ణయింప బడినది.

"ఇమంసోమ, బ్రహ్మణామహే, శ్రోత్రాయ దధ్మసి"
"ఇమం ఇంద్ర, బ్రహ్మణామహే రాష్ట్రాయ దధ్మసి"
"ఇమంపోష, బ్రహ్మణామహే పోషాయ దధ్మసి"

"ఓసోమా! గొప్పవిద్య (శ్రోత్రాయ) యీబ్రహ్మచారికి అలపడవలెనని కోరుతున్నాను."

"ఓఇంద్రా! గొప్పశక్తి (రాష్ట్రాయ) యీబ్రహ్మచారికి లభింపవలెనని కోరుతున్నాను."

"ఓపోషా! గొప్పధనము (పోషాయ) ఈ బ్రహ్మచారికి సమకూరవలెనని కోరుతున్నాను."

ఉపనయనాధికారమును పొందుచున్న బ్రహ్మచారి హోమము చేయుచూ అగ్నినుద్దేశించి ఇట్లు ప్రార్థించుచుండెను.

యథాత్వమగ్నే ! సమిధాసమిధ్యస ఏవమహం, ఆయుషా, వర్చసా, తేజసా, సన్యా, మేధయా, ప్రజ్ఞయా, ప్రజయా, పశుభిః, బ్రహ్మవర్చసేన, అన్నాద్యేనధ నేన, సమిధిషీయ స్వాహా

'అప్సరాసు యామేధా గంధర్వేషుచ యన్మనః
దైవీమేధామనుష్యజా సామామేధాసురభిర్జుషతాం'

'ఓ అగ్నిదేవా! నాకు ఆయుష్యమును, వర్చస్సును, తేజస్సును, దాన శక్తిని, మేధస్సును, ప్రజ్ఞను, సంతానమును, పశుసంపదను, బ్రహ్మవర్చస్సును, ఆహారసౌఖ్యమును, ధనమును ప్రసాదించి వృద్ధి నొందించుము.

'అప్సరులలో, గంధర్వులలో, దేవతలలో, మనుష్యులలో నుండు దివ్యమగు మేధస్సును నాకుప్రసాదించి సంతోషపెట్టుము.

మనప్రాచీనుల విద్యానిర్వచన మట్టిదైయుండెను. అట్టివిద్యకు ఆశ్రయములైన గ్రంథాలయములు పూజ్యస్థానములని భావించి యుండినచో, మన నేటి గ్రంథాలయాలకు దారిద్ర్యమావరించి యుండ కుండెడిది. పుస్తకాలయములలో పురుషుల దివ్యబోధామృతమున్నది. అందే అభిలషితార్థ చింతామణులున్నవి. పుస్తకాలయాలే విజ్ఞానకామ ధేనువులు- ప్రజ్ఞాకల్పవృక్షములు. ఇక గ్రంథాలయాలు నందనవన ములు కావనగలవా?

తెనుగుదేశములో పండితుల స్వంత పుస్తకాలయములు (Private Libraries) ఎన్నికలవో విచారించినవారులేరు. గ్రంథా లయమహాసభవారికి క్రొత్తపనిని నేను సూచించి కల్పించుచు న్నాను. మన తెనుగుసీమలో ఎందరో గొప్పపండితులున్నారు. వారిలో కొందరివద్దనైనా మంచి పుస్తకాలయము లుండును. అట్టి గ్రంథాలయములలో ఒక్కొక్కదానియందు రెండుమూడువేల పుస్తకములైనను ఉండును. బహు పండిత పుస్తకాలయములలో చాలా విలువగలవి, ఇతరత్ర లభ్యముకానివి, అరుదైనవి, అచ్చులో లేనివి, అచ్చై దొరకనట్టివి, ప్రాచీనకవిపండితుల హస్తాక్షరివి, ఇట్టి వెన్నియో గ్రంథాలు కలవు. అట్టి విశిష్టతతో కూడిన వివరములను ఈ మహాసభవారు తెప్పించుకొనవలెను. ఒక్కొక్కరికి ఒక్కొక్క శాస్త్రమం దభిమానముండును. ఒకరు సంస్కృతపుస్తకాలను సమ

కూర్తురు. ఒకరు తెనుగు పద్యకావ్యాలను, ఇంకొకరు చరిత్ర గ్రంథాలను, మరొకరు వైద్య గ్రంథాలను, యీవిధముగా ఆత్మాభిరుచికొలది పుస్తకాలు కూర్చుకొను చుందురు. ఎందరో విద్యావంతులు బీదవారైనను, కష్టించి సంపాదించినంత ఈ గ్రంథములు కొనుటలో వ్యయముచేసి ఆగ్రంథాలతోనే ఆనందింతురు. వారి గ్రంథాలే వారి యావదాస్తి. సాహుకారులు తమ నోట్ల కట్టలను ఉక్కు పెట్టెలలో పెట్టి దినదినము వాటిని చూచుకొని మురిసి పోదురు. అట్లే పండితులు తాటాకులను, శాస్త్రాల కాగితాలను చెక్కలమీద పెట్టి వాటిని తిరుగవేయుచూ ఆనందింతురు. 'ఆనందో బ్రహ్మ' మటన్న ప్రాజనువులంతకష్టపడి సాహింపుమా' అని వరూధినీ విలాసవతి కూడా అన్నది! నోట్లకట్టల సాహుకారు, తాటాకు కట్టల పండితుడు ఉభయులును సమానముగా ధనికులే!

మనదేశములో ప్రభుత్వ గ్రంథాలయాలు చాలాతక్కువ. కళాశాలలలోని పుస్తకాలయాలు చాలాగొప్పవి. కాని అవి కేవలము కళాశాలాధ్యాపకులకు, విద్యార్థులకూ పరిమితి కలవైనవి. అది అన్యాయమనియు, ప్రజల ద్రవ్యముతో కొన్నట్టి గ్రంథాలను ప్రజలకు వినియోగపడునట్లు ఏర్పాట్లు కావించవలెననియూ, నేనుపలుమారు వ్రాసియుంటిని. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారు దీనిని గూర్చి శ్రద్ధవహింపవలెను.

"విజ్ఞాన మానందం బ్రహ్మ" అను శ్రుతివాక్యాన్ని మావిజ్ఞాన వర్ధనీపరిషత్తువారు తమ అభిమాన ధ్యేయము (motto) గా నిర్ణయించుకున్నారు. పుస్తకాలయములు విజ్ఞాన ప్రదములు గావున వాటి వలన బ్రహ్మానందము తదభిమానులకెంతా కలుగును.

మ. ఘ. వ. నిజాంగారు గొప్ప పుస్తకాలయాభిమానులని ఇటీవలనే వెల్లడియైనది. ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంఘాధ్యక్షులై యుండిన కీ. శే. బహద్దరు యార్జంగుగారి సొంతపుస్తకాలయమును ముస్లింసంఘానికై ఇచ్చివేయు చున్నానని శ్రీనరితో కీర్తిశేషుల భార్య మనవిచేయగా దానిని వారెంతో కొనియాడి "నిజముగా

ఇది చాలా మంచినిర్ణయము. ఇది ప్రశంసాపాత్రమైనది" అని ఒక పత్రికలో ౧౦ ఆగష్టు ౧౯౪౪ నాడు లిఖించి యుండిరి. దీనినిబట్టి గ్రంథాలయోద్యమమునకు హైదరాబాదు సంస్థానములో ఉజ్జ్వల భవిష్యత్తు కలదని ఆశింప వచ్చును.

౨౧వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు వ్యాప్తిని, వికాసమును, విజయమును మనఃపూర్వకముగా కోరుచున్నాను.

ఇట్లు,

సురవరము ప్రతాపరెడ్డి

# అధ్యక్షోపన్యాసము

శ్రీ బూరుగుల రామకృష్ణారావుగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

ఈ ఇరువదైదవ అయిదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభయొక్క అధ్యక్షస్థానమును నాకొసగి గౌరవించినందులకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారికి నేను మిగుల కృతజ్ఞుడను. మహాసభయొక్క పూర్వపు సమావేశములందీ గౌరవస్థానమును సుప్రసిద్ధులగు శ్రీ కాళహస్తి, ఉయ్యూరు, పోలవరం మున్నగు సంస్థానాధీశులును, శ్రీ సర్ అన్నెం పరశురామపాత్రో, స్వామి వెంకటాచలంచెట్టి, గద్దె రంగయ్య నాయుడు గారలు మున్నగు శాసనసభా సభ్యులును, కీ. శే. దేశోద్ధారకుడు, ఆంధ్రరత్న, శ్రీ వేమవరపు రామదాసు పంతులు మున్నగు దేశభక్తులును, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు, తల్లావఝుల శివశంకర శాస్త్రిగార్ల వంటి కవిపుంగవులును, కీ. శే. చిలుకూరి వీరభద్రరావు, డాక్టరు బుర్రా శేషగిరిరావుగారలు మరియు మిత్రులైన శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారి వంటి పండితోత్తములును, మరియనేకులు సమర్థతతో నలంకరించి యున్నారు. అట్లే యీమహాసభకును అల్పజ్ఞుడను, అసమర్థుడనునగు నాబదులు మరియొకరి నెన్నుకొనుట కవకాశముండినను, ఈగౌరవము నాకొసంగబడుటకు మహాసభయొక్క కార్యకర్తల వాత్సల్యప్రేమలే కారణములుగాని, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకుగాని, ఆంధ్రోద్యమమునకుగాని నేనుగావించిన ఏస్వల్పసేవవల్లను నేనందుల కర్హుడను కాలేను. కావున నీగౌరవమున కిమ్మడి విలువగలదని భావించుచు నాహృదయ పూర్వకముగు ధన్యవాదముల నర్పించుచున్నాను.

## ప్రాచీన గ్రంథాలయములు

గ్రంథాలయములు భారతదేశముయొక్క పురాతనమైన సంస్థలు. ప్రపంచమునకు మొట్టమొదట జ్ఞానభిక్షపెట్టినవారిలో మన యార్యు లగ్రగణ్యులు. కాల్డియనులు, బాబిలోనియనులు, అస్సీరియనులు, ఫినీషియనులు, ఈజిప్టువారు, చీనులు మున్నగు ప్రాచీన

౨౫ వ ఆం. దే. గ్రం. మహాసభ



అధ్యక్షులు

శ్రీ బూరుగుల రామకృష్ణారావు గారు

పేజి. 18

నాగరికజాతులయొక్క చరిత్రకంటె ఆర్యుల నాగరికత పురాతన
మైనదని నిర్ణయించుటకు మొహెంజోదారో, హారప్పా పరిశోధన
లవకాశ మొసంగుచున్నవి. ఖాల్డియా దేశమందు క్రీ. పూ. ౩౮౦౦
సంవత్సరములనాడు పచ్చియిటుకలపై వ్రాసి కాల్చి భద్రపరచిన గ్రంథ
ములను సేకరించి అక్కడి రాజు స్వాంతగ్రంథాలయమును స్థాపించి
యుండెనట. మొహెంజోదారోలో కనిపెట్టబడిన కాల్చిన ఇటుకలు
కనీసము ఆరువేల సంవత్సరముల పూర్వపువని పరిశోధకుల యభిప్రా
యము. వాటి లిపిని తెలిసికొను ప్రయత్నములు జరుగుచున్నవి.
అట్టియెడ మనదేశమునందును ప్రాచీనకాలమున గ్రంథాలయములుండి
యుండునని యూహించుట సాహసముకాదు. చిరకాలమువరకు మన
పూర్వులు గ్రంథములను కంఠస్థమొనరించియే విజ్ఞానమును సేకరించి
యుండిరి. పిదప లిపికారులు భూర్జపత్రములు, కార్పాస పట
ములు, కఱ్ఱపలకలు, వృక్షపర్ణములు (ముఖ్యముగా తాటా
కులు), చర్మము, దంతము, లోహములు (ముఖ్యముగా రాగిరేకులు),
రాయి, ఇటుక మున్నగువాటిపై గ్రంథములను వ్రాసిరని, యుప
లభ్యములైన ఉదాహరణముల వలన దెలియుచున్నది. మొట్టమొదటి
కాగితము దాదాపు క్రీ. శ. ౧౧వ శతాబ్దమున మనదేశమునందు
వాడుకకు వచ్చెనని చారిత్రకు లూహించుచున్నారు. ఏపదార్థముపై
వ్రాసినను గ్రంథముల ప్రతులను వ్రాయుట, వ్రాయించుట పూర్వ
కాలమునుండియు వాడుకలోనుండి వాటిని సేకరించి, విజ్ఞాన
పిపాసువులగు వారి కుపలభ్యము లగునట్టుల రక్షించియుంచు పద్ధ
తియు మనకు సనాతనమగు ప్రాచీన సాంప్రదాయమే. సరస్వతీ
భాండారములని యీ నిలయములకు పేర్లు. బౌద్ధ యుగమందు
(ముఖ్యముగా కనిష్కుని కాలమందు)ను, శ్రీహర్షుడు మున్నగు గుప్త
వంశీయరాజుల కాలమందును, గ్రంథాలయములు ప్రాముఖ్యత
వహించి యుండెననుటకు సందియములేదు. మహమ్మదీయ యుగా
రంభమున ఉత్తర హిందూస్థానమున కొంత సన్నగిల్లినను, దక్షిణప్రాంత
మున రాచకొండ పద్మనాయకులు, కొండవీటి రెడ్డిరాజులు, విజయ
నగర సామ్రాట్టులు, తంజావూరు నాయకులు మున్నగు రాజులాదర

తమ యాజమాన్యమున విజ్ఞానాభివృద్ధికి మూలాధారములగు గ్రంథ భాండాగారములను నెలకొల్పిరి. నలందా, విక్రమశిల, ఉద్దండ పురి, ధాన్యకటకము మున్నగు ప్రాచీన విశ్వవిద్యాలయములందును, ఇతర ధార్మిక పరిషత్తులందును, గ్రంథాలయము లుండెడివి. క్రీ. శ. మొదటి శతాబ్దములందు 'ఘటిక' యను పేర కొన్ని పరిషత్తులున్నట్లును, నవి విజ్ఞాన ప్రసారముయొక్క ముఖ్య కేంద్రములుగా నున్నటులును తెలియు చున్నది. ఈ రాష్ట్రములోని వైరెల్వే స్టేషను వాడికి సమీప మున, 'నాగాయి' యనుస్థలమున గొప్ప ఘటికాశాలయొక్క నిర్మా ణము కనిపెట్టబడినది. అక్కడలభించిన క్రీ. శ. ౧౧వ శతాబ్దముయొక్క చాళుక్య శాసనములవలన నా విశ్వవిద్యాలయము దార్గురు గ్రంథ పాలకులు (సరస్వతీ భాండారికులు) గల గ్రంథాలయములున్నట్లు తెలియుచున్నది. శిలానిర్మితమైన గ్రథాలయమందిర శిధిలములు కనిపెట్టబడినవి. ఇట్టి బౌద్ధుల విహారములందును, సంఘారామము లందును, జైనుల ఉపాశ్రయమ్ములందును, సనాతనుల దేవాలయము లందలి పురాణ వ్యాకరణ మంటపములందును, ధర్మాధిపతుల మఠము లందును, రాజుల దర్బారులందును, గ్రంథభాండాగారములు విరివిగా నుండినటుల స్పష్టముగా చరిత్ర చాటుచున్నది. పూర్వము కాశ్మీర, నేపాళ దేశములందును, మరియు భోజుడు, చాళుక్య విశాల దేవుడు, రాజరాజ నరేంద్రుడు, మనుమసిద్ధి, ప్రతాపరుద్రుడు, అనవేమ, కుమారగిరి భూపాలుడు, సర్వసింగ మహీపాలుడు, కృష్ణ దేవరాయలు మున్నగు మహీశుల కాలమున నీదేశమున కలిగిన సారస్వతాభివృద్ధికి సరస్వతీ భాండారములే కేంద్రములుగా నుండె ననుట సత్యము. చాళుక్య విశాలదేవుని 'భారతీ భాండార' మాకాలపు ఇంపీరియల్ లైబ్రరీ. ఇట్లే వ్యక్తులవద్దను గ్రంథభాండా గారము లుండక పోయినచో మన అలసాని పెద్దనగారికి 'నిరంతర తాళ దళ సంపుట ప్రకరకాంతారంబు సందర్భపుం దెరవాటుల్ దెగగొట్టి తజ్జ పరిషద్విజ్ఞాత చౌర్యక్రియామావిరసుండా' కుకవిని నిందించుటకు దొర కొని యుండదు. ప్రాచీన భారతదేశముయొక్క చరిత్రను తరచినచో మన కనేక యుదాహరణములు లభించుటయేగాక, గ్రంథాలయోద్య

షయముయొక్క ప్రాముఖ్యతను గమనించి ప్రత్యేకమగు కృషి మనమీ కాలముననే సలుపుచున్నామను దురభిమాన మెవరికైన నున్నయెడల నది సంపూర్ణముగా నశించును.

## ఆంధ్ర గ్రంథాలయోద్యమము

మహాజనులారా! ప్రాచీన గ్రంథాలయముల సంగతి కేవలము ముచ్చటగా మనవిచేసితిని గాని, పాతకథలను చెప్పుకొని సంతోషించుటకుగాదు. మనదేశమందలి ప్రాచీన లిఖితగ్రంథసంచయము చీనా, జర్మనీ, ఇంగ్లాండు, ఫ్రాంసు, అమెరికా మున్నగు దేశములను జేరుకొనిన విషయము సర్వవిదితమే. మన యార్థికసంపదలతో పాటు పాశ్చాత్య విజ్ఞాన పిపాసువులచే మన గ్రంథభాండారములును, కళా సంపదలును కొల్లగొట్టబడియెనని తామెరుంగుదురు. ఐనను విజ్ఞానమును, జిజ్ఞాసను ప్రధానముగ జీవితాదర్శముగా పరిగణించు మనకు ఎవరెట్లు కొల్లగొట్టినను తిరిగి సేకరించు కొనుటయే కర్తవ్యము గదా! భారతజాతిని సగౌరవంగా ప్రపంచములోని ఇతరజాతులతో పాటు మరల తలయెత్తుకొని తిరుగునటుల జేయవలయునన్న మన జనసామాన్యమందు ప్రబలియున్న యజ్ఞానాంధకారమును మనయందున్న విజ్ఞానలోపమును రూపుమాపవలసి యున్నది. ఈ యుద్దేశమును దృష్టియందుంచుకొనియే దేశీయ కార్యకర్తలీయుద్యమమును లేవనెత్తిరి. ప్రస్తుత మితర ప్రాంతములందలి యుద్యమచరిత్రను వివరించి మిమ్ము విసిగించ నవసరము లేదు.

మన యాంధ్రదేశమందలి గ్రంథాలయోద్యమము యొక్క చరిత్రను మాత్రము టూకీగా స్మరించుకొనుట మన కర్తవ్యము. ఈ యుద్యమమునందు మొదటినుండి పాల్గొనుచు, దీనికొక ప్రత్యేకమగు విశిష్ట స్వరూపము నొసంగిన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు క్రీ. శ. ౧౮౮౬ సం॥లో విశాఖపట్టణమున సరస్వతీ గ్రంథాలయమను పేర మొట్టమొదట మనయాంధ్రదేశమున సార్వజనిక గ్రంథాలయము స్థాపింపబడినదని తెలిపియున్నారు. పరిశోధకు లెవరేని మరొకచో

నింతకుపూర్వమే గ్రంథాలయమును మరెవరో స్థాపించిరని కనిపెట్టువరకు దీనిని మనము విశ్వసింపవచ్చును. ఎట్లయినను గతశతాబ్దమునం బ్రారంభమైన నీయుద్యమము మాంగ్లేయ విద్యాబీజములు నాటుకొను మొదటి రోజుల నుండియే లోకమునందు బ్రహ్మసమాజము, దివ్యజ్ఞాన సమాజము మున్నగు సాంఘికధార్మికోద్యమములకు చేయూతగా వృద్ధినొందుచు ప్రబలినది. మనయాంధ్రదేశమున మాత్రమిది సుక్షేత్ర మగుటవలన సస్యశ్యామలమై ఫలవంతమైనదని మనము గర్వింపవచ్చును. బరోడారాష్ట్రము తరువాత భారతదేశముయొక్క మరియే ప్రాంతమందును మన యాంధ్రదేశమునందువలె గ్రంథాలయోద్యమ మభివృద్ధి గాంచలేదు. ఈ గ్రంథాలయములు విజ్ఞాన ప్రసారమునకును, జాతీయ వికాసమునకును దోహద మొసంగుచు గావించుచున్న ప్రయత్నములనెల్ల నేకముఖమునకు దెచ్చి గ్రంథాలయోద్యమాభివృద్ధి గావించు నుద్దేశముతో గ్రంథాలయ సంఘమునుగూడ మొట్టమొదట స్థాపించు యశస్సు మన యాంధ్రులకే చేకూరినది.

## ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము

'ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము' స్థాపింపబడి ముప్పదిసంవత్సరములైనది. ఈసంఘమే గ్రంథాలయ మహాసభకు స్థాయిసంఘముగా పనిజేయుచున్నది. జిల్లా గ్రంథాలయ సంఘములు, తాలూకా గ్రంథాలయ సంఘములు, నగర గ్రంథాలయ సంఘములు మున్నగునవి గ్రంథాలయ సంఘమునకు శాఖలుగా పనిచేయుచు నీయుద్యమాభివృద్ధికై పాటుబడుచున్నవి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముయొక్క యాశయము లున్నతములు. దేశమంతట విజ్ఞానమును వ్యాపింపజేయుటకును, ప్రజానీకమందలి నిరక్షరతను అజ్ఞానమును రూపుమాపుటకును, ఈసంఘముయొక్క కార్యప్రణాళిక మిగుల సహాకారి యగును. అయినను ప్రభుత్వమువారుగాని, ప్రజాసంస్థలుగాని యీసంఘముయొక్క ప్రణాళికకు తగిన ప్రాముఖ్యత నొసంగి సహాయము చేయుటలేదని వగవవలసియే యున్నది. గతకాలలో కాంగ్రెసు ప్రభుత్వపు రోజులలో యీసంఘమువారు ప్రభుత్వమున కందజేసిన

నివేదికలో కోరిన అనేక సహాయము లిప్పటికిని లభింప లేదుకదా! లభించుననుయాసగూడా ప్రస్తుతము లేదని చింతింపవలసి యున్నది.

### గ్రంథాలయోద్యమము — ప్రభుత్వము

గ్రంథాలయోద్యమమును ప్రభుత్వమువారలు మొదటినుండి సంశయదృష్టితోడనే చూచుచున్నారు. గ్రంథాలయములు రాజకీయ విప్లవ కేంద్రములుగా పరిణమించవచ్చునని వారిభయము. వంగదేశమునందు స్వదేశీయుద్యమము తీవ్రరూపము దాల్చినప్పుడు కొన్ని గ్రంథాలయము లిట్టి యనుమానమునకు తావొసంగినవట. అందువలన ప్రభుత్వము గ్రంథాలయములను నెలకొల్పుటగానీ, స్థాపింపబడినవానికి సహాయమొనర్చుటగానీ యటుండ, ప్రభుత్వమువారి కర్తవ్యమగు సార్వజనిక విద్యాప్రచారధర్మమును యథాశక్తి నిర్వర్తించు నీ ప్రజాసంస్థలయెడ నిరాధారమగు సంశయభావమును కలిగి అవి చేయుచున్న కార్యమునం దాటంకములు కలుగజేయుచుండును. క్రీ. శ. ౧౯౧౪వ సంవత్సరమునకు పూర్వము మద్రాసు ప్రభుత్వమువారు గ్రంథాలయములకు ద్రవ్యసహాయమొసంగుట తమ ధర్మమునకు విరుద్ధమని భావించుచు గ్రంథాలయములకు మున్సిపాలిటీలు జిల్లాబోర్డులు యిచ్చిన గ్రాంటులుగూడా రద్దుపరచుచు వచ్చిరి. కాని ఆసంవత్సరముననే సర్. పి. యస్. శివస్వామి అయ్యరుగారు ప్రభుత్వ కౌన్సిలు మెంబరుగా నున్నపుడు స్వయముగా బెజవాడ రామమోహన గ్రంథాలయముయొక్క ప్రారంభోత్సవము గావించి, జిల్లాబోర్డులు మున్నగు స్థానికప్రభుత్వకమిటీలు గ్రంథాలయములను స్థాపించి తమ కర్తవ్యమును నెరవేర్చవలయునని హెచ్చరించిరి. అప్పటినుండి స్థానిక ప్రభుత్వకమిటీలు గ్రంథాలయములకు సహాయమొనర్చుచున్నవి. లోకల్ బోర్డుల శాసనముగూడా తదనుసారముగ మార్చబడినది. అందువలననే ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమందు నేడు కొన్ని పంచాయతీబోర్డులు, పరిషత్సంఘములు మున్నగునవి మెంబర్లుగాచేరి యీయుద్యమమును ప్రత్యక్షముగా పోషించుచున్నవి. కాని యీరాష్ట్రమున గ్రంథాలయోద్యమమున కంతటి యదృష్టము పట్టలేదు.

# శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము

క్రీ. శ. ౧౯౦౧వ సం॥లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమును కీ. శే. రావిచెట్టి రంగారావు, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగార్లును, శ్రీమునగాల రాజాగారును, శ్రీమాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు గార్లు మున్నగువారును స్థాపించిరి. ఈగ్రంథాలయమే ఈరాష్ట్రమందలి ఆంధ్రోద్యమునకు పునాది వేసినదనియు నిదియే ముఖ్యమైన ప్రథమవిజ్ఞానకేంద్రమై వెలసినదనియు పలుకుటలో నావంతయు నతిశయోక్తి లేదు. నిజాంరాష్ట్రాంధ్ర జనకేంద్రసంఘము క్రీ. శ. ౧౯౨౨ లో స్థాపింపబడిన పిదప, నీసంఘముద్వారా జరిగిన ముఖ్యమైన నిర్మాణకార్యక్రమము గ్రామగ్రంథాలయ ప్రతిష్ఠాపనయే. ఈ కేంద్రసంఘము నిజాంరాష్ట్రాంధ్ర మహాసభగా మారి ఆర్థిక సాంఘిక రాజకీయాశయములు ప్రాధాన్యత వహించినను, ఆంధ్రమహాసభయొక్క కార్యక్రమ మంతర్గతమై గ్రంథాలయోద్యమము క్రమాభివృద్ధి నొందుచునే యున్నది. ఇప్పుడు దాదాపు ౨౦౦ ఆంధ్ర గ్రంథాలయము లీప్రాంతమందు గలవు. ఈ సంఖ్య నిజామాంధ్ర ప్రాంతము యొక్క గ్రామ జనసంఖ్యలను బట్టి గర్వింపదగినది కాకపోయినను నిరుత్సాహకరము కాదని నేను విశ్వసించుచున్నాను. ఈ రాష్ట్ర ప్రభుత్వమువారింకను పూర్వరక్షక శాఖాధికారిగానుండిన ఆరమ్‌స్ట్రాంగుగారి వైఖరిని వదలలేక గ్రంథాలయములను సంశయపాత్రములైన సంస్థలనియే భావించుచున్నారు. గ్రామములలో నింకను గ్రంథాలయస్థాపకులు, పాఠకులు, చందాదారులు మున్నగువారు రక్షకశాఖవారి ప్రత్యక్షమగు మందలింపునకును, పరోక్షమగు తీవ్రపర్యవేక్షణమునకును గురియగుచునే యున్నారు. ఒకవైపు క్రొత్తరాజ్యాంగ సంస్కరణములు, రెండవప్రక్క యుద్ధానంతర దేశాభ్యుదయ ప్రణాళికలు సంసిద్ధము లగుచున్నవి. కనుక ముందైనా ఈవైఖరి మారిపోయి ప్రభుత్వమువారు గ్రామీణులకు జ్ఞానచక్షువు నొసంగుటకై స్థాపించినట్టి గ్రంథాలయములను పోషించుటకు సంసిద్ధులగుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

# నేటి మన గ్రంథాలయముల ప్రయోజనము

యావదాంధ్రదేశమున దాదాపు ఒకవేయి గ్రంథాలయములు కలవని అంచనా వేయవచ్చును. ఈగ్రంథాలయములన్నియు జాగ్రదావస్థలోనుండి సక్రమముగా పనిచేయుచున్నవని విశ్వసించుట కవకాశము లేదు. వీనిలో నధికసంఖ్య నిద్రాణములైన సంస్థలే. అవి దుమ్ముపట్టిన రెండుమూడు బీరువాలతో, నేమూలనో పడియుండి నేటి యవసరములను బొత్తిగా లెక్కచేయుట లేదనియే ఒప్పుకొనవలసి యున్నది. నాయనుభవము తప్పని ఎవరేని సమాలోచించినచో నేను సంతసించెదను. కొన్ని ముఖ్యములగు పెద్దసంస్థలు యథాశక్తి కార్యక్రమమును సంతృప్తికరముగా కొనసాగించుట వాస్తవమేగాని మన యావదాంధ్రమున ప్రజానీకమునందు ప్రబలియున్న ఘోరమైన యజ్ఞానాంధకారమును తొలగించి సాంస్కృతిక చైతన్యమును కలిగించవలయునన్న మన గ్రంథాలయములు గ్రామోద్ధరణ కంకణబద్ధులగు మన సర్వప్రయత్నములకు కేంద్రములై బహుముఖముగా సేవ చేసిననే మనయుద్దేశము నెరవేరును. వయోజనపాఠశాలలు, రాత్రిపాఠశాలలు, సంచారగ్రంథాలయములు, వ్యాయామశాలలు, క్రీడాగృహములు, ప్రదర్శనములు మున్నగువానికి మన గ్రంథాలయములు కేంద్రములైనచో ప్రజలయందు విజ్ఞానమును చైతన్యమును కలిగించుట కవకాశము లభించును. అభివృద్ధినొందిన పాశ్చాత్యదేశములందు నవీనపద్ధతులపై నడుపబడుచున్న గ్రంథాలయోద్యమము నాదర్శముగా గొనవచ్చును. మన విశ్వవిద్యాలయ గ్రంథాలయములకును, ప్రభుత్వ కేంద్ర గ్రంథాలయములకును, లండన్, ప్యారిస్, బోస్టన్, న్యూయార్క్, బర్లిన్, మాస్కోవంటి నగరములలోగల లక్షలు, కోట్లు గ్రంథసంఖ్య గలిగిన మహాగ్రంథనిలయము లాదర్శములుగా నుండవచ్చును. అవి కేవలము గ్రంథాలయములుకావు; గొప్పవిశ్వవిద్యాలయములు. "An university is a collection of books" అనుకార్లైల్ వాక్యమును "A Library is a true university" అని మార్చవచ్చును. అక్కడి గ్రంథపాలకులు గొప్పపండితులు, విద్వాంసులు. జిజ్ఞాసువులగువారికి ప్రతివిషయముపై

ప్రతిశాస్త్రముపై నెన్ని గ్రంథములుగలవో నన్నిటినిగురించి యవలీలగా దెలుపజాలిన "Walking encyclopaedias" నడవనేర్చిన విజ్ఞాన సర్వస్వములవంటి వ్యక్తులు, బాల, బాలికా, విద్యార్థి, వయోజన, స్త్రీ, సంచార, ప్రదర్శన, పరిశోధన, ప్రచార మున్నగు ప్రత్యేకములగు వివిధశాఖలు గలిగినయట్టి మహా గ్రంథాలయములు దారిద్ర్య పీడితమైన భారతదేశమున నెలకొల్పవలెనన్న నాశను ప్రస్తుత మున గగనకుసుమముగా పరిగణింపవలసియున్నది. కాని, డెన్మార్కు-నార్వే మున్నగు చిన్నదేశములందును, సోవియట్ రష్యాయొక్క గ్రామ ములందును గల కమ్యూను లైబ్రరీలవిధానమును మనదేశకాలపరిస్థి తుల కనుకూలముగా మార్చి మనము సులభముగా ననుకరింపవచ్చును. పూర్వకాలమున మనదేశమందు దేవాలయములు, మసీదులు, మనపా ఠశాలలు, గ్రంథాలయములు, కళాపరిషత్తులు, శాస్త్రపరిశోధనాగా రములు, వ్యాయామ చిత్రలేఖన, నాట్య సంగీత కళామందిరములుగా నుండెను. మనసర్వతోముఖమైన 'సాంఘిక' జీవనమునకు కేంద్రములై విలసిల్లెను.

## నేటిపరిస్థితులు

నేడు కాలము మారినది. దృక్పథములు మారినవి. మారవలెను. కాలవాహిని నెవ్వరరికట్టగలరు? నేటిపరిస్థితులందు మనదేశమం దుద యించిన సూచన జాతీయ వికాసమున కనుగుణరీతిని ప్రజలను దేవా లయము లాకర్షించలేవు. గ్రంథాలయము లాకర్షించ గలుగును. కాని కేవలము గ్రంథసంచయముగావించి చదువగోరినవారి కిచ్చుటకు సిద్ధముగానుండు శుష్క గ్రంథనిలయము లంత యుపకరింపవు. నేడు ప్రతి చదువరియింటికి వానియవసరమును, రుచిని, యభిలాషను కనిపెట్టి తీపుదోవలను, రుచులను దిద్దుచు తగిన గ్రంథముల నందిచ్చి వాని విజ్ఞానమును పెంపొందించవలసి యున్నది. ఈ పనిలో మనము కృతకృత్యులమగుటకు ప్రబలమైన యాటంకములను, నిరక్ష రతను నిర్మూలించుటయే ముఖ్యమైన యుపాయము. విద్యాశాలలు,

రాత్రిపాఠశాలలు, మ్యాజిక్‌లాంతరు (యక్షిణీదీప)సహిత ఉపన్యాసములు, సినీమాప్రదర్శనములు, వైజ్ఞానిక యాత్రలు మున్నగునవి సాధనములు. ఇట్లే విద్యార్థులను, యువతీయువకులను ఆకర్షించవలెనన్న వ్యాయామములు, ఆటలపోటీలు, కవితాగోష్ఠులు మున్నగునవి యనుబంధ కార్యక్రమములుగా నుండవలెను. ఇంతియేకాదు. గ్రామ గ్రంథాలయములను కేంద్రములుగా నొనర్చి గ్రామముల యొక్క సర్వతోముఖాభివృద్ధికై సేవజేయుట కెంతయో యవకాశము గలదు. జాతీయనిర్మాణ కార్యక్రమమునకు గ్రంథాలయములు కేంద్రములుగా మారవచ్చును. నేను గ్రంథాలయోద్యమమందు పనిచేసిన కార్యకర్తను గానందున నందలోని లోతుపాతులను, కష్టనిష్ఠురముల వివరముల నెరుగనుగాని దేశమందంతట నూటికి తొంబదివంతు ప్రజలలో నొక వైజ్ఞానికమగు విప్లవమును గలిగించవలెనన్న తీవ్రమైన సేవిధానమునైన నవలంబించవలసి యుండునని మాత్రము విశ్వసించు చున్నాను. లేనిచో ప్రస్తుత మందగమనముతో జరుగుచున్న విజ్ఞానాభివృద్ధి మనదేశము నున్నతస్థితికి తీసికొనిపోవుట కెన్ని శతాబ్దముల కాలము పట్టునో లెక్కించుట కష్టము.

## మనకర్తవ్యములు

గ్రంథాలయనిర్వహణము నేడొక ప్రత్యేకశాస్త్రము లేక కళగా మారినది. ఉన్నతాదర్శముల ననుసరించి గ్రంథాలయోద్యమమును నడుపవలెనన్న, గ్రంథాలయ నిర్వహణ శాస్త్రమందు సక్రమమగు శిక్షను పొందిన నిర్వాహకులను గ్రంథపాలకులను తయారుచేయవలయును. వారు కేవలము గ్రంథాలయ నిర్వహణ పద్ధతుల మాత్రమే నేర్చినవారుగాక దేశాభ్యుదయమును కాంక్షించి నిరంతర సేవ చేయుటకు సంసిద్ధులగు జాతీయకార్యకర్తలుగా నుండవలెను. గ్రంథాలయములను మాత్రమేగాక వానికనుబంధములుగా, వయోజన పాఠశాలలు మున్నగు సాధనముల నేర్పరిచి వాని నిర్వహించు శక్తిసామర్థ్యములు కలిగినచో వారు కృతకృత్యులగుదురు. ఆవేశహీనమై బడుదుడుకులు

లేని ఈ నిర్మాణ కార్యక్రమమందు, రాజకీయాందోళనము యొక్క
తీవ్రవాహినిలో బడిపోయిన కార్యకర్తల కెక్కువ యభినివేశముండదు
ఈరంగము రుచికరమైనదిగా నుండకపోవచ్చును. కాని, ప్రజానీకి
ముతో ప్రత్యక్ష సంబంధము కావలెననియు, వారిలో సంచలనము
కలుగజేయవలయు ననియు ప్రయత్నించదలచు కార్యకర్తలు విదేశీయ
ములై జనుల కర్థముగాని నినాదములను చేయుచు, బుర్రకథలను
చెప్పుచూ కాలమును వ్యయపరచుటకు బదులు ప్రజాసామాన్యము
యొక్క అభివృద్ధికి గట్టిపునాదుల నేర్పరచు నీయుద్యమముద్వారా
సక్రమముగా దేశసేవకు పూనుకొనిన నెంతయో మేలుచేసినవా
రగుదురు. ఈ రాష్ట్రమందలి ఆంధ్ర జాతీయ పక్ష కార్యకర్తలీ
యుద్యమమును స్వీయపరచుకొని తమ గ్రామ సేవాసంఘ కార్య
క్రమములో దీనిని చేర్చుకొనెదరుగాక యని కోరుచున్నాను.
వివిధ కేంద్రములనుండి వివిధానుభవములను బడసి మహాసభలో
పాల్గొనుటకు విచ్చేసిన తమకు నేను ప్రత్యేకముగా యేసూచనలను
ఒసంగజాలను. శాఖాసభలు జరుగనున్నవి. భారతజాతీయోద్య
మునందును, ఆంధ్రోద్యమ మందును, చిరకాలానుభవము కలిగి
నిరంతరసేవ గావించుచుండిన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు
యం. ఏ., గారివంటి నాయకులు, ఉద్యమ పితామహులు మీ శాఖా
సభలను తమ యధ్వర్యమున జరిపి అవసరములగు సూచనలను తీర్మాన
ములను గావింపనున్నారు. ఉద్యమాభివృద్ధికై యవసరమగు భావి
కార్యక్రమమును తమ యనుభవములనుబట్టి నిర్ణయింప నున్నారు.
తామందరును తమ యనుభవ లాభమునొసంగి కార్యక్రమమునందు
పాల్గొనెదరుగాక యని కోరుచు, నాయుపన్యాసమును పొడిగించక
యింతటితో విరమించుచు, పరమేశ్వరుడు ప్రజాసేవకవసరమైన పట్టుద
లను, శక్తిని, మనలందరికి ప్రసాదించుగాత యని ప్రార్థించు చున్నాను.

ఇట్లు
బూరుగుల రామకృష్ణరావు

# వెనుకటి పనులు : ముందటి విధులు *

శ్రీ పాతూరి నాగభూషణం, బి. యల్. యస్.
కార్యదర్శి, ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము

అధ్యక్షా! సోదర ప్రతినిధులారా! ఆర్యులారా!

ఇరువది యైదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభా సందర్భమున ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము లోగడ సాధించిన పనులను గూర్చియు, ముందు నెరవేర్చవలసిన విధులనుగూర్చియు సంగ్రహముగ నివేదించ దలచితిని. ఈవిషయముల తామందఱు శ్రద్ధతో గమనించి మన సంఘకార్యక్రమము త్వరితగమనమున సాగి మనకృషి ఫలించి ఉద్యమాదర్శము నెరవేరుటకు తోడ్పడగలరని ఆశించు చున్నాను.

1914వ సం. లో బెజవాడయందు సమావేశమైన ప్రథమాంధ్ర దేశ గ్రంథభాండాగారుల సమావేశ ఫలితముగ నీసంఘము స్థాపిత మైనది. నాటినుండి తెలుగునాట మహాసభలు, ప్రదర్శనములు, యాత్రలు, పత్రికాప్రకటనాది బహుముఖ కార్యక్రమముద్వారా నీసంఘము వందలాది గ్రంథాలయముల స్థాపనకు కారణమై అన్నిమూలల ఉద్యమవ్యాప్తిని గావించినది. పట్టణములతోపాటు పల్లెలలోకూడ దీనికార్యక్రమము ప్రాకుటచే జనసామాన్యములో వికాసము, చైతన్యము వృద్ధియైనవి. దీనికి మనజాతీయోద్యమమే ప్రమాణము.

ఆధునిక యుగమున నేయుద్యమముగాని ప్రజలలో వ్యాప్తి జెందుటకు పత్రికాప్రకటన మత్యంతావశ్యకమనుట యెందఱెఱిగినదే. అందునను నిర్మాణాత్మకమగు కార్యములకు పత్రికా ప్రచారము మఱియు ముఖ్యము. గ్రంథాలయముల స్థాపనతో మనపని తీరదు గదా? కాన వీని నిర్వహణమున నడుగడుగునకు మనకడ్డమువచ్చు నభ్యంతరములదాటి, ఇవి శక్తివంతముగసాగి ప్రయోజనకరములగుటకు వలయు నుపాయముల నెప్పటికప్పుడు దెలుపుచు, మనదేశమునను, పరసీమలందును గ్రంథాలయోద్యమ గమనమును గూర్చిన వార్తలను

* ౨౫వ ఆం. దే. గ్రం. మహాసభలో చదివిననివేదిక

వ్యాఖ్యలను బ్రకటించు ప్రత్యేక పత్రికను నడపుటకు మన సంఘస్థాపకులు మొదటనే పూనిరి. త్రైమాసిక పత్రికగ ప్రారంభింపబడిన 'గ్రంథాలయ సర్వస్వము' త్వరలోనే ద్వైమాసిక పత్రికగను, పిమ్మట మాసపత్రికగను వృద్ధిజెందెను. కాని ఈయభివృద్ధి కొన్నాళ్లకు వెనుకబట్టి దీని నిర్వహణ మిగుల వ్యయప్రయాసలతో కూడిన కార్యముగ బరిణమించెను. గ్రంథాలయ విషయములతోపాటు ఆంధ్రులచరిత్ర, సారస్వతములకు సంబంధించిన వ్యాసములుకూడ మొదట దీనియందు ప్రచురింపబడుచు వచ్చెను. ఇట్లెన్నో యవస్థలతో నడుమ నడుమ నాగుచు మరల సాగుచు నీపత్రికా పుత్రిక యెట్లో పదకొండేండ్ల జీవితమును సాగించెను. తదుపరి దీనినిర్వహణము చేతులుమారి 'ఆంధ్ర గ్రంథాలయం' అను పేరుతో ఆంధ్రాంగ్లభాషలలో త్రైమాస పత్రికగ రెండేండ్లు యథాపూర్వముగ నడచి 1942వ సం. నవంబరు మాసమున వెలువడిన కేంద్ర ప్రభుత్వమువారి ఫర్మానాకు గురియై నిలచి పోయెను. గ్రంథాలయములు, వయోజనవిద్యకు సంబంధించిన వ్యాసములు, చిత్రములు, వార్తలు, వ్యాఖ్యలు, గ్రంథసమీక్షలు ఇందు ప్రకటితమయ్యెను. తరువాత ౨౩, ౨౪వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల కార్యక్రమములను, వీనియందు చదువబడిన ముఖ్యవ్యాసములను ప్రత్యేక సంచికలుగ ప్రకటించుటద్వారా పత్రికలేనిలోటు కొంతవరకు తీరెను.

గ్రంథాలయ సేవకులు, గ్రంథాలయమిత్రులు అప్పుడప్పుడితర పత్రికలలో వ్యాసములు వ్రాయుచు, పత్రికల నిర్వాహకులు కొందఱు తమపత్రికలలో గ్రంథాలయ వార్తలను వ్యాఖ్యలను బ్రకటించుచు నుద్యమ వ్యాప్తికి కొంతదోహదమును జేసిరి. ఇట్టిప్రయత్నములు కొన్ని పుస్తకరూపముగూడ దాల్చెను. వీనిలో కీ. శే. సూరి వెంకట నరసింహ శాస్త్రిగారి 'గ్రంథాలయోద్యమ' (Library Movement) మను నాంగ్లవ్యాస సంపుటిని, శ్రీ యాతగిరి లక్ష్మివెంకటరమణగారి 'గ్రంథాలయోద్యమ' మను చిఱుపొత్తమును సంఘమువారే బ్రకటించిరి. ఇటీవల శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు వ్రాసిన 'గ్రంథా

లయోద్యమము'ను సికింద్రాబాదు నందలి దేశోద్ధారక గ్రంథమాల వారు ప్రచురించిరి. శ్రీ యూతగిరి లక్ష్మీవేంకటరమణగారు (కాకినాడ) స్వయముగ 'ధర్మగ్రంథాలయ పత్రిక'ను రెండేండ్లు నిర్వహించిరి. ఇది మొదటి సంవత్సరము మాసపత్రికగను, రెండవయేడు త్రైమాసిక పత్రికగను నడచినది.

వ్రాతమూలకమగు విజ్ఞానముతో పాటు గ్రంథాలయసేవకులకు ఆచరణరూపకమగు శిక్షణయొక్క అవసరమును గూడ మన నాయకులెన్నడో గుర్తించిరి. గ్రంథాలయ నిర్వహణముతో పాటు గ్రామసేవకు సహిత మనుకూలించునట్లు 1920 వ సం-న బెజవాడ యం దీసంఘమువారు నెలదినములు శిక్షణ శిబిరమును నెలకొల్పి 20 మంది యువకులకు తరిబీయతు నిచ్చిరి, 1934 వ సం. లో గ్రంథాలయ వేసవిపాఠశాలను బెజవాడలోనే నడపి 32 మందికి గ్రంథాలయ శిక్షణము నొసగిరి. తిరిగి 1941 వ సం. మే మాసమున బెజవాడ తాలూకా పటమట గ్రామమున 'గ్రంథాలయప్రవేశిక' తరగతి నడుపబడెను. ఇందు శిక్షణ బొందిన 21 మందిలో 12 గురు 'గ్రంథాలయ ప్రవేశిక' పరీక్షలో నుత్తీర్ణులై పట్టముల బొందిరి. 1943 వ సం. మే నెలలో తెనాలిలో నడుపబూనిన 'గ్రంథాలయపాఠశాల' గుంటూరు జిల్లా కలెక్టరు వారి యనుమతిలేక నిలచిపోయెను.

గ్రంథాలయ నిర్వాహకుల కుపకరించు గ్రంథపట్టీల తయారుచేయు సంకల్పముతో శ్రీ వెలిదిండ్ల శ్రీనివాసరావుగారి నీసంఘము ప్రోత్సహించి పనిచేయించెను. వీరుప్రారంభించిన కార్యమును దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు పూర్తిచేయించి ఆంధ్రలోకమున కందజేసిరి. ఇదియే ఆంధ్రవాఙ్మయ సూచిక: ముద్రితాముద్రితాంధ్రగ్రంథముల పట్టిక.

ఉద్యమాభివృద్ధిని మనమున నుంచుకొని పైనవివరించిన పుస్తకములు, పత్రికలు అప్పుడప్పుడు వెలువరించిన పత్రములతో బాటు 1914, 1915 సం. లలో నీసంఘము ఆంధ్రదేశగ్రంథాలయముల చరిత్రల

వరుసగ ప్రకటించెను. బహుధాన్య, ప్రమాది, విక్రమ, వృష, చిత్రభాను సంవత్సరముల నివేదికలు, వయోజనవిద్య మొదటిపుస్తకము, ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మమరణము' ఈసంఘము యొక్క యిటీవలి ప్రచారములు.

గ్రంథాలయ మహాసభలకు పిమ్మట గ్రంథాలయయాత్రలీసంఘకార్యక్రమమున ప్రధానస్థానము నాక్రమించినవి. ఈవిధానమును గ్రంథాలయోద్ధారకులు శ్రీ అయ్యంకివారు కనిపెట్టిరి. ఓపికతో సాగించుచో నివి చక్కని ఫలితముల ప్రసాదించగలవు. అగుటచే వీని వివరముల కొంచెము వివరింతును. కొందఱు గ్రంథాలయసేవకు లొకజట్టుగా చేరి గ్రామములకెంత గ్రంథాలయప్రచారమునకు బయలుదేరుదురు. ఈ జట్టులో ఆరు ముఠాలుండును. 1. ముందుపోవువారు 2. భజనచేయువారు 3. ప్రదర్శకులు 4. గ్రామఫోనుపార్టీ 5. ఉపన్యాసకులు 6. మ్యాజికులాంతరు ప్రదర్శనమును చూపువారు. ఇందు మొదటిముఠా ముందుగపోయి గ్రంథాలయ యాత్రికుల రాకనుగూర్చి గ్రామములో తెలిపి వీరిస్వాగతమున కేర్పాటుల గావింతురు. భజనముఠా ఉదయము 8 గంటలకు మొదటి గ్రామమునకు చేరి భజనచేయుచు నూరేగి తమ రాకయుద్దేశమును ప్రజల కెఱుకపరతురు. తదుపరి స్థానిక గ్రంథాలయము మేదైనయున్న దానినిదర్శించి పరిస్థితుల దెలిసికొందురు. మూడవముఠా వారి గ్రంథాలయ ప్రదర్శనము సమావేశస్థలముకడ నేర్పాటు చేయబడును. గ్రామఫోనుపార్టీవారు తమ సంగీతాది కాలక్షేపముల మూలమున ప్రజల నాకర్షించినపిమ్మట ఉపన్యాసకులు సమావేశమును సాగింతురు. ఈసమావేశములు సాధారణముగ గ్రామముల కూడలిస్థలములందేర్పాటుచేయబడును. గ్రంథాలయము లేనిచోట దానినేర్పరచుటయు, ఉన్నతావున నది చక్కగ జరుగుట కనుకూలముల గలుగజేసియు స్థానిక గ్రంథాలయప్రయత్నమునకు దోహదము చేయబడినవెనుక మ్యాజికు లాంతరు ప్రదర్శనము- ఉపన్యాసము జరిగి గ్రామారోగ్యము, విద్య, సహకారము, గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన విషయములు

బోధింపబడును. మధ్యాహ్నము 12గం. సుమారున భోజనముచేసి రెండుగంటలు విశ్రాంతిగైకొనిన పిమ్మట రెండవ యూరికిపోయి యచ్చటకూడ నిదేవిధమున కార్యక్రమమును సాగించి నాటిరాత్రి కచ్చటనిలచి మరునాడుదయము తరువాతి గ్రామమునకు యాత్రికులు తరలిపోదురు. అనుకూలము ననుసరించి ఈ యాత్ర లొక్కొక్క తాలూకాలోగాని, ఫిర్కాలోగాని యేర్పాటు చేయబడును. పశ్చిమ గోదావరి జిల్లాలో ప్రారంభమైన ఈవిధానము మెల్లగ కృష్ణా, గుంటూరు, కర్నూలు జిల్లాలకుకూడ ప్రాకి మంచిప్రచారమునకు దోహద మొసగెను. ఇరువదియైదు సంవత్సరములు నిరంతర ప్రచార కార్యక్రమమును పలువిధముల సాగించి శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు సంఘ కార్యదర్శిగ పనిచేసినందున పూర్తిగ అధికారేతరోద్యమమైన మన గ్రంథాలయోద్యమము వేరూని దేశమున తల యెత్తుకొని నిలువగలిగినది. అగుటచే నీసంఘము వీరికి గొప్పగా ఋణపడియున్నదనుటకు సందేహములేదు.

1914 వ సం. న ప్రారంభింపబడిన ఈ సంఘము 1924 వ సం. లో 1860 వ సం। 21 వ ఆక్టుక్రింద రిజిష్టరు చేయబడెను. 1939 వ సం. లో దీని కార్యాలయము నిమిత్తము, పటమటలంక (బెజవాడ తాలూకా) లో నొక యకరము స్థలము కొనుట జరిగెను. దీనికైన ఖర్చు రు. 1800-0-0. ఇందు రు. 1,000-0-0 మొత్తమును పటమటలంక వాస్తవ్యులు శ్రీ కొమ్మా సీతారామయ్యగారిచ్చిరి. తక్కిన మొత్తమునకు విరాళముల వసూలుజేసి బాకీతీర్చగా నిప్పుడు రు. 165 నిల్వ తేలినది. భవన నిర్మాణమునకు ప్రస్తుత పరిస్థితు లనుకూలము గాకున్నను, నిధి వసూలు పఱచి నిల్వయుంచుకొన్న పరిస్థితు లనుకూలించుట తోడనే భవన నిర్మాణమునకు గడంగ వచ్చును. ఈ ప్రయత్నమును మనము చేయవలసి యున్నది. కాలమును కొంచె మనుకూలముగనే యున్నది.

మన నిరంతర కార్యక్రమము ద్వారాను, ఆందోళనమూలమునను 1914 వ సం. నకు ముందు గ్రంథాలయముల కేవిధముగగాని సాయపడి

యొసగని ప్రభుత్వపద్ధతిని మనము మార్చగలిగితిమని తెలుపుటకు గర్వించుచున్నాను. లోకల్ బోర్డులు, మునిసిపాలిటీలు గ్రంథాలయములకు సాయముచేయుటకుకూడ వీలులేనిస్థితినుండి అవి స్వాయముగనే గ్రంథాలయముల నిర్వహించుటకు చట్టముల జేయునట్లును, ప్రభుత్వము గ్రంథాలయములకు స్వయముగ విరాళముల సహాత మొసగునట్లును మనము చేయగలిగితిమి.

ఇంకను మనము సాధించిన కార్యముల వేరువేరున జెప్పను. మనవిధుల గూర్చిన ప్రస్తావన కికవత్తును. ఇంతకాలముగ ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము, దీనిమూలముగజాడల బయల్వెడలిన జిల్లా, తాలూకా, నగర గ్రంథాలయసంఘములు గావించిన ప్రచారము చాల యెక్కువైనది. ఇది యికనుండి నిర్మాణరూపమును బొందకున్న మన పని కిక విలువయుండదు. వివిధసంఘములమధ్య స్నేహ సహాకారముల బెంపొందించి ఇది యొక్కొక్కటి తమతమవిధుల చక్కగ జేయుచు, ఒకటితోనొకటి పోటీపడక తమతమవిధుల సమన్వయించుకొని నసువ కున్న వీనియునికి కర్థముండదు. పైన పేర్కొనబడిన సహాకారసూత్రము నమలుపఱచుట కీమధ్య చేయబడిన ప్రయత్నము లంతగ ఫలించలేదు. ఈ సమావేశసమయమున కూడనున్న సంఘసమావేశములలో నీవిషయము చర్చకువచ్చి నిర్ణయములు జరుగనున్నవి. ఈనిర్ణయములు సత్ఫలితముల నొసగునట్లు సభ్యులాలోచించి తీర్మానించగలరని ఆశించు చున్నాను.

దిగువసంఘములతోడి సంబంధవిషయ మటుంచి ఈసంఘము స్వయముగ బొందవలసిన వృద్ధినిగూర్చియు మనము శ్రద్ధ వహించవలసి యున్నది. సభ్యులసంఖ్య సంఘబలమునకు గురుతన్న సంగతి యందరెరిగినదే. కాని బలవంతముగను, ఉబలాటముతోను, పట్టుదలల నిమిత్తమును ఇందుచేరువ్యక్తులవలన మనకంత ప్రయోజనముండదు. కొంతకు కొంతయైన ఉద్యమ ప్రాముఖ్యతను గుర్తించి స్వయముగ నీ సంఘమున సభ్యులై చేతనైనరీతిని దీనికార్యక్రమమునకు తోడుపడు నభిలాషగల వ్యక్తులు మనకు కావలెను. గ్రంథాలయాభిమానులీ సం

ఘమున సభ్యులుగా జేరవచ్చునన్న నిబంధన యున్నను గ్రంథాలయ శతనాలయము లెక్కువగ దీనికి సభ్యులై మక్కువతో దీనికార్యక్రమమున పాల్గొన్ననాడే దీనియునికికి సార్థకత సిద్ధించునని నాతలంపు. మదరాసు ప్రభుత్వమువారి యుత్తరువు ప్రకారము తెలుగు జిల్లాలలోని లోకల్ బోర్డులు, మునిసిపాలిటీలు మనసంఘమున విరివిగా సభ్యులుగ జేరునట్లు మనము కృషిసల్పగలిగిన ఆర్థికముగ కూడ నీ సంఘము బలపడగలదు. ఈ మహాసభ ఫలితముగ మనలో కార్యదీక్ష నెలకొని పై పనుల సాధించుటకు తోడ్పడిన మన యిప్పటి వ్యయ ప్రయాసలు వ్యర్థముగా లేవని సంతసించ వచ్చును.

శ్రీ వెంకట రమణయ్యగారు మనకు చూపెట్టిన గ్రంథాలయ యాత్రల విధానము క్రమముగా సాగి మంచి ఫలితముల నిచ్చుటకు నిపుణులు, దీక్షాపరులు నగు యువకబృందము, పలువిధములగు సాధన సంపత్తి మనకు కావలసియుండును. ధనము పుష్కలముగ నున్న తప్ప నీ కార్యక్రమమును దిగ్విజయముగ నడపుట కవకాశములు కానరావు. అగుటచే ధన సంపాదనకు పూనవలసిన విధి గ్రంథాలయ సేవకులపై గలదు. మన సేవాదీక్షమూలమున ప్రజల చిత్తముల చూరగొని కార్యసాధనకు గడంగుచో విజయము సులభ సాధ్యమని నా విశ్వాసము.

అనుకూలము చిక్కగనే పత్రికను తిరిగి పునరుద్ధరించి తగువసతుల జూచుకొని దీనిని మాసపత్రికగ నడుపవలసిన విషయమును మనము గమనములో నుంచుకొనవలెను. ఈలోపల ప్రస్తుతము వెలువడుచున్న వారపత్రికలలో దేనిసాయమునైన సంపాదించి నేడు మన పత్రిక లేని కొరతను తీర్చుకొనుటకు బ్రయత్నించు టవసరము. మరియు గ్రంథభాండాగారులకు, గ్రంథాలయ సంఘముల నిర్వాహకులకు శిక్షణాలయములను, గ్రంథాలయ గోష్ఠులను అన్ని ప్రాంతముల విరివిగ నేర్పాటు చేయవలసిన అవసరమును చాటగలను. వీనిద్వారా వారు తమతమ పనుల నెక్కువ చక్కగ నిర్వర్తించగలుగుదురనుట సువిదితము.

వివిధవిషయములను గూర్చి జనసామాన్యమున కుపకరించు కరపత్రముల ప్రకటనమును మనము చేయవలసిన పనులలో మరొ కటి. ఇది వయోజన విద్యావ్యాప్తికి కూడ సాయపడ గలదు.

గ్రంథపట్టికల తయారు చాలకాలముగ మనపైనున్న పెద్దవిధి. ఈ పట్టికలు పలువిధములు. ఇందు ప్రస్తుతము లభించుగ్రంథముల సాధారణ జాబితాను కర్త, ప్రకాశకులు, పేజీలు, వెల మున్నగు వివరములతో ముందు ప్రకటించు ప్రయత్నమునకు దొరకొంటిమి. దీనికగు అచ్చు ఖర్చు నిమిత్తము ఆం. దే. గ్రం సంఘోపాధ్యక్షులు శ్రీ నాగినేని వెంకయ్యగారు చాలకాలము క్రితమే రు. 100-0-0 ల నిచ్చియుండిరి. కాగితమునుకూడ కొని సిద్ధముగా నుంచితిమి. కాని సమాచారములు పూర్తిగ లభించకను, దీనిని త్వరలో పూర్తిచేయుట కవకాశము చాలకను ఆలస్య మగుచున్నది. ఇటీవల వెలువడిన కాగితము కంట్రోలు ఆర్డరు ప్రకారము దీనిప్రచురణకేమి యంతరాయము రానున్నదో చెప్పజాలను.

ప్రస్తుతము గ్రంథాలయముల కత్యవసరముగా నెంచబడుచున్న కొన్ని విషయములకు సంబంధించిన సందేహముల గూర్చిన లేఖలు తరచు సంఘకార్యస్థానమునకు వచ్చుచుండును. వీనిని గమనములో నుంచుకొని సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున దిగువ గ్రంథముల వెలువరచు తలంపు మాకు గలదు.

1. గ్రంథాలయములు - రిజిస్ట్రేషను
2. గ్రంథాలయములు - ప్రభుత్వము
3. వయోజనవిద్య - బోధనాక్రమము
4 గ్రంథాలయముల ప్రచురణ - వ్యాప్తి
5. గ్రంథాలయసభలు - సమావేశములు

వీనిని తయారు చేయుటకు మిత్రులయు, పెద్దలయు తోడ్పాటును మే మర్థింతుము. 1939 వ సం. లో నీ సంఘ పక్షమున ప్రక

టింపబడిన ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక నేటికి చాల తారుమా రైనది. కాన దీనికి వీలైనంత త్వరలో అనుబంధమును బ్రకటించుట చాల యవసరము. కాని ప్రభుత్వమువారి ఆర్డరులు దీని ప్రచురణము నంగీకరించవు. కాన చేయుడగినది లేదు. పైన నుదహరించిన శిక్షణ తరగతుల నడపుట కనుకూలమైన గ్రంథములు తెలుగులో లేనందున చాల యిబ్బందిగ నున్నది. ఈ లోటును వెంటనే భర్తీచేయుటకు వీలు లేకున్నను, ఒక ప్రణాళికను సిద్ధపఱచి దీని విషయమై యిప్పటి నుండియు ప్రయత్నముల సాగించుట మాత్ర మావసరము.

గ్రంథాలయముల నిత్యనిర్వాహణమున కవసరమైన గ్రంథాలయ పట్టిక (రిజిస్టరు)ల ప్రకటనమును సంఘ కార్యక్రమమున ముఖ్యాంశము. ఎన్నోయిబ్బందులకులోనై తెనాలి శ్రీ వేణుగోపాల జనరల్ స్టోర్సువారి సహాయముతో ముఖ్యమై ప్రస్తుత మవసరమైన దిగువ పట్టికల సంఘకార్యదర్శి తయారుచేసి ప్రకటింపించెను. ఇందు కడపటి రెండు పుస్తకములును సంఘపక్షముననే ప్రకటింప బడెను.

1. గ్రంథవివరణ పట్టిక
2. గ్రంథవిభజన పట్టిక
3. గ్రంథ ప్రచారిణి
4. సామానుల పట్టిక
5. చందాదారుల పట్టిక
6. రశీదు పుస్తకము

వీలువెంట వీటికిని, మిగిలిన రిజిష్టరులకును నొకస్టాండర్డు నేర్పరచి అన్నింటిని సంఘమువారు ప్రకటించగలిగిన గ్రంథాలయ నిర్వాహణలోని యిబ్బందులను కొంతవరకు తొలగించుట కనుకూలముగ నుండును. ఈ రిజిష్టర్లతోపాటు గ్రంథాలయముల స్థితిగతుల దెలుపు వివిధములగు లెక్కల పత్రములనుకూడ బ్రకటించుట మంచిది.

సంఘము స్వయముగ చేయ నశక్తమైన కారణముచే తగినవారిని ప్రోత్సహించి వయోజనులకు, బాలురకు, స్త్రీలకు ప్రత్యేక

ప్రత్యేకముగ నుపకరించు వాఙ్మయమును విరివిగ ప్రకటింపనట్లు చూడ వలెను.

తెలంగాణా, రాయలసీమలు సంఘ కార్యస్థానములకు దూరముగ నున్నందునను, ఇంతకుపూర్వమిచ్చట సంఘ కార్యక్రమము తగినంతగ జరుగని కారణముచేతను వీలైనంత త్వరలో నీరెండు ప్రాంతములలో శాఖాకార్యాలయముల నేర్పాటుచేసి ప్రచారకుల నియమించి మన సేవను వ్యాప్తిచేయవలసిన అవసరముగలదు. దీనికి స్థానికముగ నున్న యువకులు, పెద్దలయొక్క తోడ్పాటు మిక్కిలి యవసరము.

ముఖ్యసమస్యలను గూర్చి మాత్రమిచ్చట ప్రస్తావించితిని. తక్కిన చిల్లర విషయముల నెప్పటికప్పుడు సంఘపాలకవర్గ సభ్యులు పరిష్కరించుచుందురు. అయినను అందరిసాయము నాకవసరముగాన మీరందరు మా ప్రయత్నములకు పూర్ణముగ తోడ్పడ గోరుచు నింతటితో సెలవు గైకొందును.

సింగరేణి కొలరీస్
24 8-1944

పాములపాటి నాగిభూషణం
కార్యదర్శి. ఆం. దే. గ్రం. సంఘము

# తీర్మానములు

౧. కస్తూరిబాయిగాంధి, ప్రఫుల్ల చంద్రరాయ్, సేలం విజయరాఘవాచారి, సహోదరుడు, భూపతిరాజు వెంకటపతిరాజు, వేమవరపు రామదాసుపంతులు, శేషభట్ట రామానుజాచార్యులు, తాతా సుబ్బరాయశాస్త్రి, వడలి లక్ష్మీనారాయణశాస్త్రి, మౌల్వీ బహద్దర్ ఖాన్ సాహెబ్, నవాబ్ కమాల్ యార్ జంగ్ బహద్దూర్, వేముగంటి రామకృష్ణరావు, కోదుకొండ లింగమూర్తి శ్రేష్ఠి, హీరాలాల్ కాశీనాథ్ గార్ల మరణములకీసభవారు చింతించుచున్నారు. వీరి యాత్మశాంతికై పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

౨. మాతా కస్తూరిబాయిగాంధి జ్ఞాపక చిహ్నముగ నేర్పాటు చేయబడిన నిధికి విరివిగ విరాళముల నీయవలసినదిగ ఆంధ్ర ప్రజానీకము నీ సభవారు హెచ్చరించుచున్నారు.

3. ఆల్ ఇండియా పబ్లిక్ లైబ్రరీ అసోసియేషన్ వారి ద్వారా సోవియట్ సైంటిస్టుల అండ్ ఆంటి ఫాసిస్టు కమిటీయొక్క అధ్యక్షునిచే పంపబడిన ఆ దేశమునందలి గ్రంథాలయముల వినాశ సంరక్షణముల గూర్చిన కేబిల్ గ్రామ్ చదవడమైనది.

శత్రువుల బారినుండి తమ దేశములోని గ్రంథాలయములను ధైర్య సాహసములతో సంరక్షించుకొని త్వరలో పునర్నిర్మాణము చేసికొన్నందులకు సోవియట్ ప్రజల నీసభవారభినందించు చున్నారు.

౪. నిజాంరాష్ట్రాంధ్ర దేశవార్తలను బ్రిటీషాంధ్ర పత్రికలు బాగా ప్రకటించి పరస్పర సహకారములకై దోహదము నొసంగవలెనని ఈ మహాసభవారు పత్రికాధిపతులను కోరుచున్నారు.

౫. ఆంధ్రుల పరస్పర సహకారములకొరకు నిజాంరాష్ట్రాంధ్ర పత్రికలను బ్రిటీషాంధ్ర దేశములోని ప్రజలును, గ్రంథాలయముల వారును తప్పక తెప్పించి చదువవలెనని ఈ మహాసభవారు కోరుచున్నారు.

౬. ౨౧వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సందర్భమున ప్రత్యేక సంచికను ప్రకటించి మహాసభకు తద్వారా గ్రంథాలయోద్యమానికి చేసిన సేవకు ఈ మహాసభవారు తెలంగాణా పత్రికాధిపతిని అభినందించుచు ధన్యవాదాలు తెల్పుచున్నారు.

౭ (అ) హైదరాబాదులోని ఆంధ్ర విద్యాలయమునకు స్థాపనాది విషయములలో సర్వవిధముల తోడుపడుటయేగాక దాని మూలధనమునకు ను రు. ౧౫,౦౦౦ విలువగల తమ జీవిత భీమా పట్టాను దానమొసంగిన శ్రీ వల్లూరి బసవరాజుగారి విద్యాభిమానమును ఈ సభవారెంతయు అభినందించు చున్నారు.

(ఆ) ఓరుగల్లుపట్టణ వర్తక ప్రముఖులగు శ్రీ చందా కాంతయ్య శ్రేష్ఠిగారిని వారు ఓరుగల్లులోని విద్యాభివృద్ధి సంఘముపేర రు. ౨౧,౦౦౦ విలువగల స్థిరాస్తి కొనినందుకు వారి విద్యాభిమానమును సభవారు అభినందించుచున్నారు.

౮. 1860 సం॥ నె 21 రు సొసైటీల రిజిస్ట్రేషన్ చట్టముక్రింద రిజిస్టరు చేయించుటకుగాను కొన్ని గ్రంథాలయములకు ఫీజు తగ్గించినందులకు ఈసభవారు మద్రాసు గవర్నమెంటువారిని అభినందించుచున్నారు. ప్రస్తుతము మనదేశములోని గ్రంథాలయము లన్నియు సాధారణముగా తగిన ఆర్థిక ప్రోత్సాహము లేక అభివృద్ధి పొందలేక పోవుచున్నవి. కాని ప్రజలలో కొంత విద్యాభిలాష కలిగినది. కాబట్టి ప్రత్యేకముగ ఫీజు తగ్గింప కోరవలసిన అవసరము లేకనే గ్రంథాలయము లన్నియు రిజిస్టరు చేయించుటకు రు 3- ఫీజు నిర్ణయించి గ్రంథాలయ వ్యాప్తికి తోడ్పడవలెనని యీసభవారు గవర్నమెంటువారిని కోరుచున్నారు.

౯. ఏరూపములో వయోజనవిద్య సాగవలసియున్నను గ్రంథాలయ మాధారముగ నుండి తీరవలసి యున్నది. కాన వయోజన విద్యకు ప్రత్యేక ప్రయత్నా లుపక్రమించి వ్యయప్రయాస లినుమడింపకుండ గ్రంథాలయోద్యమము ద్వారానే వయోజనవిద్యా నిర్వహ

ణముకూడ జరుగవలెనని ఈసభ వారభిప్రాయపడి కేంద్రప్రభుత్వపు విద్యాసలహాసంఘము వారు ఈవిషయమును గమనించవలసినదిగ ఈసభ వారు సిఫారసు చేయుచున్నారు.

౧౦. సంవత్సరమునకు రు. ౨౦౦-౦-౦ ఆదాయమునకు మించిన పంచాయతీబోర్డులు తమ ఆదాయములోనుండి నూటికి రు. ౧౦-౦-౦ లకు తగ్గని మొత్తములు గ్రంథాలయ నిర్వహణమునకు అనగా వార్తా పత్రికలకు, పుస్తకములకు వెచ్చించుటకు అవకాశము కల్పించవలసినదిగా మదరాసు ప్రభుత్వమువారిని ఈ సభ వారు కోరుచున్నారు.

౧౧. సార్వజనిక గ్రంథాలయాలకు విరివిగా ధనసహాయం చేస్తూ ప్రోత్సహించవలసినదిగా నైజాంప్రభుత్వమువారిని యీ మహాసభ వారు కోరుచున్నారు.

౧౨. హైదరాబాదు స్టేటులైబ్రరీలో ఉర్దూ, ఇంగ్లీషు పుస్తకాలు పత్రికలతో బాటు ఈ రాష్ట్రంలోని ప్రాంతీయభాషల పుస్తకాలకు పత్రికలకు కూడ సరియైన స్థానము నివ్వవలెనని ఈ సభవారు నైజాం ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

౧౩. మదరాసురాష్ట్రంలోనూ, నిజాంరాష్ట్రంలోనూ తెలుగు బ్రాడ్‌కాస్టింగు స్టేషనులు ప్రత్యేకంగా వెంటనే యేర్పాటు చేయవలసిందిగా భారత నైజాం ప్రభుత్వాలను ఈ సభ వారు కోరుతున్నారు. ప్రస్తుతం హైదరాబాదు మదరాసు రేడియోలలో తెలుగు కార్యక్రమాలలో గ్రంథాలయ, ప్రయోజన విద్యాసంబంధములైన కార్యక్రమాలు విరివిగా ఉండవలెనని ఈసభ వారు ఆయా రేడియో బ్రాడ్కాస్టింగు స్టేషనుల అధికారులను కోరుచున్నారు.

౧౪. గ్రంథాలయ శాస్త్రానికి సంబంధించిన డిప్లొమాకోర్సును యేర్పాటు చేయవలసిందిగానూ, ఆ డిప్లొమాకోర్సు దేశ భాషలలోనే ఉండవలెనని అన్ని విశ్వవిద్యాలయాలను, ముఖ్యంగా మదరాసు, ఆంధ్ర, ఉస్మానియా, మైసూరు విశ్వవిద్యాలయాలను ఈ సభ వారు కోరుచున్నారు.

౧౫. సాధారణముగా ప్రతి గ్రామములోను పాఠశాలల నిర్వహించు ఉపాధ్యాయులద్వారా గ్రంథాలయోద్యమము సులువుగా వ్యాపింపచేయవచ్చును. కాబట్టి బోధనాభ్యాసన పాఠశాలలు కళాశాలల పాఠ్యప్రణాళికలో గ్రంథాలయ నిర్వహణ శాస్త్రము కూడా చేర్పించి బోధించు యేర్పాటు చేయవలెనని వివిధ ప్రభుత్వ విద్యాశాఖలవారిని యీసభవారు కోరుచున్నారు.

౧౬. ఆంధ్రదేశములోని గ్రంథాలయముల వారందరును అక్షరాస్యతా ప్రచారమును నేటి పరిస్థితులలో ప్రథమ గణ్యముగ నంగీకరించి సాగించవలసినదని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

౧౭. వయోజన విద్యను వ్యాపింపజేయడానికి విశేషమైన ప్రచార మావశ్యకము కాబట్టి ఆంధ్రదేశములోని యువకులందరు కూడ గ్రంథాలయ యాత్రలను ఆయా ప్రాంతాలలో చక్కగా నడిపి ప్రచారమును సాగించవలసినదని ఈసభవారు కోరుచున్నారు.

౧౮. ఆంధ్రదేశములో వయోజన విద్యాప్రచారమును ఉత్సాహముతో నిర్వహించుచుండు యువకబృందములను, తదితర కార్యకర్తలను ఈసభవా రభినందించుచున్నారు.

౧౯. వయోజనవిద్యకు సుశిక్షిత బృంద మవసరము కాన వయోజన విద్యాబోధకుల నిమిత్తము శిక్షణ తరగతులను విరివిగ నేర్పాటింపవలసినదని ప్రభుత్వములను, విశ్వవిద్యాలయములవారిని, స్థానిక సంస్థలవారిని, వయోజనవిద్యయం దభిమానముగల ప్రజాసంస్థల వారిని ఈ సభవారు కోరుచున్నారు.

౨౦. (అ) నెల్లూరు పట్టణమున గోడపత్రికను నడుపుచున్న శ్రీ ఇంద్రగంటి సుబ్రహ్మణ్యంగారి కృషికి యీసభవారు సంతసించుచున్నారు.

(ఆ) అవకాశమున్న ఉదారులు వీరి ప్రయత్నమునకు ధన రూపముగ సహాయము చేయగోరుచున్నారు.

(౩) ఈపద్ధతిని ఆంధ్రదేశములో వీలైనచోట్లలో అమలు జరుపుటకు గ్రంథాలయాభిమానులను హెచ్చరించుచున్నారు.

౨౧. అక్షరాస్యతా ప్రచారమునకు అవసరమైన గ్రంథసామగ్రిని ఇతర పరికరములను సమకూర్చి ప్రకటించి, సేకరించి బోధకుల కందుబాటులో నుంచుటకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు ఇతర విద్యాసంస్థలు అన్నివిధముల ప్రయత్నపడవలసినదని ఈ సభవారు కోరుచున్నారు.

౨౨. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమం ఆంధ్రదేశములోని అన్ని భాషల గ్రంథాలయాల అభివృద్ధికై యేర్పడియున్నది. కాబట్టి యిక ముందు ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలో ప్రత్యేకశ్రద్ధవహించి ఆంధ్రదేశంలోగల అన్నిభాషల గ్రంథాలయాల ప్రాతినిధ్యాన్ని ఇప్పటికంటె యెక్కువగ సంపాదించవలయునని పాలకవర్గమువారిని ఈ మహాసభవారు కోరుచున్నారు.

౨౩. గ్రంథముల పట్టిక ప్రచురణకై కవులు, పండితులు, గ్రంథప్రకాశకులు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారి ప్రయత్నమునకు తోడ్పడవలసినదిగ నీసభవారు కోరుచున్నారు.

౨౪. ఇకముందునుండి నిర్మాణశాఖా సమావేశములలో అనుభవజ్ఞులగు గ్రంథాలయ శాస్త్రవేత్తలచే నిర్వహణ సమస్యలపై పాఠముల నేర్పాటుచేయుట బాగుండునని ఈ సభవారభిప్రాయపడుచున్నారు.

౨౫. రాబోవు గ్రంథాలయ మహాసభకు ఆంధ్రవిదుషీమణిని అధ్యక్షురాలుగ ఎన్నుకొనుట బాగుండునని ఈసభవారు సూచించుచున్నారు.

౨౬. నైజాంరాష్ట్రములో గ్రంథాలయాభివృద్ధికి ఉద్యోగస్థులు పెట్టు ఆటంకములను వెంటనే సవరింపించవలయుననియు, నైజాం రాష్ట్రిల ప్రతి పల్లె పట్టణ పాఠశాలలందుగూడా ఇప్పుడిస్తున్నామని చెప్పుతున్న ప్రాధాన్యతకంటె యెక్కువప్రాధాన్యత సర్వతోముఖంగా

తెలుగునకు యిప్పించు ప్రయత్నం ప్రభుత్వమువారును పెద్దలును చేయనియెడల వయోజనవిద్యకు దోహదము కాజాలదు. కాబట్టి అట్టి ప్రయత్నము కావించవలయుననియూ యీ సభవారు కోరుచున్నారు.

౨౭. రాబోవు మహాసభను రాయచూరుజిల్లా అలంపూరులో జరుపుటకు పంపిన ఆహ్వానాన్ని ఈ సభవారు వందన పూర్వకంగా అంగీకరిస్తున్నారు.

---



శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు, మహాసభాప్రారంభకులు పేజీ - 44



౨౫వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ. శాఖాసమావేశముల అధ్యక్ష కార్యదర్శులు పేజీ—45

# ప్రచారశాఖా సమావేశము

## అధ్యక్షోపన్యాసము *

అధ్యక్షులు: శ్రీ బిరుదు వెంకటశేషయ్యగారు

మిత్రులారా!

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభయొక్క యిరువదియైదవ సమావేశము ఈసారి తెలంగాణములో జరుగుట, ఇటు తెలంగాణపు చరిత్రలోనేగాక అటు మహాసభ చరిత్రలోను నూతనాధ్యాయ మారంభమైనట్లుగా మన మొక విధముగా తలంపవచ్చును.

గ్రంథాలయములు నిజముగా విద్యాలయములకన్న ఉన్నత స్థానము నాక్రమించును. ఇది 'వ్రతానా ముత్తమం వ్రత' మ్మను దృష్టితోగాని కేవలము స్తుతిప్రియత్వముతో చెప్పుచున్న మాటకాదు. మన సంస్కృతి ముందు సారస్వత (గ్రంథ) రూపమును ధరించి, పిదప ఇట్టి మన ప్రయత్న విశేషములచే గ్రంథాలయములుగా రూపొందుచున్నది. అందుచే గ్రంథాలయములు సంస్కృతి రక్షకములు. విద్యాలయములో సంస్కృతి బోధకములు. సంస్కృతిని వ్యాపింపజేయుట రెండింటికిని సమానధర్మమైనను, గ్రంథాలయములకు కొంత ప్రాముఖ్య మెదవుచున్నది. మన విద్యావిధానము నేడు అభారతీయ మార్గమున బడియుండుటచే, దానితో మన సభ్యత కంతగా పొత్తు కుదురుటలేదు. అయినను, ఎట్టి విద్యాలయములుగూడ చివరకెట్టి విశ్వవిద్యాలయముగూడ సంవత్సరములో ఎన్ని గ్రంథములను బోధింపగలదు? కావున సంస్కృతి కేంద్రములగు గ్రంథాలయములకు విద్యాలయములు ఉపాంగము లగుచున్నవి. లేదా, గ్రంథాలయములను 'స్వతంత్ర విద్యాలయము' లనవచ్చును. అనగా విద్యాలయములు దేశమునందలి నిరక్షరాస్యతను నిర్మూలించి లేక ఉన్నత విద్య యిచ్చి కొంతవఱకు జ్ఞానోదయము కల్గించి, గ్రంథాలయపఠనకు యోగ్యులనుగా తీర్చి దిద్దునన్నమాట. విద్యాలయములు తమ ధర్మ

* ఇది సంగ్రహము. పూర్తి ఉపన్యాసము తెలంగాణా పత్రికలో అచ్చైనది. సంపుటి ౨. సంచిక ౧౨౯. 25-8-1944.

మును తృప్తికరముగా నిర్వహింపవలెనని గ్రంథాలయములపైననే ఆధారపడవలసి యున్నది. బడులలో ఉపాధ్యాయులు, కళాశాలలో నుపన్యాసకులును బోధించు ఏయొకటి రెండుపుస్తకములలో విద్యార్థులలో సంస్కృతి నిర్మాణము చేయుటకు చాలక, పాఠ్యవిషయములలో విరివిగా పఠనము జరుగవలసి వచ్చినప్పుడు, చాలా గ్రంథాలయములే ఉపయోగించుచున్నవి. అనగా అప్పుడు విద్యాలయములు గ్రంథాలయమును ఉపాంగముగా పెట్టుకొని విద్యాప్రచారము కావించుచున్నవని యనవచ్చును. విద్యాలయమునకు గ్రంథాలయము లేక స్వరూప సమగ్రత యేర్పడదనవచ్చును. స్థిరమైన విద్యాప్రచారము గ్రంథాలయ సాహాయ్యము లేకుండ జరుగనేరదని నిరూపించుటకై ఇంత చెప్పవలసివచ్చినది. కాని మన దేశమున ప్రభుత్వమువారి విద్యాశాఖలో విద్యాలయములు చేరినట్లు అంతకంటె ప్రాముఖ్యము కలిగిన గ్రంథాలయములు చేరకపోవుటయు, విద్యాలయముల కెంత విరివిగా గ్రాంటులిత్తురో అంత విరివిగా గ్రంథాలయముల కీయకపోవుటయు, మనకు విచారమును కలిగించు విషయములే యనవచ్చును. అందుచే గ్రంథాలయోద్యమ మీనాడు ప్రజోద్యమములలో నొకటియయి, తన అస్తిత్వముకొరకు తన వ్యాప్తికొరకు ఆందోళన చేయవలసి వచ్చుచున్నది. "తామే దేశమైనప్పుడు, తాము నిరక్షరకుక్షులైనచో, దేశక్షేమ మెట్లు చేకూరినట్లు?" అని తీవ్రముగా ఆలోచించుకొని, దేశీయులైనను గ్రంథాలయోద్యమమునకు తగినంత చేయూత ఇచ్చియుండవలసినది. ప్రజలు తమలో విద్యాప్రచారము కావలయునని యొక్కసారి కన్ను దెఱచినచో, గ్రంథాలయోద్యమ మింకను, యుద్యమరూపముననే యుండవలసినదా? వెనుక ఊరూర దేవాలయములు వెలసినట్లు, ఈపాటికి దేశమంతటను కన్నుల పండువుగా గ్రంథాలయములు వెలసియుండ దగినదికాదా? మనలో ద్రవ్యమునకు కఱవా? తెలివితేటలకు కఱవా? రచయితలకు కఱవా? కాని కార్యశూరత మాత్రము కఱవైనట్లు తజ్ఞులు చెప్పుకొనుట మీ అందరికిని తెలిసినదే! అందుచేతనే 30 సంవత్సరములనాడు స్థాపితమైన గ్రంథాలయోద్యమము ఇప్పటికిని, ఆంధ్రదేశము నంతటికిని

ఎగ్రబ్రాక లేకపోయినది. అది యుద్యమ కర్తల లోపము కాదేమో? ప్రజలింకను పూర్తిగా కన్ను తెఱవకపోవుటయే యిందులకు కారణ మనుకొందును. సంస్కృతివిషయమున ఎంతో ముందునకు నడచి ప్రపంచ విఖ్యాతులైన మన దేశీయులు విద్యావిషయమున ఇంత వెనుకబడి యుండుటయేకాదు. విద్యావిముఖత్వమునే చూపు దుస్థితికి వచ్చి యుండుట యెంతటి దేశదురదృష్ట మనవలయును. ఒకటి మనలో ఎంతటి నిరక్షరాస్యులకును విద్య కఱవైనను సంస్కృతికి కొఱత లేదు. ఆధునిక విద్యాధిక ప్రపంచములో విద్యకు తగినంత సంస్కృతి కానరాదు. కారణము విద్యావిధానమందలి 'అభారతీయత్వ'మే. విద్యాసంస్కృతులకు చక్కని సామరస్యము కుదుర్చుటకు నేటి విద్యాశాలలు కళాశాలలు ఎక్కువగా పనికివచ్చుటలేదు. విద్యాజ్యోతిస్సు తమకు లభింపనంతవరకును తమ బ్రతుకు అంధకారమయమే యగునని, ప్రజలు గుర్తించిన మరునాడు మన ఉద్యమములన్నియు తప్పక ఫలించితీరును. మనదేశపు ప్రజలు ఎక్కువగా గ్రామములలో నివసించుచున్నారు. గ్రామములలోనే ఎక్కువ నిరక్షరాస్యత వ్యాపించియున్నది. అందుచేత మన ఉద్యమము గ్రామములను ప్రధాన కేంద్రములుగా పెట్టుకొని విద్యాసంస్కృతుల ప్రచారము చేయవలసియున్నది. అట్టిచో గ్రంథాలయోద్యమ ప్రచారశాఖకు కావలసినంత పనియున్నదన్నమాట. గ్రంథాలయోద్యమ విజయమంతయు ప్రచారశాఖయొక్క ప్రయత్నవిశేషములపై ఆధారపడియున్నది.

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభవారు తమ కార్యక్రమమును మూడుశాఖలుగా ప్రచారశాఖ, వయోజనవిద్యాశాఖ, సాంకేతికశాఖ యని విభజించుటలో ఎంతయు దూరదృష్టి కానవచ్చుచున్నది. పైన మనము గుర్తించిన దానిని బట్టి ప్రచారశాఖయొక్క ప్రాముఖ్యము మీకు తెలియగలదు. కాని ఆ ప్రచార మెట్లు చేయవలయు ననునది కొంతవరకు కడమ శాఖలద్వారా నిరూపించినట్లగుచున్నది. గ్రంథాలయోద్యమము ప్రధానముగా వయోజనులలో విద్యావ్యాప్తి కావించుటకై యుపయోగపడవలయుననియు, నెలకొల్పిన గ్రంథాలయములు సాంకేతికశాఖవారి ఉపదేశముల ననుసరించి నడుపబడవలయు

ననియు, అక్కడి యుద్యమము నిర్విఘ్నముగా ఫలించగలదనియు వారి తాత్పర్యమైనట్లు తోచును. ఇది నిజము.

గ్రంథాలయోద్యమము సామాన్యవ్యక్తితో అక్షరాస్యులకే యెక్కువ యుపయోగకారి యగును కాని తక్కువవారికి గాదు. ఇప్పటి పరిస్థితులలో నూటికి సుమారు ౯౦ మంది నిరక్షరకుక్షులే గ్రామములలో నివసించుచుండగా గ్రంథాలయములు కడమ పదిమంది కొఱకే యేర్పడినట్లు అర్థమగుచున్నది. ఇది మన మహాసభవారికి యుక్తముగా తోచక, విద్యావంతులలో సంస్కృతిని వ్యాపింపజేయుటయు, అక్షరములుగూడ యెఱుంగని వారిలో అక్షరాస్యతను వ్యాపింపజేయుటయు ప్రధానాశయములుగా పెట్టుకొని అక్షరాస్యత వ్యాపించినకొలదియు, సంస్కృతి ప్రచారము సుకరమని తోచినట్లు తెలియుచున్నది.

## ప్రచారశాఖ-దాని కర్తవ్యము

ఇంక ప్రస్తుతమునకు వత్తము. గ్రంథాలయోద్యమమునకు ప్రచారశాఖ వెన్నెముకవంటిది. విషయప్రపంచమున మునుగుచు తేలుచు ఉన్న మా సోదరులను విద్యామయ ప్రపంచమున బసవేయుట కింతకంటె ఉత్తమమైన సాధనము లేదు. ఈ ప్రచారము ముఖ్యముగా యుండిన విద్యాప్రయోజనములను, గ్రంథాలయ రూపములను ద్వివిధముగ నుండును. మొదటిరూపమును గూర్చి నిన్న మీరు ప్రయోజనశాఖాధ్యక్షుల యుపన్యాసమును చిత్తగించియున్నారు. రెండవదానిని గూర్చి నేను కొంత ముచ్చటింతును.

గ్రంథాలయ ప్రచారోద్యమమునకు ముఖ్యాశయము ఆంధ్రదేశమందలి ప్రతిగ్రామమునందును, గ్రంథాలయముల నెలకొల్పి విద్యానందమును మా సోదరులకు పంచిపెట్టుటయే యని నాయభిప్రాయము. అట్టిచో మన ప్రచారోద్యమమును రెండు దృక్పథములతో పరిశీలించుట యావశ్యకమని నేను తలంచుచున్నాను. ఒకటి బహిరంగ దృక్పథము, రెండవది అంతరంగిక దృక్పథము. బహిరంగ దృక్పథమున

గ్రంథాలయములు లేనిచోట నెలకొల్పుట, నెలకొల్పబడిన వాటితో సమరసమైన సంబంధమును పెట్టుకొనుట; ఇది గ్రంథాలయోద్యమమును సువిశాలముగా వ్యాప్తిచేయుటయే ప్రధానకార్యక్రమముగా గలది. ఆంతరంగిక దృక్పథమున గ్రంథాలయమువైపు ప్రజలదృష్టి నాకర్షించుట, వాటిని సక్రమపద్ధతులతో నిర్వహించుట, ప్రజలకు సంస్కృతిని పంచిపెట్టు వివిధప్రయత్నములు చేయుట మొదలగునవి చేరును. ఈరెంటిని గూర్చియు వరుసగా మనవిచేయుదును.

## పఠనాలయములు

గ్రంథాలయములులేని నగరములలోగాని, పల్లెటూళ్లలోగాని, వాటిని స్థాపించి వెంటనే అక్షరాస్యతాప్రచారము సాగించుచున్నామని తృప్తిపడుటకంటె ముందుగా గ్రంథాలయములను స్థాపింపక పఠనాలయములను మాత్రమే స్థాపించి పనిచేయుట మంచిది.

పఠనాలయమునకు ఒక రాత్రిపాఠశాల అనుబంధింప బడిన యెడల పాఠశాల యువజనవిద్యను ప్రోత్సహించుటకును, పఠనాలయముద్వారా పత్రికాపఠనమును వృద్ధికి తెచ్చుటకును వీలుకలుగును. రాత్రిపాఠశాలలో సుమారు మూడునెలలలో ముగింపదగిన 'అక్షరశిక్షణము'వంటి ప్రాథమికపుస్తకములను పూర్తిచేసి, మాఱి మూడు నెలలలో పఠనాభ్యాస పాటవమునకై రెండుమూడు ప్రత్యేకముగా వారికొఱకై వ్రాయించిన వైజ్ఞానికపుస్తకములను చదివించి, పత్రికాపఠనమునకు వారి నప్పగింపదగును. అదివరకే నిర్వాహకునిచే పత్రికభాష వినుట కలవాటుపడియుందురు. కావున వారికప్పుడిది కష్టముగా నుండబోవదు. అప్పటినుండి వారు స్వయంకృషిచే పత్రికాపఠనము జరుపుకొనుచో, వారియందు సంస్కృతి ప్రచారమును చేయు సాధనముల నన్వేషింపవచ్చును. కాని పఠనాలయమనిన, ఒక క్రమపద్ధతి లేకుండ పత్రికలు తెప్పించి యుంచిన గదివంటిది కాదు. నాఅభిప్రాయములో పఠనాలయమనిన గ్రంథాలయమునకు పూర్వరంగముగా పెట్టుకొనుటే కావున గ్రంథాలయమెట్లు సంస్కృతిప్రవర్థకమగునో,

అట్టి వివిధదృక్పథములకు జెందిన పత్రికలను తెప్పించి చదివించుట ప్రథమకర్తవ్యమని నామనవి. అందుచే ప్రతిపఠనాలయమందును ప్రపంచవార్తలను తెల్పుటకై ఒకటి రెండు దినపత్రికలును, కళ, వ్యవసాయము, చరిత్ర, మతవేదాంతములు, శాస్త్రములు, ఆరోగ్యము, వ్యాపారము, భాషాసాహిత్యములు మొదలగు వాటిపై ఒక్కొక్క పత్రికయు తప్పక ఉండదగినది. పాఠకులు పైపత్రికలను తప్పక చదువుటకు ప్రోత్సహింపబడుట యవసరము. అప్పుడు పత్రికాపఠనము ఒక విధముగా గ్రంథాలయ పఠనమునకు త్రోవదీసిన దనవచ్చును. అట్టిస్థితిలో ఆపఠనాలయములో గ్రంథాలయమును నెలకొల్పి పఠనమునకు అదివరకే కొంత పరిచితులైన వారిచే గ్రంథములను చదివించుట యుక్తమగును.

## గ్రంథాలయములు

మన ప్రచారోద్యమముయొక్క దృష్టికి వచ్చిన గ్రంథాలయములలో కేంద్రగ్రంథాలయములు, ప్రధాన గ్రంథాలయములు, శాఖా గ్రంథాలయములు, శాలాగ్రంథాలయములు, సంచార గ్రంథాలయములు, సొంతగ్రంథాలయములు, చిత్రగ్రంథాలయములని ఏడువిధములైనవి కలవు. వీటినిగూర్చి వివరముగా నాఅభిప్రాయములను నివేదింతును.

కేంద్రగ్రంథాలయములు:— ఇతర గ్రంథాలయములకును కేంద్ర గ్రంథాలయములకును గొప్ప భేదమున్నది. కేంద్ర గ్రంథాలయములు దేశమున ముద్రింపబడిన లేక లభించిన గ్రంథముల నన్నిటిని హెచ్చుతగ్గులు లేకుండ సంగ్రహింపవలసినవి. ఇవి ప్రధానముగా సంస్కృతి రక్షకములు. ఇందు చేర్చుగ్రంథములకు మంచివా కావా అను విచక్షణ యుండకూడదు. కాని మంచిగ్రంథములు కానియెడల వాటిని ప్రచారగ్రంథములలో పెట్టక వేఱుగ పెట్టి కాపాడదగును. అప్పుడు దేశమునందెంత వాఙ్మయము ఉత్పన్నమగునో అదియంతయు ఒక్కచో చూడదగియుండుట మన కపేక్షణీయముకదా! ఎక్కడను లభింపని ఎంతటి అపురూపగ్రంథమైనను, ఎంతటి విలువగల గ్రంథ

మైనను కేంద్రగ్రంథాలయములలో లభింపవలయును. అట్టి కేంద్రగ్రంథాలయములు ఆంధ్రదేశము మొత్తమునను మూడు ఉండిన చాలును ఒకటి తెలంగాణమునను, ఒకటి ఉత్తరాంధ్రభాగమునను, ఒకటి రాయలసీమకు. తెలంగాణమునకు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము కేంద్రగ్రంథాలయమై యున్నది. ఉత్తరాంధ్రభాగమునకు గౌతమీ గ్రంథాలయమును కేంద్రగ్రంథాలయముగా పెట్టుకొనవచ్చును. రాయలసీమకు ఇదివఱకు ఒకటి లేనియెడల అప్పుడు క్రొత్తగా ఒకటి నిర్మించుట అత్యావశ్యకము. ఈమూడు గ్రంథాలయములు పరస్పరము సంప్రతించుకొనుచు గ్రంథసంగ్రహముగాని, గ్రంథనిర్వహణముగాని కావించుట మేలు. ఈ కేంద్ర గ్రంథాలయములకు తప్పక ప్రభుత్వమువారి ప్రత్యక్షసాహాయము లేకున్నను, పరోక్ష (వాక్) సాహాయము అవసరము. ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభవారి ప్రయత్నవిశేషములచే ఆంధ్రదేశమున అచ్చగు ప్రతిపుస్తకమును తప్పనిసరిగా క్రయమునకే యనుకొనుడు ఆ కేంద్ర గ్రంథాలయముల పేరిట పంపవలసినట్లు ప్రభుత్వమువారు ఆజ్ఞయిచ్చి తోడుపడునట్లు చేయవలయును. అప్పుడు ఆంధ్రప్రాంతములలో నెచ్చట ముద్రింపబడు గ్రంథములయినను మనకు తెలిసినను, తెలియకపోయినను కేంద్రగ్రంథాయములకు లభించును. మనకై మనమే ప్రయత్నము చేసినయెడల అదియెంత సఫలము కాకపోవచ్చును అప్పుడు కేంద్ర గ్రంథాలయముల రమణీయకము, వైభవము మాటలతో వర్ణింప నలవికాదేమో!

ప్రధాన గ్రంథాలయములు:— ఇవి సాధారణముగా జిల్లా, తాలూకా, నగరములలోను లేక పెద్దగ్రామములలోను ఉండును. ఇందు సంస్కృతి ప్రచారమునకు కావలసిన గ్రంథములన్నియు నుండును గాని, ముద్రింపబడిన అన్ని గ్రంథములు నిందుండవలసిన నిర్బంధము లేదు. ఇందలి ముఖ్యగ్రంథములు రెండుమూడు ప్రతులచొప్పున నుండుటచే, అవసరమైనయెడల వాటిని శాఖాగ్రంథాలయములకు పంపి తోడుపడుచుండవచ్చును. అప్పుడు ప్రధాన గ్రంథాలయముల వ్యాప్తి యెక్కువగుననుటలో సందేహము లేదు.

శాఖాగ్రంథాలయములు :— ఇవి ప్రతి గ్రామమునందును స్థాపింపబడదగినవి. ఇవి ప్రధాన గ్రంథాలయములకు సంబంధపడి యుండుటవల్ల వీటిపై ఎక్కువ భారము పడనక్కరయుండదు. ఇందు సుమారు ౧౦౦౦, ౧౫౦౦ గ్రంథములు ఉన్నచో చాలునని నా అంచనా. కాదనినచో ౨౦౦౦ల వఱకు పెంచవచ్చును. కాని యీ సంఖ్య మొత్తములోనే సంస్కృతియొక్క ప్రతి దృక్పథమునకును ఇంచుమించు నూరేసి గ్రంథముల చొప్పున ఉండుట యెంతయు కోరదగినది. ఒక్కొక్క గ్రంథమునను రెండుమూడు లేక అవసరమును బట్టి నాలుగైదు ప్రతులను నిలువచేసినచో తప్పుకూడ లేదు. శాఖా గ్రంథాలయము చక్కగా పనిచేసి ఆగ్రామమునందలి ప్రతి అక్షరాస్యుని చేతను అందలి ప్రతిపుస్తకమును చదివించు బాధ్యతతో వర్తించినయెడల గ్రంథాలయోద్యమము కోటలో పాకవైచినట్లు కాదామఱి. ఎక్కువ ప్రతులుండుటవల్ల ఒక్కపుస్తకమునే ఏకకాలమున పెక్కురు చదువుటకు వీలు కల్గుచున్నది. ఒకటిమాత్రము గమనింపదగినది. ప్రజాసామాన్యమునకు కథావాఙ్మయమనిన లేక నవలావాఙ్మయమనిన ఎక్కువ ప్రీతియని నా యనుభవము చెప్పుచున్నది. గ్రంథాలయ నిర్వాహకుడు పాఠకులను ఒక కథావాఙ్మయముతో కాలక్షేపము చేయుచు కూర్చుండనీయరాదు. తన ప్రయత్న విశేషముచే వారి దృష్టిని ఇతరగ్రంథములవైపు మరలించి అందరును అన్నిగ్రంథములు చదువునట్లు ప్రోత్సహించుచుండవలయును, అప్పుడే సంస్కృతి తన వివిధ రూపరేఖావిలాసములతో అందరి ననుగ్రహించునట్లగును గాని మఱియొక విధమునగాదు.

సంచారగ్రంథాలయము:— ఇవి యిప్పు డాంధ్రదేశములో నున్నట్టివే. గ్రంథాలయముల యొద్దకు వచ్చి గ్రంథములను తీసుకొని చదువు తీఱిక, ఓపిక, శ్రద్ధలేని మహాశయులకు శ్రద్ధగల్గించు ఉద్దేశ్యముతో ఇట్టివి యేర్పరుపబడుచున్నవి. ప్రజలకు విద్యాభిరుచి కల్గునంతవరకు శాఖాగ్రంథాలయములపేరుతో గ్రామములలో ఏర్పడునవి సంచార గ్రంథాలయములుగనే పనిచేయుటయు, తర్వాత ప్రజలను గ్రంథాలయమునొద్దకే రప్పించి గ్రంథములిచ్చి పంపు యేర్పాట్లు చేయుటయు

బాగుగనే యుండును. లేదా అవసరమునుబట్టి ప్రత్యేకముగా సంచార గ్రంథాలయములనే నిర్మించి సంస్కృతి ప్రచారము చేయవచ్చును.

చిత్రగ్రంథాలయములు:— ఇందు ఆంధ్రదేశమున వాడుకలో నున్న 'బోటు గ్రంథాలయము'లవంటివి చేరును. కాలువలపై ప్రయాణము చేయుట కొంత విసుగును కల్గించును. కావున, అట్టి ప్రయాణస్థులకు విసుగు పోగొట్టుటతోబాటు వారికా కాసేపటిలో కొంత విజ్ఞానము కల్గించినట్లుండునని మన గ్రంథాలయసేవకులు 'బోటు గ్రంథాలయము'లను నెలకొల్పినారు. ఈకృషి యెంతయు ప్రశంసనీయమగును. బోటుగ్రంథాలయములతోబాటు మఱికొన్నిచోట్ల చిన్నచిన్న గ్రంథాలయములను నెలకొల్పుట లోకకల్యాణ ప్రదమని నాయభిప్రాయము. సాధారణముగా ఆసుపత్రులలో చేరు రోగులు తమవ్యాధులు కొంతనిమ్మళించి విశ్రాంతిగైకొను సమయములలో అచ్చటి అధికారుల ఆజ్ఞలను గైకొని అచ్చట ఒక చిన్న గ్రంథాలయమును నెలకొల్పి అక్షరాస్యులకు గ్రంథములు పత్రికలు మొదలగునవి ఇచ్చి తోడుపడియు, లేక యువజన విద్యకు జెందిన పుస్తకములు పటములు మొదలగునవిగాని చూపి విద్యాప్రవేశము చేయించియు, సంస్కృతి ప్రచారము చేయుట మనకర్తవ్యము. మఱియు యేదో నేరములుచేసి కారాగృహములలోపడి శిక్ష ననుభవించు నేరగాండ్రకు, కారాగృహాధికారులు వారిచే పనులు చేయించి విశ్రాంతి యిచ్చిన సమయములలో వారిలో విద్యాభిలాషను పుట్టించి తమనేరములకై వారికి పశ్చాత్తాపము కల్గునట్లు విద్యావాసన కల్పించుటకై అక్కడకూడ అచ్చటి అధికారుల అనుమతి చొప్పున చిన్నగ్రంథాలయమును నెలకొల్పుట మంచిదేయని మనకు కనిపింపకపోవదు. అట్లే నగరములలోని వృత్తివ్యాపార కేంద్రములలో వృత్తివ్యాపార గ్రంథప్రధానములైన గ్రంథాలయముల నెలకొల్పి వాటిద్వారా సంస్కృతిని వ్యాపింపచేయదగును. ఇట్టి గ్రంథాలయములు ఒక్క క్రమముక్రిందికిరాక అవసరమునుబట్టి ఏర్పడును. కాన వాటికి చిత్రగ్రంథాలయములని పేరుపెట్టితిని.

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభవారు పైనసూచించిన మార్గములు ఏమైన రుచించిన యెడల ఆచరణయోగ్యములుగా చేసి, ఉద్యమమునకు విజయము చేకూర్తురని యాశించుచున్నాను.

ఆంతరంగిక దృక్పథమునుబట్టి నెలకొల్పిన గ్రంథాలయములను పూర్వపు దేవాలయములవలె సంస్కృతి కేంద్రములుగాచేసి గ్రంథపఠనాసక్తి యెక్కువగునట్లు చూచుట మన విధాయకకృత్యముగు చున్నది. సాంకేతికశాఖవారి సూచనలపై గ్రంథాలయ నిర్వహణము నడిపినయెడల ప్రజల సంపూర్ణవిశ్వాసము కార్యనిర్వాహకులు చూఱగొనగల్గుదురు. ఇది లోపలిమాట. గ్రంథపఠనాసక్తి పెంపుచేయుటకు నాకీ క్రిందిమార్గములు తోచినవి. ఇంకను బుద్ధిమంతులు ఆలోచించి క్రొత్తమార్గములు సృష్టించుకొని గ్రంథాలయ ప్రచారము సాగించుట యెంతయు కోరదగినది.

౧. సంస్కృతియొక్క వివిధ దృక్పథములను గూర్చిన కొన్ని ప్రశ్నలు సిద్ధపఱచి వాటి సమాధానములను గ్రంథపాఠకులనుండి పొంద ప్రయత్నింపవలయును. ఇట్లు సంవత్సరమున కొకమాటు జరిపిన యెడల ఆప్రశ్నల కాసంవత్సరమున వివిధవిషయములపై పుస్తకముల చదివి సమాధానములు వచ్చినప్పుడు బహుమతులుగాని, మరియేవైన ప్రోత్సాహకరమగు యోగ్యతాపత్రములుగాని యిచ్చుచు పోవుటతో సాధారణులకు విద్యాభిరుచి తప్పక పెంపొందగలదు. విద్యాధికులకు విద్యాకృషికై దోహదము కాగలదు.

౨. ప్రాచీన కవులయు మహాపురుషులయు జయంతులు మొదలగునవి అప్పుడప్పుడు గ్రంథాలయపక్షమున జరుపుచు వారివారి జీవితాదర్శములను సారస్వత విశేషములను ప్రజల కందజేయుచు రావలయును. అట్టివాటిచే కవులు మొదలగువారియం దాదరాభిమానములు వారిలో కల్గుటయేగాక వారి జీవితములకు కొంత వన్నె యేర్పడుననుట నిర్వివాదము.

౩. గ్రంథాలయపక్షమున అప్పుడప్పుడు కవిసమ్మేళనములు, కళాప్రదర్శనములు, నాటకప్రదర్శనములు, గానసభలు, గ్రామ పరిశ

మలు, పోటీపరీక్షలు, వాదసభలు, విద్యాగోష్ఠులు మొదలగునవి జరుపుచుండుట అవసరము. అట్టిచో ప్రజలలోని సత్య శివ సుందర దృక్పథములు కార్యరూపమున ప్రదర్శితములై సంస్కృతివ్యాప్తికి మిక్కిలి తోడుపడును.

४. చుట్టుప్రక్క ప్రాంతములనుండి పండితులను, కవులను, గాయకులను, కళావేత్తలను, శాస్త్రజ్ఞులను, చరిత్రకారులను పిలిపించుచు వారిచే ఉపన్యాససభలు చేయించుచున్న యెడల ఆయా విషయముల శ్రుతపాండిత్యముచే ప్రజాసామాన్యమున కెంతయో ఉపకారము గలుగ వచ్చును.

౫. ఆగ్రామాదుల చుట్టుపట్టులనుండు తాటాకు పుస్తకములు శాసనములు దొరకు నాశ్రమములు, స్థానిక చరిత్రలు, ప్రాత గ్రంథములు మొదలగునవన్నియు జాగ్రత్తగా సిద్ధపరచి ప్రధాన గ్రంథాలయమునకు గాని, కేంద్ర గ్రంథాలయమునకుగాని పంపుచుండవలయును. అప్పుడు వాటి నన్నిటిని ప్రోగుచేసి కేంద్ర గ్రంథాలయము పరిశోధనలు సాగించుటకు వీలుకలుగును.

ఇట్లు ఆంతరంగిక దృక్పథమునుబట్టి గ్రంథాలయ ప్రచారక శాఖవారు కృషి చేసి ప్రజాహృదయమును గ్రంథాలయమున కాకర్షించుచున్నచో ఉద్యమము అంగలు పంగలు పెట్టుచు మంచి వృద్ధితో నడచి పోవుటలో ఆశ్చర్యపడవలసిన పని లేదు.

ఇప్పటికే చాలా కాలాతీతమైనది. ఇంక మిమ్ముల నెక్కుడుగా శ్రమపెట్టను. ప్రచారోద్యమకర్తలు నాకుదోచిన అంశములు విని అందలి మెఱుగు తఱుగు లాలోచించి తమచిత్తమునకు వచ్చినట్లు కార్యశూరత్వమును ప్రకటించదగునని హెచ్చరించుచున్నాను.

సర్వాంధ్రప్రాముఖ్యమువలన ఈఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ప్రచారశాఖకు నన్నధ్యక్షుని చేసినందులకు, మహాసభవారికిని, ఇంత ఓపికతో నాఉపన్యాసమును విని నన్ను మన్నించినందులకు మీకును, కృతజ్ఞతావందనము లర్పించుచు ఇంతటితో విరమించు చున్నాను.

# గ్రంథాలయం

శ్రీ సి. హెచ్. ఆచార్యగారు

ఓ ఆలయం!

సకల విజ్ఞాననిలయం!!
అజ్ఞానపు చెదురక్షాన్ని
పరిశుభ్రం చేసే
దేశపు గుండెకాయా?

నీవేమా

సంస్కృతి సర్వస్వానివి,
ఆనందపు కేంద్రానివి.

నీలో రకరకాల

డైనామాలున్నాయి,
పుస్తకాలను హస్తాలకు
కనెక్టుచేసి,
కండ్లను కేంద్రీకరించి
విద్యుత్తును ప్రవహింప
చేసుకొంటాడు పాఠకుడు.

నీవేమా

ఉత్తమ నాగరికతా చిహ్నానివి,
అభివృద్ధికి సోపానానివి.
మావీరుల ప్రతిబింబాలు
మాధీరుల కీర్తిపుంజాలు
నీలోనే ప్రతిబింబిస్తాయి;
నీలోనే ప్రతిధ్వనిస్తాయి.

నీవొక

విశాల విజ్ఞాన సముద్రానివి
సుందరతర నందనవనానివి
నీలో విహరిస్తూ
నీఅలలతో ఆడుకొంటూ
నీభావ సువాసనలలో
తేలిపోతారు భావుకులు.

ఓ మహాలయం!

నీకివే నమస్కృతులు.

---

# సోవియట్ యూనియన్‌లో గ్రంథాలయాలు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, ఆం. దే. గ్రం. సంఘ సహాయకార్యదర్శి.

గ్రంథాలయోద్యమంలో ప్రథమస్థానం సోవియట్ యూనియన్‌కే పోతుంది. ఇచ్చటి ఉద్యమం నూతనపంథాలో అభివృద్ధికరంగా నడిచింది. 15 సంవత్సరాలలో నిరక్షరాస్యతను నిర్మూలించింది. లెనిన్ మహాశయునిచే వేయబడిన ప్లాను ప్రకారం రష్యా దేశమంతటా ప్రజలంతా సమావేశమై కాలక్షేపం చేయుటకు విజ్ఞాన వికాసాలకొరకు ఊరూరా గ్రంథాలయములు నెలకొల్పబడెను. పదిమంది చేరే ప్రతిచోట గోష్ఠులు జరుపుటకు, చర్చలుజరుపుటకు వివేకసముపార్జనకొరకు గ్రంథాలయాలు క్లబ్బులు నిర్వహించారు. వీటిని "లెనిన్ కార్నర్లు" అని వాడుతుంటారు.

అక్టోబరు విప్లవం అనంతరం విద్యాసంబంధమైన ప్రజాకమీసార్లు శ్రద్ధతో గ్రంథాలయాలవిషయం పరిశీలించారు. కార్మిక కేంద్రాలలో, గ్రామాల్లో, గ్రంథాలయాలు స్థాపించి పోషించి నిర్వహించారు. అమెరికాలోను, స్విడ్జర్లాండులోను అభివృద్ధిజెందిన గ్రంథాలయాల విధానాలను పరిశీలించారు. వాటిని సమన్వయపరచుకొని సోవియట్ రష్యా అభివృద్ధిని కలుగజేయు విధంగా అమలుజరిపినారు.

1914 జారుల పాలనలో 890,000 ల గ్రంథములతో 1200 గ్రంథాలయములు సోవియట్ రష్యా అంతటా ఉంటే, 1941 నాటికి రష్యాలో 462,000,000 గ్రంథాలుగల 2·494 000 గ్రంథాలయాలు (క్లబ్బులుసహా కలసి) విస్తరించి ప్రతిభావంతంగా ప్రజావిజ్ఞానవ్యాప్తి గావించుచుండెను. ఇన్నికోట్ల గ్రంథాలతో ఇన్ని గ్రంథాలయాలు ప్రపంచంలోకల్లా ఈ దేశంలోనే విలసిల్లి విజ్ఞానవికాసాన్ని కలిగిస్తున్నవి.

సోవియట్ యూనియన్‌లో శాస్త్రీయ గ్రంథాలయాలలో (Scientific) క్రీ. శ. 1056 కన్నా యింకా పురాతన వ్రాతప్రతులు, స్లావ్ రష్యాభాషలోని గ్రంథాలు అతిభద్రంగా అత్యవసర కార్యక్రమంగా పదిలపరచి యుంచబడినవి. సోవియట్ యూనియన్‌లో అప్పుడప్పుడు అచ్చగుచున్న ముఖ్య శాస్త్రీయ గ్రంథాల వ్రాతప్రతులుకూడా భద్రపరచి శాశ్వతంగా ఉంచబడుతున్నవి.

సోవియట్ యూనియన్‌లో గ్రంథాలయ సేవాశాఖ యేర్పడినప్పటినుండి, యూనియన్ ప్రజారాజ్యాలలోని విద్యాశాఖల యాజమాన్యమున ధర్మగ్రంథాలయములు సార్వజనీన గ్రంథాలయములు, శాస్త్రీయ గ్రంథాలయములు, సాంకేతిక గ్రంథాలయములు, ప్రజాగ్రంథాలయాలు మొదలగు అనేక వివిధగ్రంథాలయాలు నిర్వహింపబడి పోషింపబడుతున్నవి. మాస్కోనగరంలో ప్రభుత్వంచే నిర్వహింపబడుచున్న లెనిన్ ధర్మగ్రంథాలయంలో కోటికిమించిన గ్రంథాలు, కరపత్రాలు, సంచికలు, వార్తాపత్రికల ప్రతులు ఉన్నవి. లెనిన్‌గ్రాడులోని సాల్టికోవ్‌షెడ్రిక్ ధర్మ గ్రంథాలయంలో దాదాపు కోటి గ్రంథాలున్నవి. సోవియట్‌లోని ప్రతిప్రజారాజ్యమున్నూ ఒక స్వంతగ్రంథాలయాన్ని నిర్వహిస్తున్నది. ఇంకా సోవియట్‌లో

ప్రాదేశిక ప్రాంతాలలోను భూభాగాలలోను 2 లక్షల ప్రతులకు తగ్గని గ్రంథాలయాలు నిర్వహింపబడుచున్నవి. రష్యా రిపబ్లిక్‌లో ఈవిధమగు గ్రంథాలయాలు 17 ఉన్నవి.

1930 నుండి అనేక ప్రాదేశిక ప్రాంతాలలోను, భూభాగాలలోను, ప్రజారాజ్యాలలోను గ్రంథాలయాలు అభివృద్ధిచేశారు. బాగా విరాజిల్లుతున్నవి. గోర్కీ ప్రాదేశిక గ్రంథాలయంలో 15 లక్షల గ్రంథాలున్నవి. స్వెర్డ్‌లోవ్‌స్క్ ప్రాదేశిక గ్రంథాలయంలో 10 లక్షలకు మించి గ్రంథాలున్నవి. 1846 లో హెర్జన్ చే స్థాపింపబడిన ప్రాచీనగ్రంథాలయంలో 8 లక్షల గ్రంథాలు సమకూర్చి భద్రపరుపబడెను. ఇవానోవో, నోవో, సీబిర్‌స్కీ, స్వెర్‌డ్‌లోవ్‌స్కీ, యారోస్లావ్ ప్రాదేశిక గ్రంథాలయాలలో ఒక్కొక్కదానిలో 6 లక్షలవరకు పుస్తకాలు సమకూర్చబడి భద్రపరుపబడి యున్నవి.

సోవియట్ యూనియన్‌లో అచ్చయిన ప్రతిగ్రంథముయొక్క రెండుప్రతులు ఒకటి ఉచితముగను, రెండవది ఖరీదుకు, సోవియటు యూనియను కేంద్రగ్రంథాలయం, ప్రజారాజ్యాల గ్రంథాలయాలు, ప్రాదేశిక గ్రంథాలయముకు విధిగా అందజేయబడును. పుస్తకముల నిండుకు యిచ్చే గ్రంథాలయాలద్వారా, సాధారణ పఠన మందిరముల ద్వారా, ప్రత్యేక వాచకశాలల ద్వారా చదువరు లందరకు అందజేసి గ్రంథాలయ పరస్పర సంబంధం, ప్రచారవిధానం అమలు జరుపబడుచున్నది. ఈ గ్రంథాలయములు గ్రంథముల, శాస్త్రీయ గ్రంథావళుల విషయంలో ఎంతో సమాచారాన్ని సంపాదించి అందచేయుచుండును.

జనసామాన్యానికి సారస్వతాన్ని ధారాళంగా అందజేయడంలో, ప్రాదేశ పట్టణ, జిల్లా గ్రామగ్రంథాలయాలు ముఖ్యబాధ్యతను వహించుచున్నవి. రష్యా ప్రజారాజ్యం (R. S. F. S. R.) ఒక్కటి- దీనిజనాభా 10,92,79,000. 2000జిల్లా గ్రంథాలయాలను, 671 పట్టణగ్రంథాలయాలను దాదాపు 6000 గ్రామగ్రంథాలయములను స్థాపించి అన్నిరకములగుప్రజలకు సారస్వతాన్ని, విజ్ఞానాన్ని, సంస్కృతిని అందజేసి వివేకవంతులను చేస్తున్నది. శిశువులకు విజ్ఞానాన్నిచ్చి వివేకోదయంచేసి జీవనపథంలో నవజీవనంతో నడచుటకు 600 శిశుగ్రంథాలయాలు నిర్వహించుచున్నారు.

1929 లో చదువురానివారికై 46,759పాఠశాలలు నిర్వహించారు. 1914 లో జారు అంత్యదశలో రష్యాలో 78 లక్షల ప్రాథమిక విద్యార్థులుంటే, విప్లవానంతరం 20 సంవత్సరాలల్లో 3 కోట్ల 50 లక్షలు ప్రాథమిక విద్యాలయాలల్లో చదివేవిద్యార్థులున్నారు. కళాశాలావిద్యార్థులు 1914 లో ఒకలక్షమంది ఉంటే 1940కి 7 లక్షలమందికి పెరిగారు. ఇంతటితో విద్యాభివృద్ధి సరిపోయిందని తలంపవలదు. సోవియట్ దేశంలో వయోజనవిద్య నూతనపద్ధతిలో నిర్వహించారు. ప్రాథమిక పాఠశాలల్లోగాని, కాలేజీలల్లోగాని చదువుకొనే విద్యార్థులు తమయింట్లో చదువురాని తలిదండ్రులు, అక్కచెల్లెండ్రు, తాతాముత్తవలు ఉంటే వారికి వీరు అక్షరా

భ్యాసంచేసి, అక్షరులనుగా తయారుచేయాలి. ఇది విద్యార్థుల బాధ్యత. ఎంతసులువైనపనో మానసికంగా ఇది ఎంతజయప్రదంగా సాగుతుందో ఆలోచించండి. తల్లిగాని, తండ్రిగాని, తాతగాని, తనముద్దుబిడ్డను పాఠశాలలో ఏంచదువుతున్నాడో తెలుసుకోవలెననే కుతూహలం ఉంటుంది. ఆతడు తనకు చెప్పినదంతా నేర్పుతామంటే ఎంతసరదాగా పిల్లవాడు మారాంచేస్తాడని అభ్యసించుతాడో యోజన చేయండి. తాత కథలుచెపితే అవి బిడ్డలు వ్రాస్తుంటారు. ఈవిధంగా తాతలు మనుమలుకూడా విద్యాభివృద్ధి పొందడానికి మంచిసాధనను కనిపెట్టారు. ఈవిధంగా దేశంలో విద్యావ్యాప్తి అక్షరాస్యత విస్తరింపజేసి దేశంలో 15 సంవత్సరాలల్లో నిరక్షరాస్యతను నిర్మూలించారు.

దేశంలో ఈనాడు వారపత్రికలు కొననివారు చదువనివారుండరు. 1914లో 30 లక్షల పత్రికలప్రతులు అచ్చువేసేవారు. ఈనాడు 8521 పత్రికలు, 3 కోట్ల 60 లక్షలప్రతులు అచ్చువేస్తున్నారు. పత్రిక వచ్చేవేళకు కొనేవారు ముందుగానే వచ్చి బారులుతీరి పత్రికలకై ఎదురుచూస్తుంటారు. పుస్తకాలకు అంతే. ఒకపుస్తకం ఒకసారి 3 గంటలలో 600 ప్రతులు అమ్ముడుపోయినాయి. ఒకవరుసలో 1939 లో 48 వేలపుస్తకాలు 70 కోట్ల 10 లక్షలప్రతులు అచ్చయి అమ్ముడుపోయినవి. 1914 లో 8 కోట్ల ప్రతులు మాత్రమే అమ్ముడుపోయినవి. నాటికి 80 రెట్లు అభివృద్ధి. లెనినిజం మార్క్సిజంను గురించిన పుస్తకాలప్రతులు 20 సంవత్సరాలల్లో 35 కోట్ల ప్రతులు అచ్చువేశారు. 1940 లో 825 నాటకశాలలు, 92,626 క్లబ్బులు 70,000 గ్రంథాలయాలు, 761 మ్యూజియంలు నిర్వహింపబడి ప్రజాసామాన్య ప్రయోజనాలకై వినియోగింపబడుచున్నవి. నాటకాలు, సినిమాలు, ప్రజల విజ్ఞానాభివృద్ధి కుపయోగింపబడుచున్నవి. ఈనాడు సోవియట్ యూనియన్‌లో వివిధ రకాలపుస్తకాలు (ప్రతులుకాదు) 63 కోట్ల 75 లక్షలు ఉన్నవి.

ప్రతి గ్రంథాలయం వద్దను విజ్ఞానకేంద్రాలుంటవి. రేడియోలు తప్పక ఉంచబడుతవి. కొన్నింటిలో నాటకశాలలు సినిమాలుకూడా యేర్పాటుచేయబడి ప్రదర్శింప బడుతవి. మాస్కోకు 2000 మైళ్ళ దూరాన ఉన్న లెనినాఖాన్ జిల్లాలోనున్న 210 గ్రామాల్లో ప్రజలచొరవతో 130 విజ్ఞాన కేంద్రాలు యేర్పరచి ప్రజలకు విజ్ఞానాన్ని కలిగిస్తున్నారు.

ప్రభుత్వంతరపున విద్యావంతులు నిర్వహించే గ్రంథాలయాలు మాత్రమే కాకుండా కార్మిక సంఘాలద్వారా అన్నికార్మిక ప్రదేశాలలో, కర్మాగారాలలోను కార్మిక గ్రంథాలయాలు నిర్వహింప బడుతున్నవి. వీటిని కార్మిక సంఘాలే నిర్వహించి పోషించు తుంటవి. ఈయుద్ధానికి పూర్వం అంటే 1941 కి ఇట్టి గ్రంథాలయాలు 17000లు ఉండేవి. వీటిలో 560 లక్షల గ్రంథాలున్నవి. ఇంతేకాకుండా విశ్వవిద్యాలయాలలోను, కళాశాలల్లోను, ఉన్నత పాఠశాలల్లోను, ఉన్నత సాంకేతికవిద్యాలయములలోను, , ప్రాథమికపాఠశాలల్లోను, వయోజన విద్యాలయాలలోను, సమిష్టి

క్షేత్రాల లోను, వందలాదిగ గ్రంథాలయాలు వేలకొలది పుస్తకాలతో నిర్వహింప బడుతున్నవి. ఈగ్రంథాలయాలలో విలువగల అరుదైన అమూల్యమైన గ్రంథాలు సేకరింపబడి చదువరుల కందించ బడుచున్నవి. "విజ్ఞానంలేని ప్రజ స్వతంత్రాన్ని సంపాదించలేదు. దాన్నినిలుపుకొనలేదు" అనేదానికి సోవియటు ప్రజలు జవాబు చెప్పారు, చెప్పుతున్నారు.

తీగరంపరలుగా అల్లుకొని పోయిన ఈగ్రంథాలయ పొదను వీటితో విజ్ఞానాన్ని వెదజల్లిన దేశప్రజానీకపు వివేకానికి యీయుద్ధవ్యాఘాతంవచ్చింది. పశ్చిమ భూభాగంలోని గ్రంథాలయాలు విజ్ఞానకేంద్రాలు అందలి అమూల్య గ్రంథరాసులకు యీయుద్ధంవలన ఘోరప్రమాదం కలిగింది. విజ్ఞానవిధ్వంసనంలో దీక్షపూనిన పేరు పడిన నాజీరాక్షసులు చేసినచర్యలు విజ్ఞానాకాంక్షులకు వెర్రులెత్తించినవి. తమగ్రంథాలయములను, తమ గ్రంథనిక్షేపములను, తమవిజ్ఞాన నిలయాలను, ఈపశువుల నుండి రక్షించుకొనుటే ప్రధాన కర్తవ్యంగా ప్రజానీకం భావించింది. తమ తలలు బలి యిచ్చి అయినాసరే తమ సర్వస్వం అర్పించి అయినాసరే తమ గ్రంథ నిక్షేపములను రక్షించుకొనుటకు సోవియట్ ప్రజలు దీక్షబూనారు. నాజీ నరహంతకులకు విజ్ఞానం అంటే విషసర్పం-సారస్వతం అంటే సంతాపం - ప్రజల సారస్వతం అంటే ప్రాణగొడ్డలి. నాజీ లెక్కడప్రవేశిస్తే అక్కడనల్లా ప్రజాసామాన్యానికి సేవ జేయుచున్న రైతులకు, కూలీలకు, బాలురకు, స్త్రీలకు, విజ్ఞానమిచ్చి వివేకవంతులను జేయుచున్న గ్రంథాలయాలను, విజ్ఞానకేంద్రాలను నేలమట్టం చేశారు. విలువగల గ్రంథాలను దొంగిలించారు. అగ్నికాహుతి చేశారు. లక్షలకొలది గ్రంథాలను వివేకంలేని నాజీలు తమ వంటలకు పుల్లలక్రింద వాడారు. స్మోలన్స్క నగరంలో హిట్లరు రాకాసులు ప్రాచీన అముద్రిత గ్రంథాలను విజ్ఞానమైన పుస్తకాలను చలిమంటలు వేసుకొన్నారు. ఖార్కావ్ నగరంలో 1870, ఉక్రేనియాలో 2420 గ్రంథాలయాలు (క్లబ్బులు) ధ్వంసం చేశారు.

ఎన్నో శతాబ్దాలకు పూర్వపు వ్రాతప్రతులను శాస్త్రగ్రంథములను, ప్రాచీన పురాణములను, క్రిందటి శతాబ్దములో అచ్చయినవాటి వ్రాతప్రతులను, పత్రికలను, అతి పదిలంగా దాచియుంచిన రస్టోవ్ గ్రంథాలయాన్ని నాజీలు రస్టోవ్ చేరినపుడు తమ పొయ్యి మండించుకొనడానికి వాడుకొని బూడిదపాలు చేశారు. అనేక గ్రంథాలు ఆధునిక పద్ధతులపై అమర్చిన పుస్తకాలయాలు, గ్రంథావళులు, బీరువాలు, చిత్రప్రదర్శనాలు, కళాప్రదర్శనాలు, గ్రంథప్రదర్శనాలు లక్షల కొలది గ్రంథాలతోనున్న గ్రంథాలయ భవనాలను, ఎంతో ప్రయాసకు లోనై విజ్ఞానవేత్తలు, పరిశోధకులు, తమ సర్వస్వాన్ని ధారవోసి సంవత్సరముల కొలది కష్టించి తయారుచేసిన గ్రంథనిలయాలను నాజీలు ప్రవేశించిన క్షణమే మంటల పాలు చేశారు, మంటలనుండి తప్పి బయటపడిన గ్రంథాలుంటే వాటి నన్నిటినీ చెల్లా చెదరు చేసి, చింపి, ఉన్మత్తులవలె వ్యవహరించి, స్మశానం చేశారు. అక్కడక్కడ

లభించిన ఆమండలి పుస్తకాలు, సలపురాణాలు, స్థానిక చరిత్రలు, కొన్నింటిని దొంగిలించి పడవలలో జర్మనీ చేర్చారు.

ఆక్రమితప్రదేశాలలోని నాజీ లాక్రమించిన గ్రంథాలయాలను, యుద్ధరంగలో వీరులవలె నిలిచి తమ సర్వస్వాన్ని ధారవోసి ప్రాణాలను తెగించి, గ్రంథభాండారులు కొన్నికొన్ని గ్రంథములను నాజీల బారినుండి రక్షించి గ్రంథాలయ వీరులుగా వాసిగాంచారు. వీరు గ్రంథాలయ వీరులు. గ్రంథభాండాగారులకు ఆదర్శ పురుషులు.

మాస్కో లెనిన్‌గ్రాడ్ నగరాలలోని గ్రంథభాండారులు ప్రపంచవిజ్ఞాన రక్షకులుగా నిలిచి విజ్ఞానరక్షణలో సైనికులేగాక గ్రంథభాండాగారులకుగూడా ఎంతబాధ్యత యున్నదో ఆచరణలో ఆదర్శపూర్వకంగా చూపెట్టారు. బాంబులు వడగండ్లవలె పడుచున్నప్పుడు, విమానదాడి సాగినప్పుడు అనేకదాడులలో విమానములు బ్రద్దలగుచున్నప్పుడు గ్రంథాలయభవనాలు కంపించి పోతున్నప్పుడు భగభగ మంటలమధ్య ధీరవీరులైనిలిచి గ్రంథాలయ రత్నాకరాలను రక్షించారు.

ఈ రణగుణధ్వనిలో లెనిన్‌గ్రాడు శత్రువులచే ముట్టివేయబడి లోనికి ఆహార పదార్థాలు చేరఅవకాశంలేక కరువుసంభవించినప్పటికిని గ్రంథాలయములను వదలక యుద్ధవీరులకు ప్రజాసామాన్యానికి ఆ యుద్ధంమధ్యలో కూడా అవసరమగు అన్ని గ్రంథాలను అందజేసి గజగజవణకు చలితో బాధపడుచున్నను శత్రువులు పట్టణంలో చొచ్చి దోపిడీలు చేయుచున్నను ధీరతతో నిలచి గ్రంథాలయాలను విజ్ఞానాన్ని తమ మాతృభూమిని రక్షించారు.

హిట్లర్ రాక్షసబలానికి జవాబు ప్రారంభమైంది. విముక్తిపొందిన సోవియట్ ప్రదేశాలలో విధ్వంసం అయిన శిధిలాలన్నిటికి సోవియట్ గ్రంథాలయ వీరులు పునరుద్ధరణ ఆరంభించారు. ప్రభుత్వం పునరుద్ధరణ ప్రయత్నాలు అమలు జరిపింది, జరుపుతున్నది. ప్రభుత్వం మాస్కోలో కేంద్రసారస్వతనిధిని ఏర్పరచింది. దీనిశాఖలు లెనిన్‌గ్రాడులో 18 ప్రాదేశిక కేంద్రాలలోను ఆక్రమితమై నేడు విముక్తిపొందిన ప్రజారాజ్యాలలోను ప్రభుత్వగ్రంథాలయాలు, ధర్మగ్రంథాలయాలు ప్రాదేశిక పట్టణ గ్రామగ్రంథాలయాలు, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు పునరుద్ధరణ చేయుచున్నారు.

ఈనాటికి 700 గ్రంథాలయాలు పునరుద్ధరింపబడినవి. ఈ 700 ల గ్రంథాలయాలలో 251,000 గ్రంథాలు చేర్చబడినవి. యుద్ధావసరాలకు ఆయుధసామగ్రిని సమకూర్చుటకు తమశక్తిని ఏవిధంగా వినియోగిస్తున్నారో అవిధంగానే సర్వశక్తులు సమీకరించి ఆదశలో ఏమాత్రం ఆలస్యమును అలసత్వమును జరుపక వీలైనన్ని గ్రంథాలయాలు విముక్తిపొందిన ప్రాంతాలలో పునరుద్ధరించారు.

పునరుద్ధరణ కార్యక్రమ ప్రకారం సమగ్రమైన 1500 గ్రంథాలయములను సర్వసంపన్న గ్రంథములతో నిర్మించు ఏర్పాటుచేశారు. యుద్ధనిర్వాహణలో గ్రం

థాలయ నిర్వహణ, విజ్ఞానప్రచారం కూడా ఒకభాగంగా పరిగణించి, దేశరక్షణకై గ్రంథాలయ నిర్వహణ చేస్తున్నారు. ఇందుకై 60 00,000 గ్రంథాలు అవసరమైతే వివిధ దేశాలనుండి తెప్పించియైనా గ్రంథాలయాలను క్రమపరచ నిశ్చయించారు.

సోవియట్ యూనియన్ నుండి యెర్రసేన నాజీమూకలను తరిమి వేసింది. అప్పుడే సోవియట్‌లోని ఆర్థిక సుస్థిరతను, జాతీయసామాజిక జీవితాన్ని యుద్ధ పద్ధతినుండి ప్రజాజీవిత పద్ధతిలోనికి పునరుద్ధరించుటకు చేయుచున్న ప్రయత్నాల్లో విజ్ఞానసంస్థలకు ప్రధానస్థానం యిచ్చి పునరుద్ధరిస్తున్నారు.

త్వరలోనే యీవిజ్ఞాన నిలయాలన్నీ యథాప్రకారం యుద్ధానికి పూర్వపు స్థితికన్న అనేకరెట్లు అధికోత్సాహంతో ఉన్నతస్థాయిలో సాహిత్యసంస్కృతి విజ్ఞానవ్యాప్తిచేయుటకు ఏర్పాట్లు జరుగుచున్నవి.

ఈ గ్రంథాలయాలు ప్రజలకి జ్ఞానాన్ని మనోవికాసాన్ని అభివృద్ధి చేయటమే కాకుండా నిర్మాణబాధ్యతలు నిర్వహించుటకవసరమగు ఉన్నతవిజ్ఞాన శాస్త్రీయ విద్యావికాసాన్ని కూడా కలిగించుతవి.

దేశం ప్రజలు దేశరక్షణ బాధ్యతతో స్వాతంత్ర్యకాంక్షతో ప్రజావిజ్ఞాన రక్షణను నిర్వహించారు. అందుకై స్వాతంత్ర్యపోరాటం సాగించారు. విజ్ఞానఘనులను తయారుచేయటానికి గ్రంథాలయాలను శాంతిసమయంలోనేగాక యుద్ధసమయంలో కూడ సోవియట్ యూనియన్ ప్రజలు నిర్వహించారు. విజ్ఞానం వికసింపని మన దేశపుప్రజలలో విజ్ఞానాన్ని వెల్లివిరియింపజేసి విజ్ఞానాన్ని ప్రజాసామాన్యంలో అభివృద్ధిపరచుటకు సోవియట్ గ్రంథాలయాలను, గ్రంథాలయవీరులను ఆదర్శంగా తీసుకొని గ్రంథాలయంలేని గ్రామం గ్రంథంచదువని కుటుంబం విజ్ఞానాన్ని బడయని వ్యక్తి లేకుండా దేశంలో విజ్ఞానవ్యాప్తి గావించుదాం. ముఖ్యంగా ఆంధ్ర దేశంలో ప్రతిగ్రామంలో సజీవగ్రంథాలయాలను నిర్వహించి ప్రజానీకానికి విజ్ఞానాన్ని అందజేసి వివేకవంతులను భారతజాతికి స్వాతంత్ర్య సాధకులుగా చేయడానికి సాగిపోదాం.

# గ్రంథాలయములు పత్రికాపఠన మందిరములుగా మారవలెను.

శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు, ఎం. ఏ.,

గ్రంథాలయాలు యింకా ప్రజాకర్షనీయంగాను, ఉపయోగకరముగాను చేయుట యెట్లు? అనునది ఒకముఖ్యమైన సమస్య. గ్రంథాలయభవనమును, పుస్తకముల జాబితాను, చదువరుల సంఖ్యను చూచి యేగ్రంథాలయకర్త సంతోషించడు. చదువరులలో యెంతవరకు విజ్ఞానము పెంపొందినది, సంఘపురోభివృద్ధికై వారు ఎంతవరకు తోడ్పడుచున్నారు అనువాటివల్లనే గ్రంథాలయముయొక్క ప్రయోజనమును నిశ్చయించవలెను.

గ్రంథాలయములలోని పుస్తకములు రకరకాలైన అంశములకు జెందియున్నవి. పురాణములు, శాస్త్రములు, నవలలు, కావ్యములు, కథలు, చరిత్రలు, రాజకీయములు, యిటువంటి విషయాల గురించి గ్రంథాలుండును. అయితే యేరకపుగ్రంథములు విస్తారముగ చదువబడుచున్నవి అని లెక్కలబట్టి పరిశీలించినచో నవలలు, కథలు ప్రజలను విస్తారము ఆకర్షించుచున్నవని తెలియగలదు. శాస్త్రములు మొదలగు గ్రంథముల ఉపయోగము బహుఅరుదుగా నున్నది. అందుచేత ప్రజల అభిరుచులనుబట్టి గ్రంథాలయములు విస్తారము నవలలనే స్వీకరించు చున్నవి. శాస్త్రజ్ఞానము నిచ్చు గ్రంథములు అంతకంతకు తక్కువై పోవుచున్నవి. సామాన్య గ్రంథాలయములలో శాస్త్రములకు సంబంధించిన పుస్తకములు తక్కువగా ఉండుటచేత, శాస్త్రజ్ఞానము కోరువారికి సామాన్యగ్రంథాలయములు ప్రయోజనకరముగా లేవు. చెన్నపట్టణము మొదలగు ముఖ్యపట్టణములలోని గ్రంథాలయములకు వారు పోవలసి వచ్చుచున్నది.

సామాన్య గ్రంథాలయములలోని నవలలు చదువుచుండుటచేత వినోదము నిచ్చునేగాని, విజ్ఞానము అభివృద్ధి పొందుటలేదు. సంఘపురోభివృద్ధికిని జ్ఞానము అవసరము. అందుచేత ప్రస్తుతగ్రంథాలయములు కాలము వెళ్లబుచ్చు కోరికగలవారికి ఆశ్రయములుగా ఉన్నవి.

గాని, విజ్ఞానము నభివృద్ధిపొందించుకొని దానిద్వారా సంఘాభివృద్ధి కొరకు పాటుపడువారిని తయారుచేయుట తక్కువైపోయినది. ఇది గ్రంథాలయముల లోటుగాదు. భారతదేశములోని స్థితిగతు లిట్లున్నవి. ఇతర దేశములు స్వాతంత్ర్యదేశము లగుటచేత, ప్రజలు స్వేచ్ఛగా అన్ని గ్రంథములు చదువగలరు. మరియు దేశాభివృద్ధికి తోడ్పడు వాఙ్మయమును ప్రభుత్వమే గ్రంథాలయములద్వారా ప్రచారము లోనికి తీసికొనివచ్చును. ఆ దేశములలో అక్షరాస్యత హెచ్చగుటచేత, పుస్తకములను ప్రజాసామాన్యము యింటివద్ద యెవరిమట్టుకు వారు చదువుకొనగలరు. దారిద్ర్యము తక్కువగుటచేత ఆదేశములలో కొంత కాలము వినోదమునకై వినియోగించగలరు. నవలలు చదువుచున్నను వారికది తగును. ఇండియా దేశపు స్థితిగతులు వాటికి వ్యతిరేకము-దాస్యము, నిరక్షరాస్యత హెచ్చు. అందుచేత యితరదేశములవలె యీ దేశములో గ్రంథాలయములు, పుస్తకభాండాగారములు, ఉపయోగకరముగా ఉండనేరవు. ఇతరదేశములతో యీసందర్భమున మనము పోల్చుకొనుటయు సరియైనది కాదు. ప్రజోపయోగకరముగావుండి సంఘపురోభివృద్ధికి కూడ మనదేశములోని గ్రంథాలయములు తోడ్పడవలెనంటే మనగ్రంథాలయములు వేరుమార్గమును అనుసరించవలసి యుండును.

మనదేశములో అక్షరాశ్యత తక్కువగుటచేత ఒకఊరిలోని జనసంఖ్యకు ఆఊరియొక్క గ్రంథాలయ ముపయోగించు చదువరుల సంఖ్యకు పోలిక లేకున్నది. ఆకొద్దిసంఖ్యఅయిన చదువరులలోకూడ నవలలు చదువువారే అధికము. ఈవిధముగ గ్రామమొత్తముతో పోల్చిచూచినయెడల గ్రంథాలయముల ఉపయోగము తక్కువ. ఉపయోగపడినంతవరకు కూడ అభివృద్ధికి తోడ్పడని నవలలే వాడబడు చున్నది. విజ్ఞానము సంపాదించి పరిశోధనలుచేయు అభిలాషకల వారు ముఖ్యపట్టణములలోని ప్రత్యేకగ్రంథాలయములకు పోవలసి వచ్చుచున్నది. అందుచేత మనగ్రంథాలయములలోని గ్రంథములు సంఘపురోభివృద్ధికి తోడ్పడు ప్రయోజనకరముగా లేవని తేలుచున్నది. అందుచేత అప్పుడే గ్రంథాలయములలో వార్తాపత్రికలనుకూడ బెట్టు

చున్నారు. లెక్కవేసి చూచినట్లయితే గ్రంథాలయములకు వచ్చు వారు విశేషవార్తాపత్రికలకొరకు వచ్చుచున్నారుగాని గ్రంథముల కొరకు గాదు. వార్తాపత్రికలవలన ప్రజకు మనదేశములో ప్రయో జనముకూడ విస్తారము కలదు. అవి దేశములోని విషయములను తెలియజెప్పి స్వాతంత్ర్యకాంక్షను, సంఘదృష్టిని, విజ్ఞానమును పెంపొం దించును. ఒక్కడు వార్తాపత్రికను చదువుచున్నను తక్కినవారు వినుట వలన విషయములు గ్రహించుచున్నారు. ప్రస్తుతము మనదేశములో ఉన్న నిరక్షరాస్యత విషయములు గ్రహించుటకు యీవిధముగా అడ్డు వచ్చుట లేదు. గ్రంథములలోని భాషకన్న పత్రికలలోని భాష ప్రజాగ్రాహ్యముగా ఉండును. ఇన్నివిధములుగా మనదేశ పరిస్థితుల ననుసరించి గ్రంథములకన్న వార్తాపత్రికలే ప్రజలకు ఉపయోగకర ముగను, శ్రేయోదాయకముగను ఉన్నవి. అందుచేత మనదేశ మున గ్రంథాలయాలు పత్రికాపఠనమందిరములుగా మారుట యుక్త మని తోచుచున్నది. ఇట్టిమార్పు పల్లెటూళ్లలో ముఖ్యముగా అవసరము.

ఇప్పుడు గ్రంథాలయములు యీఅవసరముమ గుర్తించే వార్తా పత్రికలను తెప్పించు చున్నవి. కాని వాటికున్న ధనమును ఒకవైపు పుస్తకములకొరకు యింకొకవైపు పత్రికలకొరకు వెచ్చింపవలసి వచ్చుట చేతను, సాంప్రదాయప్రకారము గ్రంథాలయములకు పుస్తకములు సేకరించుటయందు అభిమాన ముండుటచేతను, వార్తాపత్రికలపై శ్రద్ధ ప్రాముఖ్యత వహించుటలేదు. అవసరమగు పత్రికలపై శ్రద్ధ వెనుక బడుచూ నిరుపయోగమగు పుస్తకములపై శ్రద్ధ-ప్రాముఖ్యత వహించు చున్నది. పత్రికలయొక్క ఉపయోగము గ్రహించినప్పుడు గ్రంథా లయ నిర్వాహక సాంప్రదాయములలో మార్పుకావలసి వచ్చుచున్నది. ఇంతవరకు పుస్తకములను సేకరించుటయే ముఖ్యమగుటచేత-పత్రికలపై శ్రద్ధ నామమాత్రముగ ఉన్నది. దినపత్రికకు సంవత్సరచందా రు25; రు 30 లు ఉండుటచేత కొన్నిగ్రంథాలయములు తక్కువచందా గల వారపత్రికలనే తెప్పించి సంతృప్తి పడుచున్నారు. మిగిలిన డబ్బును

పుస్తకములమీాద వ్యయము చేయుచున్నారు. వారపత్రికలు నవలల వలెనే హాస్యపుకథలతోనిండి విజ్ఞానాభివృద్ధికై విస్తారము సహాకారు లగుటలేదు. వార్తాపత్రికల ప్రాముఖ్యత మనము గుర్తించినతరువాత గ్రంథాలయ సాంప్రదాయములో కావలసిన మార్పు ఏమనగా-విస్తారము ధనమును దినపత్రికలు తెప్పించుటయందే వెచ్చించవలెను. ఇక తెప్పించుపుస్తకములుకూడ వార్తాపత్రికల విషయములకు సంబంధించినవే అయియుండవలెను. వేరువేరు దేశపటములను (Maps) తెప్పించి గ్రంథాలయ గోడలమీాద ప్రదర్శింపవలెను. అనగా గ్రంథాలయములు పుస్తకభాండాగారములుగా కాక పత్రికాపఠన మందిరములుగా మారవలసి యున్నది. ఇట్లు చేయుటవలన అవి ప్రజోపయోగకరముగాను, సంఘాభివృద్ధి కరములుగను ఉండగలవు. అప్పుడు యిట్టిగ్రంథాలయములు ప్రతిగ్రామములోనేగాక ఒకేగ్రామములో పలుచోట్లకూడ అవసరమగును. వాటికి ప్రజ ఉత్సాహముగ తోడ్పడుదురు. ఇప్పుడు గ్రంథాలయములలో ఉన్నపుస్తకములు పత్రికలలోని విషయములను విశదీకరించువరకు ఉపయోగపడుచున్నవి.

పత్రికాపఠన అవసరము దేశమునందు ఉన్నది. కనుక దానికి వేరుగ ఉద్యమము ఉండవలెననియు, గ్రంథాలయ ఉద్యమ ఆశయమునందు దానికి తావులేదనియు అనుకొనుట సమంజసముగా నుండదు. ఏలనన యిప్పటి గ్రంథాలయములలో వార్తాపత్రికలు ఉంటూనే వున్నవి. ఆ శాఖను ఆకర్షణీయముగా అభివృద్ధిపొందించుటయే యీమార్పు కోరుచున్నది. ఈశాఖకు వయోజనవిద్యకూడ అనుబంధము కాగలదు. పత్రికాపఠనమువల్ల-ముందు విషయజ్ఞానములోను, తరువాత వయోజనవిద్యవల్ల అక్షరాశ్యతలోను, అభిరుచి కలిగించినతరువాత గ్రంథపఠనమందు అంతకంతకు శ్రద్ధ కలుగగలదు. అందుచేత పత్రికాపఠన శాఖకు ప్రాముఖ్యత యిచ్చుట గ్రంథాలయ ఉద్యమముయొక్క-ప్రస్తుత ప్రధానకర్తవ్యమై యున్నది.



ఆంధ్ర పితామహ

శ్రీ మాడపాటి హనుమంతరావుగారు

# ఆంధ్రోద్యమము - గ్రంథాలయోద్యమము

శ్రీ మాడపాటి హనుమంతరావుగారు

గడచిన దాదాపు అరశతాబ్దములో తెలంగాణమునందు కలిగిన ప్రబోధమును సూక్ష్మదృష్టితో పరిశీలించువారికి ఇచ్చట జరిగిన సారస్వత, సామాజిక, రాజకీయాది సర్వతోముఖాభివృద్ధికి ముఖ్యముగా సాధనభూతమైనది గ్రంథాలయోద్యమమే యని గోచరము కాకమానదు. సామాన్యదృష్టి కిది కొంతవిచిత్రముగా దోచినను ఈయంశము యథార్థమే యని కొంత యనుభవమును గడించిన నేను చెప్పగలను.

శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయస్థాపన హైద్రాబాదులో (౧-౯-౧౯౦౧) జరిగిన నాటినుండి అనగా యిరువదియవ శతాబ్దము మొదటినుండి సర్వాంధ్రగ్రంథములును బయట వెలువడుచుండిన పత్రికలు నగర వాసులవలన జదువబడుట ఆరంభమైనది. ౧౯౦౪ సం॥ ౨౪ జనవరినాడు కాబోలును హనుమకొండలో స్థాపితమైన శ్రీరాజరాజనరేంద్ర భాషానిలయము సికిందరాబాదులోని ఆంధ్రసంవర్ధని, ఖమ్మముమెట్టులో తరువాత మూయుచుండిన పేర్లతో (హరిహరనాథాంధ్ర గ్రంథాలయము, జ్ఞానవిద్యుత్ప్రకాశిని మొ॥) వెలువడిన గ్రంథాలయములు లేక గ్రంథాలయములును, ఎర్రుపాలెమను గ్రామమున దెరువబడిన మహబూబియా గ్రంథాలయమును, నల్లగొండలోని ఆదిసరస్వతీ గ్రంథాలయము, సూర్యాపేటలోని ఆంధ్రవిజ్ఞాన ప్రకాశినీ గ్రంథాలయము మున్నగునవి కొన్ని ఆంధ్రభాషాప్రసారముతోపాటు యువజనులలో ఆంధ్రాభిమానము కలిగించి వారికి వివిధవిషయిక విజ్ఞానమును సమకూర్చగలిగినవి. వీనియన్నిటిలోను రావుబహదూరు కందుకూరి వీరేశలింగముగారి సంపుటములు ఆకాలమున ప్రథానస్థలము నాక్రమించుచుండెను. ఎక్కువగా చదువబడుచుండిన యితరగ్రంథములలో చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నవలలు, నాటకములు ముఖ్యములు. తరువాత సుప్రసిద్ధులగు తిరుపతివేంకటకవుల గ్రంథములు అతివిస్తారముగా వ్యాపించినవి. ఇంచుమించు కొలదిదినములలోనే ప్రారంభమైన విజ్ఞానచంద్రికా గ్రంథమండలి పుస్తకములు ఎంతో ప్రేమతోను, గౌరవముతోను యువకులవలన పఠింపబడసాగినవి. రావుబహదరుగారి గ్రంథములతోబాటు వారిని తీవ్రముగ విమర్శించునట్టి బ్రహ్మయ్యశాస్త్రిగారి రచనలును, సంఘసంస్కరణమును బోధించు "సత్యవాదిని" తోపాటు "ఆర్యమతబోధిని" వంటి పత్రికలును, లక్ష్మీనరసింహముగారి "మనోరమ, దేశమాత" పత్రికలును, చిలుకూరి వీరభద్రరావుగారి "ఆంధ్రకేసరి" పత్రికయు, అయ్యంకి వెంకటరమణయ్యగారి "ఆంధ్రభారతి"యున్ను, అన్నిటికంటెను ఎక్కువగా చెప్పదగిన "కృష్ణాపత్రిక" యు, తెలంగాణములోని కొద్దిసంఖ్యగల గ్రంథాలయములను సక్రమముగా నలంకరించుచు, ఈప్రాంతములో ఆంధ్రపాఠక ప్రపంచమును విస్తారపరచుటయందు అసాధారణముగా సేవయొసర్చినవి. ఈకార్యమంతయు గ్రంథాలయములమూలముననే విరివిగా జరిగినదని మనము గ్రహించవలయును.

౧౯౨౧ లో ప్రారంభమైన నిజాంరాష్ట్ర ఆంధ్రోద్యమమున గ్రంథాలయ వాచనాలయముల స్థాపనము ప్రధానస్థలము నాక్రమించెనను సంగతి తెలంగాణము వారందరికి తెలిసినదియే. దీనికి కారణము లేకపోలేదు. ఆంధ్రోద్యమముయొక్క ముఖ్యోద్దేశ్యము "నిజాంరాష్ట్రములోని ఆంధ్రులయందు పరస్పర సానుభూతి కలిగించి వారి యభివృద్ధికై ప్రయత్నించుట యని మొదటినుండియే విశాలముగా నిర్వచించబడియు, కార్యకర్తలకు గ్రంథాలయములే ప్రధానసాధనములగుట ఏలయని ఎవరికైన సంశయము తోచవచ్చును. అప్పటి స్థితిగతులను స్మృతిపథములోనికి తెచ్చుకొన్నగాని సంశయము వీడిపోజాలదు. ఆకాలమున సంఘసంస్కారవిషయముల ప్రచారము ఇక్కడి జనసామాన్యమునకు రుచించునదిగా నుండలేదు. మీదుమిక్కిలి విరోధము కలిగించగలిగి యుండెను. రాజకీయవిషయముల ప్రచారము ప్రభుత్వము వారితో పోరాటము తెచ్చునది. మతవిషయికములు ప్రభుత్వాధికారుల అనుమానమునకు దారితీయును. కనుక తెలంగాణ ప్రజలందు ముఖ్యముగా గ్రామీణులందు అభిప్రాయభేదములకును తావీయక అందరి యామోదమునకును, అందరి యభిమానమునకును మార్గమేర్పరచు ఉద్యమము మాతృభాషా విషయమే యనియు, అందును చాల వెనుకబడియున్న తెలంగాణవాసులగు ఆంధ్రయువకులకు సులభముగా బోధపడు నిర్మాణ కార్యక్రమ మేదియా యని ఆలోచించగా గ్రంథాలయోద్యమమే యనియు, అప్పటి కార్యకర్తలకు స్ఫురించినదేమో అని ఊహించుచున్నాను.

అయినను నిరపాయకరమగు నిట్టి యుద్యమమునుగూడ ఆదినములలో జిల్లాలలోని ప్రభుత్వాధికారులు అనుమానదృష్టితో చూడసాగిరి. కార్యకర్తలను చిత్రవిచిత్రములగు ప్రశ్నలతోను ఆజ్ఞలతోను వేధించుట ఎన్నిచోట్లో జరిగినది. గ్రంథాలయమును వాచనాలయమును స్థాపించుటకు ప్రభుత్వాంగీకారము పొందినారా? ఎందుకు పొందలేదు? సభలకు ప్రభుత్వమువారి అనుమతి సంపాదించితిరా? అని సర్వసాధారణముగా ఆక్షేపణలు, అంతరాయములు కలిగినవి. అనేకవత్సరముల నుండి తాలూకా ప్రధానస్థలములలో సాగుచుండిన ఒక గ్రంథాలయమును ఆజిల్లా తాలూకుదారు (కలెక్టరు)గారు, ఈయనజిల్లా లోకల్ఫండు బోర్డు అధ్యక్షమహాశయుడుకూడ చూచి ప్రభుత్వమువారి అంగీకారము పొందనిదే స్థాపించితిరి కనుక వెంటనే మూసివేయుడు అని బందుచేయించిరి. అదృష్టవశమున అప్పుడు విద్యాశాఖకును, పోలీసుశాఖకును ప్రభుత్వ కార్యదర్శిపదవి యందుండిన సర్ అక్బరుహైదరీగారు అట్టి అక్రమమగు ఆజ్ఞను రద్దుచేసి గ్రంథాలయమును నడిపించుటకు సెలవిచ్చుచు గ్రంథాలయములు స్థాపించుటకు ప్రభుత్వాజ్ఞ అవసరములేదని ఖండితముగా స్పష్టపరచిరి. మరియొక గ్రంథాలయము విషయమునగూడ ఇట్టి విపరీతమగు ఆజ్ఞలు ప్రసాదించబడెను. ఈయుద్యమమున కలిగిన యిబ్బందులను గ్రంథవిస్తరభీతిచే వివరించక తెలంగాణమున గ్రంథాలయోద్యమమునకు కష్టములు మితిమీరి కలిగెననియు, కాలక్రమమున అవి తగ్గినవనియు, అట్టి అనుమానములు చిక్కులు కలుగకపోయినచో గడ

చిన ౩౦ సంవత్సరముల కాలములో ఇంకను ఎక్కువగా నిది వ్యాప్తిచెంది యుండు ననియు కొద్దిలో మనవిచేయుచున్నాను.

గ్రంథాలయోద్యమమున యువక కార్యకర్తలను ఆనాడు ఎదుర్కొనిన యీ చిక్కులు ఆంధ్రోద్యమముపైన వారికే ఎక్కువ అభిమానము కలిగించినవి. వార్షికోత్సవములకై స్థానికుడగు చిన్న అధికారివద్దనుండి ప్రారంభించి మ. ఘ. వ. నిజాం ప్రభుత్వమువారి సన్నిధానమువరకు దీర్ఘముగు పర్యాయ ఓపికతో సాగించి అంగీకారము బడయవలసి వచ్చుచుండినందున వారికి పరోక్షముగా కొంత రాజకీయ విషయిక పరిజ్ఞానమును వారిద్వారా జనసామాన్యమున మంచిప్రబోధమును ఏర్పడినవి. రాజధానినగరములోని బాధ్యతగల ఒకగొప్ప ఆంగ్లఅధికారి "గ్రంథాలయములనగా విప్లవోద్యమ కేంద్రములు కావా?" యని నేటి 1946 ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులగు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారితో వాదించి యుండినసంగతి వారికి జ్ఞాపక ముండవచ్చునని తలచెదను. గ్రంథాలయముల వార్షికోత్సవ సభలకై అంగీకారము పొందుట ఎంతకష్టముగా నుండెనో కొంత అనుభవము సంపాదించిన వారిలో ఇల్లెందులపాడు (సింగరేణికాలరీస్) లోని శ్రీసీతారామాంజనేయ హిందూ వర్తక గ్రంథాలయమువారుకూడ పేర్కొనదగియున్నారు. కనుక విస్తరించి ఈ సందర్భమున చెప్పవలసిన పనియుండదు. అయినను ఇటియిబ్బందులు ఇటీవల తొలగిపోయినవి. ఆంధ్రమహాసభవంటి రాజకీయాందోళనను సల్పు సంస్థల వార్షికసమావేశములు వేలకొలది జనుల నాకర్షించునట్టివి. నేటికాలమున మన రాజ్యములో నిరంతరాయముగా జరుగుచున్నవి. పూర్వముండిన నిర్బంధములు దాదాపు అన్నియు తొలగిపోయినవి. సారాంశమేమనగా - తెలంగాణావాసుల సామాజిక రాజకీయాది సర్వతోముఖాభివృద్ధికి స్థానమగు ఆంధ్రోద్యమ రంగమున ప్రభుత్వముతో జరుగవలసిన పోరాటములు చాలవరకు గ్రంథాలయోద్యమ రంగముననే జరిగి ప్రజాపక్షమునకు విజయము చేకూర్చినవని నాయభిప్రాయము.

ఈవిధముగా తెలంగాణావాసుల పురోభివృద్ధికి ఆంధ్రగ్రంథాలయోద్యమము ప్రారంభమునుండియు నేటివరకు ప్రధానసాధనమై వెలయుచున్నది. ఇది రాజధానీనగరమగు హైదరాబాదునుండి పల్లెటూళ్ళవరకు ప్రభుత్వమువారి ద్రవ్యసహాయము పొందకయే స్వతంత్రముగా వ్యాపించినది. తెలంగాణములో స్థాపింపబడినట్టి వందకు మించిన యిట్టిసంస్థలలో రెంటికి హనుమకొండ వరంగల్లులోని వాటికి మాత్రము ప్రభుత్వమువారు నెలకు పదియో, పదిహేనో రూపాయిలు కొంత కాలమునుండి ఇచ్చుచున్నట్లు జ్ఞప్తియందున్నది. తక్కినవన్నియు ౧౯౦౧ నుండి నేటివరకు ప్రజాద్రవ్యముపైననే ఆధారపడి యున్నవి. ఇది ప్రశంసనీయము; గౌరవావహముకదా!

# ప్రబోధగీతము

శ్రీ రాగి నర్సింలుగారు, యంపజనగ్రంథాలయ కార్యదర్శి, జనగాం

1. గ్రంథాలయ మెటులుండాలె? పఠనాలయ మెటులుండాలె?
ప్రజలసేవకై పాటుపడుచు నిరక్షరతను పోనాడాలె గ్రం॥

2. సభ్యుడన నెటులుండాలె. తన సభ్యత గుర్తెరిగుండాలె
సభ్యులెల్ల తమ సహజనైజమున సభ్యతతోడనె మెలగాలె గ్రం॥

3 కార్యవర్గ మెటులుండాలె కడు శ్రద్ధగల్గి చరియించాలె
కన్నతల్లివలె కాపాడుచు - కారుణ్యముతోడనె మెలగాలె గ్రం॥

4 కార్యదర్శి యెటులుండాలె - తనకర్తవ్యము నెరిగుండాలె
కార్యదర్శి తనశక్తినంతయును ధారవోసి జయమందాలె గ్రం॥

5, పాలకుండు ఎటులుండాలె - కడుశాంతచిత్తుడై యుండాలె
నమ్రభావమున మెలగుచు - పాఠకఆదరణము పెంపొందాలె గ్రం॥

6. పాఠకుండు ఎటులుండాలె - తనపఠనయందె మనసుంచాలె
తోడిపాఠకుల పఠనకెపుడు - తను విఘ్నతజేయక మెలగాలె గ్రం॥

7, గ్రామప్రజలు యెటులుండాలె తద్గ్రామజనరంజకులై జగమెరగాలె
మిత్రభావమున శ్రద్ధతోడ ఆలయ అభివృద్ధిని చేయాలె. గ్రం॥

# నగర జ్యోతి (గోడ వార్తాపత్రిక)

శ్రీ ఇంద్రగంటి సుబ్రహ్మణ్యంగారు

ఇది నవయుగము. యంత్రాలతో లక్షలాది దినపత్రికలు వెలువడే యీ ప్రపంచదేశాలలో కొన్నింట "వాల్‌న్యూస్ పేపర్లు" వున్నవంటే వార్త విద్యావ్యాప్తికి ఎంతఅవసరమిచ్చిందో గ్రహింపనగును. ఇందు ప్రతిరోజు స్థానిక, సాంఘిక, రాజకీయ, అంతర్జాతీయ, జాతీయ విషయాలు, నైతికవిషయాలు చర్చించుటకు వీలగును. వ్రాయువారి సామర్థ్యాన్నిబట్టి సకలవిషయాలను, కళలను, తత్వాలను, పండొలిచి చేతబెట్టినట్లు చదువరుల కందివ్వవచ్చును. ప్రజలా అట్టిసంగతుల నెంతో జాగ్రత్తగా చదివి లాభపడుతూవుంటారు. ఆయాస్థలాల అవసరాలనుబట్టి వయోజనులకు విద్యాభ్యాసమునుకూడా ఒక కలంలో వ్రాయుచుంటుంటే బాగుంటుంది. ప్రపంచయుద్ధరంగములయొక్క మ్యాపులను, వ్యంగ్యచిత్రములను వ్రాయవచ్చును. గ్రంథాలయాలను ఎక్కువ చేయుటకు ఎట్టికృషిని యీ ఆంధ్రగ్రంథాలయమహాసభవారు చేయుచున్నారో అలాగే యిట్టి గోడపత్రికలనుకూడ మనదేశంలో వృద్ధికి రానిచ్చిన నూటికి 93 మంది చదువురానివారున్నారని చెప్పబడు మన భారతదేశంలో విజ్ఞానభిక్ష పెట్టినవారలగుదురు. ఇంక నెల్లూరు నగరాన ప్రతిరోజు ఈగోడపత్రిక ఎట్లు చిత్రింపబడుచున్నదో అను విషయానికి వద్దాం.

1. ఈపద్ధతి రష్యా, స్పెయిన్, అమెరికా, జర్మనీ దేశాలల్లో వాడుకలో వున్నదని వింటున్నాము. నేనొకనాడు ఒక చైనాగ్రంథాన్ని చదువుచుండగా ఒక వాల్‌న్యూస్‌బోర్డు పటమును చూచినప్పుడు, మనముకూడా ఎందుకు గోడమీద వ్రాయరాదను భావం నాలో ఉదయించినందున, నేను 42 మాసాలు (అనగా మూడున్నరసంవత్సరములు) గా నెల్లూరులో నీగోడపత్రికను నిర్వహిస్తున్నాను.

2. ఇది చాల చౌకబేరము. ఒక ముద్రణాలయములో అచ్చొత్తించుటద్వారా నడుపబడే పత్రికలఖర్చు అధికము. నల్లగోడమీద

తెల్లసుద్దముక్కతో వ్రాయు ప్రతిఒక్కడూ ఎడిటర్ (సంపాదకుడు) రైటర్ (రచయిత), పబ్లిషర్ (ప్రచురణకర్త) అయిపోతాడు. ఈ పేపరు కంట్రోల్సు, ప్రెస్‌సమస్యలు అట్టివారికి వుండవు.

3. కాని వ్రాయువానికి ఓపిక, సహనము, పత్రికాగ్రంథపఠనము వుండవలయును. చదివి విషయసారాన్ని గంభీరముగా గోడపై ప్రతిబింబింప చేయవలెను. ప్రాముఖ్యతనుబట్టి అక్షరాలు పెద్దవిగాను చిన్నవిగాను వ్రాయవలెను. డిపార్టుమెంటులు మొదలగువాటిలోని లోపాలను చక్కదిద్దుటకు పూనుకోవచ్చును.

4. ఈ గోడపత్రిక వివరాలు- నెల్లూరు (సింహపురి) ట్రంకు రోడ్డులో తిప్పరాజు సత్రంవద్ద ఒకగోడకు సిమెంటుబూసి సీమసున్నపు కోపులతో ప్రపంచములోని ముఖ్యవార్తలు, యుద్ధకథలు, నిశితవిమర్శలు, దేశభక్తిని ప్రబోధించువిషయాలు, స్థానికవార్తలు, ఏదినాని కాదినము, ఏగంట కాగంట ఉడుకుడుకుగా వ్రాసి రుచిచూపింపబడును. ఇది దినపత్రికలకంటే, త్వరగా వార్తల నందిస్తుంది. నెల్లూరులో ఉండే వారుగాని, నెల్లూరుకు వచ్చేవారుగాని ఈగోడవార్తలను చదువకుండా వుండలేరు. అమెరికా మొదలగు అన్యదేశసోల్జర్లుకూడా యీ గోడను ప్రజలు విచిత్రంగా చదువుటను చూచి ఫోటో లెత్తుకొనిరి.

5. మొదట యీఫక్కీని కీ॥ శే॥ తూములూరు అనంతపద్మనాభయ్యగారు ప్రారంభించిరి. ప్రథమంలో వారు న్యూస్ పేపర్లను గోడకు కరిపించేవారు. తర్వాత పోస్టర్సువ్రాసి కరిపించేవారు. అటుపిమ్మట ఆగోడకు సిమెంటుపూత (నల్లరంగు) పూయించి, దానికి ఒకహంగురూపము కల్పించారు. శ్రీ ముత్తరాజు గోపాలరావు - తర్వాత మధ్యమధ్య శ్రీ మన్నేపల్లి హనుమంతరావు, లక్ష్మయ్య ప్రభృతులు సాగించారు.

6. (అ) ఈగోడ విచిత్రలెక్కలు:- పొడుగు 22 అడుగులు, వెడల్పు 6 అడుగులు; అంటే 132 చ అ. వైశాల్యమన్నమాట. ఈ పొడుగును తొమ్మిది, లేక పది కలాలుగా విభజింపబడును.

దీనిమీద దినం ఒక్కింటికి 3000 అక్షరాలు వ్రాయబడును. నెలకు లక్ష. ఈ 42 నెలలకు 42 లక్షల అక్షరాలు.

(ఆ) దినానికి సగటుకు వెయ్యిమందికి పైగా పెద్దలు, పిన్నలు పత్రిక కొననోల్లనివారు చదువుతారు. నెలకు 18 వేలు, గత నలు బదిరెండుమాసాలకు 756000 మంది చదివిరి.

(ఇ) ఈవ్రాతకు దినానికి 10 సీమసున్నపు కోపులు కావాలి. నెలకు 300. గత 42 మాసాలకు 12,600 కోపులు అయినవి. వీటి క్రయం మాత్రము 90 రూపాయలు.

(ఈ) ప్రతిరోజు అక్షరాలు తుడిచినందుకు ఆనాటి వానికూలి దినానికి అణా. గత 42 మాసాలకు రూ 78-12-0. పత్రికల కొను గోలు దినం ఒక్కింటికి 0-3-0 వంతున లెక్కవేసి చూచిన గత 42 మాసాలకు రు 236-4-0 లు అవుతుంది. అనుభవము వచ్చేకొద్దీ యితర గ్రంథాలను, పత్రికలను డబ్బుతో కొనవలసివస్తుందిగూడ.

(ఉ) పనిచేయువానికి కొంత గౌరవభృతి లేనిదే ఎట్లానడుస్తుందీ రథం. ఇప్పటికే పై మొత్తాలనుచేర్చిన నాలుగువందల రూపాయలకు పైన ఖర్చయింది.

(ఊ) గత 42 మాసాలలో వ్రాసిన అక్షరాలన్నీ అక్షరంవెంబడి అక్షరం నిలిపితే ఈ గోడ 50 మైళ్లు నడిచినట్లగును

7. ఈగోడ నిర్వహణాన్ని శ్రీ వినోబాభావే (వార్ధా) శ్రీఠక్కర్ బాబా (అఖిలభారత హరిజన సంఘాధ్యక్షులు, ఢిల్లీ) మొదలగు భారతనాయకులుకూడ చూచి ప్రశంసించియున్నారు. ఒకటి చిత్రగుప్త. సంక్రాంతి, 1943 జనవరి 15 వ తేదీ సంచికలోను, రెండు జమీన్ రైతు 24-3-44 ఉగాది సంచికలోను, మూడు ది టెలి గ్రాఫ్ (కలకత్తా) 15-7-44 పత్రికలో ('A news paper without paper) అని" న్నీ, నాలుగు ది ఓరియంట్ ఇలస్ట్రేటెడ్ వీక్లీ (కలకత్తా) పత్రికలోను "ఈ గోడవార్తల ఒకదినం" ఫోటోను సహా

ముద్రించి ఇట్టిపద్ధతి అఖిలభారత దేశంలో ఒక్కటియే అని దీని ప్రజా సేవను శ్లాఘించిరి.

8. ఈ కార్యము జరుగవలెనంటే ధనంకావాలి. ఫండ్సు లేవు. వ్యక్తిపై ఏకొందరో చూపు అభిమానంవల్ల జరుగుచున్నది. రానిచో (ధనం) గోడను నిలుపరాదు. సంకల్పబలిమి వుంటేనే ఇట్టికార్యాలు సాగుతవి. దాన్నిబట్టే ధనం ముందు. ధనముంటే ఏదికాదు? ఏదైనా కావాలంటే ధనంకావాలె. ఇదీ సమస్య. అడ్డాలు తొక్కుంటూ ముందుకుపోతూనే వుండవలెను.

9. ఈవిధంగా భారతదేశంలో ప్రతిగ్రామంలో పట్టణంలో యిట్టి గోడపత్రికలను నెలకొల్పవలెను. అట్టివాటిని ధనికులు ప్రోత్సహించవలెను అని నాసోదరమహాశయులకు మనవి.

10. దేశాభిమానము దాస్యమునుంచి విముక్తిపొందవలయును అను దీక్షగలిగిన యిట్టివేగాదు, యింకా గొప్ప ఘనకార్యములుచేసి భారతమాత దాస్యమును పోగొట్టగలము. భారతమాత స్వాతంత్ర్యమైననాడే ప్రపంచశాంతి ఏర్పడగలదు.

* * * * *

# గ్రంథాలయముల కార్యక్రమము

## సూరపరాజు కోటయ్యగారు, కార్యదర్శి

## శ్రీ వెజ్జావ్రగడ గ్రంథాలయము - గుడ్లూరు

గత జనాభా ప్రకారము ఆంధ్రభాష మాటలాడు పదకొండు జిల్లాల జనసంఖ్య 1,83,74000. మద్రాసులోను, రాష్ట్రేతర ప్రాంతములందును ఉన్న ఆంధ్రజన సంఖ్యను కలుపుకొనిన, దాదాపు 2½ కోట్లమంది ఆంధ్రులుందురని ఊహింపవచ్చును. వీరిలో నెంతమందికి మన గ్రంథాలయోద్యమ ముపకరించుచున్నదీ ఆలోచించెదము. 1939 సం॥ లో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము ప్రకటించిన పట్టికప్రకారము ఆంధ్ర ఆంధ్రేతర ప్రాంతములలో గ్రంథాలయములు 779 గలవు. వీనిలో నిప్పుడు కొన్ని నశించియుండును! కొన్ని నామమాత్రావశిష్టములై యుండును! ఈవల కొన్ని నూతనముగ స్థాపింపబడియుండును. ఎట్లైనను ప్రస్తుతము 1000 గ్రంథాలయములు మాత్రమే ఆంధ్రులకు సేవచేయుచున్నవని లెక్కింపవచ్చును. వీనిలో ప్రతి గ్రంథాలయమునకు సరాసరిగా 100 మంది పాఠకులుందురని కొంత హెచ్చుగా అంచనావేసినను, మొత్తము 1,00,000 మందికి మాత్రమే ఈ గ్రంథాలయము లుపయోగపడుచున్నవి. గత జనాభా లెక్కలప్రకారము ఆంధ్రులలో 17,53,000 మంది చదువనేర్చినవారున్నారు. చూడుడు! 2 1/2 కోట్లమొత్తము జనసంఖ్య; అందు విద్యావంతులు 17,53,000. వీరిలో గ్రంథాలయము లుపయోగపడుచున్నది 1,00000 మందికి. అనగా మొత్తము జనసంఖ్యలో 300 మందిలో ఒకరికిని, విద్యావంతులలో నూరింట ఐదుగురికిని, ప్రస్తుతము మన ఉద్యమ ముపకరించుచున్నదన్నమాట. దీనినిబట్టి ఆలోచించితిమేని ఆంధ్రగ్రంథాలయోద్యమ ప్రచారకులు, నాయకులు చేయవలసిన పని మిక్కుటముగ కలదని తేలుచున్నది. ఆంధ్రావని పాడిపంటలకుగాని, ధనవంతులకుగాని, ధార్మికులకుగాని, ఇరుగు పొరుగు దేశముల కింతమాత్రము కొరతపడియుండలేదు. ఇంకను రాజకీయాది ఇతరఉద్యమములందు సైతము భారతదేశమునకంతకు అగ్రతాంబూల మందుకొని ప్రసిద్ధికాంచినది. కాని జనసంఖ్యకు తగినన్ని గ్రంథాలయములు మాత్రము వ్యాప్తిగాంచలేదని మనవిచేయుచున్నాను. ప్రస్తుతము మనదేశములో ముప్పాతికవంతు తాలూకాల కేంద్రస్థానములలోను, అన్ని విధముల తగియున్న అనేక పెద్దగ్రామములందును గ్రంథాలయములే లేవు. ఇట్టి చోటులను మనము పరిశీలించితిమేని గ్రంథాలయములు నిర్వహింపబడుటకు మంచివసతి గలదని తెలిసికొనవచ్చును. మా నెల్లూరుజిల్లాలో నొక పెద్దగ్రామములో నొకరు స్వయముగా కొన్ని చవుకరకపు నవలలు, కథలు మొదలగు గ్రంథములు కొని అభిలాషకలవారికి బాడుగకు ఇచ్చి ధనము సంపాదించుకొనుచున్నారు. ఈకార్యమును వీరొకవృత్తిగా సాగించుచున్నారు. ఈవిషయము నే నిటీవలనే తెలిసికొని గ్రంథాలయం స్థాపించుటకు గ్రామస్థుల ప్రోత్సహించితిని. త్వరలోనే అచ్చట మంచి

గ్రంథాలయము మేర్పడగలదు. ఇట్లు చదువ నభిలాషకలిగి గ్రంథాలయము వసతిలేని గ్రామములెన్నిగలవో తెలిసికొని గ్రామస్థుల ప్రోత్సహించి గ్రంథాలయము మేర్పడు నట్లు చూచుట ప్రచారకుల ధర్మము. మొదట 5,000 మించిన జనాభాగల గ్రామము లన్నిటిలోను, తర్వాత 2,000 లకు మించిన గ్రామములలోను, గ్రంథాలయములు స్థాపించుటకు ప్రయత్నింపవలెను. అప్పటికిగాని ఉద్యమము కొంత వఱకు వ్యాపించదు. అయితే స్థాపించిన గ్రంథాలయములన్నియు క్రమముగా సాగక నిలిచిపోవచ్చును. కాని కొన్నియైనను క్రమముగ పనిచేయునుగదా?

స్థాపించిన గ్రంథాలయములు క్రమవిధానముపై సాగుటకు తగినకార్యక్రమ ముండవలెయును. ముఖ్యముగా గ్రంథాలయము గ్రామములోని ప్రజలందరకు ఏదో యొకవిధముగా నుపయోగపడునట్లు చూడవలయును. గ్రంథాలయము లిప్పుడెక్కువగా కేవలము విద్యావంతులకు మాత్రమే ఉపయోగపడుచున్నవి. మన దేశములో అత్యధికసంఖ్యాకులగు నిరక్షరులకు సైతము గ్రంథాలయము లుపకరించునట్లుగా యేర్పాటుచేయవలెను. అప్పుడుగాని ఉద్యమము సర్వతోముఖముగ వ్యాప్తిగాంచ నేరదు. గ్రంథాలయోద్ధారక అయ్యంకి వెంకటరమణయ్యపంతులుగారు చెప్పినట్లుగా గ్రంథాలయములు పరీక్షపట్టాలను పొందగోరువారికి మాత్రమేకాదు; అవి సర్వసామాన్యజనులయొక్క సర్వకళాశాలలుగా నుండవలెను. గ్రామప్రజలను వారు ఐదుతరగతులుగా విభజించిరి. (1) అక్షరజ్ఞులలో చదువ నిచ్చగలవారు. (2) అక్షరజ్ఞులలో చదువ నిచ్చలేనివారు, (3) నిరక్షరులు. (4) బిడ్డలు (5) స్త్రీలు. వీరందరను గ్రంథాలయము నాకర్షించవలెను. ఇందుకు గ్రంథాలయ నిర్వాహకులు పైతరగతులవారిగా గ్రామములోని ప్రజలను, ముసలివారిని, బిడ్డలను వదలివేసి మిగిలినవారి పేర్లపట్టికలు తయారుచేయవలెను. ఈ పట్టికలలోని వారిలో ప్రతివారిని అధమపక్షము నెలకొకసారియైనను గ్రంథాలయమునకు రప్పింపవలయునని నిర్వాహకులు దీక్షపూనవలెను. ఈ ఐదుతరగతులవారిలో చదువ నిచ్చగల విద్యావంతులను గురించి విశేషశ్రద్ధ తీసుకొన నవసరముండదు. అట్టి వారిని ఎంతమాత్ర ముపేక్షింపరాదు. వారే మనప్రయత్నమున ప్రోత్సాహమిచ్చువారు. విద్యావంతులలో చదువ నిచ్చలేనివారికి పుస్తకపఠనమువలని లాభములను గురించి వ్యక్తిగతముగాను, సమావేశములందును పలుమారు బోధింపవలెను. వారికి తగిన పుస్తకముల చూపియు, అందలి రసవత్తరమగు ఘట్టములను చదివి వినిపించియు, చెప్పియు పత్రికావార్తలను గోడల పైవ్రాసియు ఆకర్షించవలెను. ఇక నిరక్షరులగు మూడవతరగతివారి నాకర్షించుటలోనె మిక్కిలికష్టమును అధికమగు ప్రాముఖ్యమును కలదు. మన దేశములో నూటికి 90 మందిగల వీరిని వదలితిమేని గ్రంథాలయోద్యమము వ్యాప్తిగాంచనేరదు. కాన వీరినిగూర్చియె విశేషశ్రద్ధ వహింపవలెను. వీరి నాకర్షించి బోధించుట కనేకపదతులు కలవు. పత్రికా, పురాణ, శ్రవణము, ఉపన్యాసములు, హరికథలు, వీధినాటకములు, జంగంకథలు, భజనలు, బొమ్మలాటలు, దొరికినచో చిత్రపటప్రదర్శనము,

రేడియోలు మున్నగునవి చాలగలవు. గ్రంథాలయ ఆర్థికపరిస్థితుల ననుసరించి సాధ్యమైనంతవఱకు వీని నాచరణకు తేవలెను. పత్రిక, పురాణశ్రవణములు, ఉపన్యాసములు, భజనలు, ప్రతి గ్రంథాలయమువారు చేయతగిన పనులుగా నున్నవి. మొదట వీరి తీరికసమయముల నెరిగి పదుగురు చేరు చావడులు, రచ్చకొట్టములు మొదలగు కూడలిస్థలములకు పోయి జేగంటలు, తప్పెటలు, హార్మోనియము, గ్రామఫోనులను వాయించి వారినాకర్షించి ప్రబోధింపవలెను. గ్రామపండుగలు, జాతరలు మొదలగు వేడుకసమయములందు వారు గుమికూడినప్పుడచ్చటచేరి ఉపన్యసించుట సులువగుపని. వీరి కేవిషయమైనను చెప్పునప్పుడు ఏదో గొప్ప ఉపన్యాసధోరణిలో అర్థముకాని భాషలో నెంతచెప్పినను నిష్ఫలమగును. ప్రథమమున ఆశ్చర్యమును కలిగించు వింతవిషయములు అనగా ఉత్తరధ్రువప్రాంతములోని ఎస్కిమోలు, చలిప్రాంతములలోని ప్రజల అలవాటుల ఆచారములు, అచ్చట పెరుగు పైర్లు, చెట్లు జంతువులు, మున్నగు భూగోళాంశములు, తెనాలిరామలింగని నిజమైనకథలు, తిమ్మరుసుమంత్రి నైపుణ్యము, యుగంధరుని పిచ్చివేషము, శివాజి మిఠాయిగంప మున్నగు చారిత్రకాంశములు; కోయిల పిల్లలను కాకి పెంచుట, సీతాకోకచిలుకపుట్టుక; వానపాము జీవితము, ఎడారిఓడ, నిప్పుకోడి, మొదలగు సృష్టిరహస్యములు, మనుష్యునిజీర్ణకోశము, గుండెకాయ, ప్రేగులు, ఊపిరితిత్తులు, వీని చలనము ఉపయోగము మున్నగువిషయములు సులువగుభాషలో చిన్నచిన్నకథలుగా చెప్పి వారి నాకర్షింపవలెను. ఇట్లుచేసినచో ఉల్లాసము వలన వినవలయుననే తృష్ణ కలిగి పిలువకనె వచ్చుచుందురు. ఈ నిరక్షరులలో చదువునేర్చినవారిలో చదువనిచ్ఛగలవారున్నట్లు, విననిచ్ఛగలవారుందురు. వారిని సులువుగా ఆకర్షింపవచ్చును. ప్రతిగ్రంథాలయమువారును రాత్రిపాఠశాలను నిర్వహించి నిరక్షరులకు అక్షరములు నేర్పుటయేగాక ఇతరవిషయములు బోధింపవచ్చును. గ్రంథాలయకార్యక్రమములో ఇట్టివిద్యాహీనుల జ్ఞానాభివృద్ధికి పాటుపడుటకు ప్రాధాన్యమొసంగవలెను. విద్యావంతులకు పుస్తకములు పత్రికలందించుటతో తృప్తిపడరాదు. నాలవతరగతి ప్రజలు స్త్రీలు. వీరిలోను చదువనేర్చినవారు నేర్వనివారు రెండుతెగలున్నారు. మనదేశ సాంఘికమర్యాదల ననుసరించి స్త్రీలు గ్రంథాలయములకు వచ్చి పురుషులతో కలసి మెలసి చదువుట పొసగనిపని. వారికి ప్రత్యేకగదులు నేర్పరచి రప్పింపప్రయత్నించుటగూడ నిష్ఫలము. గ్రంథాలయ నిర్వాహకులె పుస్తకములు వారిండ్లవద్దకు పంపి చదువ ప్రోత్సహింపవలెను. నిరక్షరుల విజ్ఞానాభివృద్ధికి చేయు ప్రయత్నములవలెనె చదువురాని స్త్రీలకు ప్రత్యేకమైన యేర్పాటుచేయవలెను. ఆర్థికవసతులున్న గ్రంథాలయము స్త్రీలశాఖను యేర్పాటుచేసి స్త్రీ పరిచారకురాలిని నియమించుట మంచిది. పురుషులవలెనే ఉత్సాహముగల విద్యావంతులగు స్త్రీలు తమగ్రామములోని గ్రంథాలయముద్వారా ఉచితసేవచేసి తనతోడి స్త్రీలవిజ్ఞానాభివృద్ధికి తోడ్పడవలెనని వారిని ప్రార్థించుచున్నాను. అయిదవతరగతి వారు బిడ్డలు. వీరిలో బాల, బాలికలున్నారు. చాల గ్రంథాలయములవారు వీరినిగురించి బొత్తుగా శ్రద్ధవహించుట

లేదు. తక్కినవిషయము లెట్లున్నను గ్రంథాలయము శాశ్వతముగా అభివృద్ధి గాంచుచుండవలయునన్న ఆగ్రామములోని ముందుకాలములో పౌరులుకాబోవు వీరినిగురించి నిర్వాహకులు కొంత శ్రద్ధవహించవలెను. వారికి చిన్నతనమునుండియే గ్రంథాలయము యొక్క పరిచయము అభిమానము కలిగించవలెను. ప్రతిగ్రంథాలయమువారును పిల్లలకు తగిన కథలు చిత్రపటములు మున్నగు నీతిజ్ఞానదాయకములగు పుస్తకములు సంపాదించి వానికి ప్రత్యేకమైన పట్టికను తయారుచేసి ఉంచవలెను. నీతి బాహ్యములగు వారికి తగని గ్రంథములు వారికి ఇవ్వబడదని చూడాము. ఇందులో నిర్వాహకులు చాల జాగ్రత్తగ నుండవలెను. అయితే భాద్యతనెరుగని పిల్లలకిచ్చిన పుస్తకములకు కొంతనష్టముకలుగుట సంభవించును. ఇందుకు వారు చదువుపాఠశాల ఉపాధ్యాయుల యొక్కయు, తల్లిదండ్రులయొక్కయు, తోడ్పాటు కొంతలాభించును. అయినను మహాకవి ఠాగూరుగారన్నట్లు బీరువాలోనశించిన గ్రంథములు తిరిగిరావు కాని పాఠకుని చేతిలో నశించిన గ్రంథములు తిరిగివచ్చును. కాన కాబోవు గ్రంథాలయనిర్వాహకులగు యీపిల్లలవలన గ్రంథాలయమునకు కొలదినష్టము సంభవించినను అది భరించుట ధర్మమేయగును. అసలు వీరికిచ్చు గ్రంథములు చిన్నవిగాను, స్వల్పవెల కలవిగా నుండును. కాబట్టి నష్టమునకు భయపడనవసరముండదు. ఇంకను వీరికొరకు పోటీపరీక్షలు, ఆటలు ఏర్పాటుచేసి, బహుమతులిచ్చి, ప్రోత్సహించుట బాగుండును.

ఈ పనులు నెరవేర్చుటకు గ్రంథభాండాగారి మంచినేర్పరిగాను, ఉత్సాహవంతుడుగాను, సేవాభిలాషిగా నుండవలయును. ఇంకను గ్రంథాలయములో రైల్వే టైంటేబులు; పోస్టల్, రైల్వేగైడ్లు, పంచాంగము, ఆగ్రామములోని భూములను గురించి విశేషములు తెలుపు డిస్ట్రిక్టుగజిటర్ మొదలగు గ్రామస్థులకు నిత్యకృత్యముల కుపయోగించు విషయములు గ్రంథాలయనిర్వాహకులు సేకరించి యుంచవలెను.

గ్రంథాలయమిట్టి సాధనాంతరములచే గ్రామములో ప్రజలందరకుపయోగపడుచు ఏదోయొకవిధముగా వారికి జ్ఞానదాయకమై వెలసినప్పుడే గ్రంథాలయోద్యమము సార్థకమై వర్ధిల్లగలదని మనవిచేయుచు విరమించుచున్నాను.

# గ్రామగ్రంథాలయోద్యమము

## శ్రీ వి. యస్. వెంకటనారాయణగారు

మన దేశములో నూటికి 90 గ్రామములే యున్నవనే విషయము మనము మఱువకూడదు. ఈ గ్రామాదులలో వ్యవసాయముపై ఆశకూడ తగ్గిపోవుటయు కన్పించుచున్నది. ఇవన్నియు చూచి గ్రామ పునర్నిర్మాణము చేయవలసిన ఉద్యమారంభమైనది. కాని ఈకార్యము సామాన్యమా? గ్రామస్థులు మనమొసగు ఉపదేశములనూ గొనసంసిద్ధులైయున్నారా? యనుట మనము గమనించవలెను. వారిలో అక్షరాస్యులు తక్కువ. అట్టివారికి మనము చేయవలసినదేమి? వయోజనవిద్యావ్యాప్తియయి ప్రజలలో మానసికపరివర్తన పొడ్డిననే గాని మనము చేయబోవు ఏప్రయత్నమునకుగాని సాఫల్యము లేదు. గ్రామములో అవిద్యను రూపుమాపవలసియున్నది. ఊరకే సహకారోద్యమము గ్రామములకు శుభదాయకమనియు, గ్రామపంచాయితీబోర్డులు గ్రామసౌభాగ్యదాయకమనియు, పల్కుట నిరర్థకము. మనము చెప్పెడుదానిని అర్థము చేసికొనగలశక్తియు, దానివలన లాభము పొందగల అనుభవము గ్రామస్థులయందు లేనిచో మనప్రచారమువలన లాభములేదు. ఇట్టిస్థితిని కలుగజేయుట సులభసాధ్యముగాదు. ప్రాథమికపాఠశాలలను ఉన్నత పాఠశాలలను ఏర్పాటుచేయుటచేతగాని, ఓనమాలను నేర్పించుటచేతగాని, ఈ ఆశయము పరిపూర్తికాజాలదు. మన వ్యవసాయపద్ధతులు పురాతనములు, శాస్త్రీయపరిశోధనల కందుబాటులేదు. ఆధునాతనపద్ధతులను మనవారు ఉపయోగించుటలేదు. భిన్నకులముల వారొకరితో నొకరు కలహించుటయేగాక దేశము జాతీయత యను అభిప్రాయమునే గమనించకున్నారు. నేటివఱకును మూఢనమ్మకములు ఆచారములు పాటించుచున్నారు. గ్రామకక్షలమూలమున కోర్టులు వృద్ధియగుట సంభవించుచున్నది. ఆర్థికముగ గ్రామస్థులస్థితి బాగుపడుటలేదు. అందుచే మన దేశస్వాతంత్ర్యముకొరకు మనము ప్రయత్నించుట కష్టమగుచున్నది. ఈ పరిస్థితులెల్లను మార్పవలెను. ఇట్టిపరిస్థితులను మార్పుచేయుటలో గ్రంథాలయోద్యమము మిక్కిలి ప్రయోజనము. ఉపయోగింపగలదనుటలో నతిశయోక్తిలేదు. గ్రామములోని వయోజనులందరికి విజ్ఞానము కలిగించు పుస్తకములను అందుబాటులోనికి తేవలయును. వానిని చదువగలశక్తి వారికి లేకపోవచ్చును. అట్టిచో విద్యావంతులగువారు ఆబాధ్యతను తమపైనుంచుకొని వారికి జ్ఞానప్రసాదము చేయవలెను. విద్యావంతులు సంఘసేవలో ఇదియొక అంశముగ పాటించవచ్చును. ప్రతి గ్రామమునకును ఒక్కగ్రంథాలయ ముండవలెనని కోరుట అడియాసయేయగును. ప్రతిగ్రామమున ఒకపాఠశాలయుండుటయే మృగ్యముగదా! కొన్నిగ్రామములకు కేంద్రగ్రామములో ఒక గ్రంథాలయము నేర్పాటు చేసి దానిని ఆధారముగ సంచార గ్రంథాలయముల నేర్పరుపవచ్చును. దీనివలన నెంతయో సులభముగా గ్రంథ పఠనవ్యాపకము సాగగలదు.

"గ్రంథాలయోద్యమ మూలమున ప్రజలలో భావపరివర్తన కలుగునా? ఇది ఎంతటివిదూరము" అని పరిహసించు వారును గలరు. దీనికంతయును ధనమునిచ్చేదెవరని మఱికొందఱు పెదవివిఱచుటయు కలదు. ఈరెండువిధములైన విమర్శలు అసంగతములని ఋజువుచేయవచ్చును.

ప్రపంచములో ఏదేని యొకఉద్యమము లేవదీయునప్పుడు కొంతసాహసము, చాలినంతఓర్మి, ఆశ, పట్టుదలలు అత్యావశ్యకములు. ఈనాలు లక్షణములతో ప్రయత్నించిన ఉద్యమము జయప్రదముగ సాగుటకు సందేహములేదు. ఉత్తరఅమెరికాలో మెక్సికో యందు కలోనియాడిచాల్కా అనే ప్రదేశముకలదు. ఇదిపూర్వము దురంతులకు నిలయమై యుండెడిది. హత్యాచారులు, చోరులు, ఇతరదుస్స్వభావులునైన వారే ప్రాంతమున నుండిరి. ప్లేగు ఎంతటిభయంకరమో వీరిస్వభావము అట్టిదిగ నుండెను. ఇట్టిప్రాంతమునకు ఒకదినము సీజార్ అగోపిజా అనే వృద్ధమనుష్యుడు ఒక తోపుడుబండిలో కొన్ని పుస్తకములను ఉంచుకొనివచ్చెను. అందరును అతనిని చుట్టుకొనిరి. ఆయన ఒక్కొక్కరికి ఒకొక్క పుస్తకముచొప్పున ఉచితముగ చదువుకొనుటకిచ్చి తాను మఱువారమునకు వచ్చెదననియు, అప్పుడాపుస్తకములను వాపసుచేసిన యెడల వేఱుపుస్తకముల నిచ్చెదననియు, తెలిపి వెడలిపోయెను. వారు వీడెవడో పిచ్చివాడని భావించిరేమో! కాని పుస్తకములను చదువుటలో వారిలో ఒకవిధమైన మార్పుకలిగినది. తిరిగివాడెప్పుడు వచ్చునో యని వారు ఆతురతపడిరి. సరిగా వారమునకు అతడు వచ్చుటయు, పుస్తకముల నిచ్చి వెళ్ళుటయు తటస్థించినది. ఇట్లు పలుమారు జరుగగా ఆ వృద్ధమనుష్యునిపై ఆప్రాంతములలోని వారికి ఎంతయో గురుభావము కలిగినది. అంతటితో వారికి దుస్స్వభావములను మార్చుకొని సక్రమజీవనముపై యుండవలెనను ఆశ జనించినది. వారు ఆయనను తమ బాలుర కొకపాఠశాలను స్థాపించి, వారినెల్ల యుద్ధరింపుమని ప్రార్థించిరి. ఆయన అందుకై తగినస్థలముకొఱకు ప్రభుత్వమును ప్రార్థించగా వారు పాడుపడిన సారాయిపాకయందు ప్రదేశమునొకదానిని ఉచితముగ నిచ్చిరి. అందుపై అగోపిజాగారు దానిని మరమ్మతుజేసి పాఠశాలను స్థాపించుటలో బాలుర సహాయమును కోరెను. బాలురే ఇటుకలను తెచ్చుట, గోడలుకట్టుట సంభవించినది. ఈసహకారపద్ధతిన పాఠశాల త్వరలో ఉద్భవించినది. ఈపాఠశాల ఉద్భవించి ఆప్రాంతీయుల నందరిని సాధుస్వభావులుగ మార్చినది. దీని ఉత్పత్తిని గాంచి ఆశ్చర్యపడి దీనికి మిరకిల్ స్కూల్ అని పేరిడిరి. అనగా ఆశ్చర్యమగు వింతపాఠశాల అని అర్థము. అది దాని అసలుపేరు కాదు. దాని ఉద్భవమును, అది చేయుచున్న పనినిగాంచి ఆశ్చర్యచకితులైన చూపరులే ఆ పేరిడిరి. ఇది కట్టుకథ కాదు. అమెరికన్ విద్యాసంచిక (Educational Review) అనుదానిలో 1922 సం॥ రమున వ్రాయబడినది. వార్ధావిద్యావిధానమునందువలెనే వృత్తివిద్య యాధారభూతముగ గైకొనబడి విద్యార్థుల చేతిపనుల మూలముగ వచ్చిన వస్తువులచే ఆసంస్థకు అధిక ప్రతిపత్తి కలిగించి యున్నారు.

కావున సంచార గ్రంథాలయముల ఆవశ్యకత ఇప్పుడు బాగుగా తెలియవచ్చుచున్నది. ప్రజలలో నూతనాంశము నేర్చుకొనవలయునను ఆశ కలిగించిన చాలును. వారిలో ప్రబోధము ఒకమారు కలిగించినచో ఇతరములు క్రమేణ రాగలవు. దీనివలన గ్రంథాలయోద్యమముయొక్క ప్రాధాన్యత ఎఱుకపడుటచే ఆర్థిక విషయముకూడ సుగమమగును; ప్రజలు రూపాయకు కొన్ని పైసలు పన్నును గూడ చెల్లించుటకు కూడ వెనుదీయరు. ప్రతిగ్రామములో ఈపద్ధతి ఏల వీలుగాదు? తొలుత నిర్బంధము చేయవలసివచ్చును. మనదేశమున ఏదియైనను ప్రచారములోనికి వచ్చుటకు కొంతటి నిర్బంధము అవసరము. కాన నిర్బంధ మేర్పరచిన ఈపద్ధతి ఆచరణలోనికి రాగలదు. ప్రజాభిప్రాయము క్రమేణ మారి వారికి మనోవికాసము రాగలుగుటతోనే నిర్బంధము తీసివేయవచ్చును. ఐచ్ఛికముగనే ఒక అంశము గ్రహింపగలశక్తి ఇష్టము ప్రజలలో రాగలుగునని వారిని సమ్మతు చేయువారము మనము గాము. ఒకొకదాని ఆవశ్యకతను గుర్తించిన పిమ్మట ప్రజలు తప్పక అందుకు సహాయము చేయగలరు. మొదటమొదట పరిస్థితులు క్లిష్టముగ నున్నను క్రమముగ అవి సులభసాధ్యములగును.

ఈవిధముగ గ్రంథాలయోద్యమము సాగవచ్చును. గ్రంథాలయముల పరమోద్దేశ్యము ప్రజామనోవికాసమును కలిగించి, నాగరికతను నగిషీచేయుట కావున వానిలోని గ్రంథములుగూడ ప్రజలకు విజ్ఞానదాయకములుగ ఉండవలసియున్నది. ప్రజల మనోగత తత్వము ననుసరించి ఆకర్షణీయవిధమున రచింపబడిన పుస్తకములు కావలయును. చెత్తపుస్తకములలో చేరవలసిన రైల్వేసారస్వతమునకు అందులో తావుండరాదు. "మగడుకాని - మగడు," "నేనెవరి భార్యను," ఇట్టి పుస్తకములను గ్రంథాలయమున నుంచరాదు. వీనివలన వృథా కాలయాపనమేగాని వేరులేదు. ఉత్తమములైన గ్రంథముల సేకరించి యుంచదగును. ఇవిగాక గ్రంథాలయముల ఆధ్వర్యముక్రింద అప్పుడప్పుడు గ్రామములలో సభలు, సమావేశములు, విజ్ఞానచర్చలు, కళాప్రదర్శనములు జరుపవలసియున్నవి. అట్టివి సంభవమగుట ఎప్పుడో? ఏమైనను ఎప్పటికైనను ఇవిసాధ్యమై మనదేశ మున్నతస్థితికివచ్చుటకు పట్టుదలవీడక పురుషప్రయత్నము మానక, కార్యసాధనము చేయగలందులకు తీవ్రసంకల్పము దయచేయుటకును పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

*  *  *  *

# గ్రంథాలయ మహోద్యమము

శ్రీ కొండపల్లి గోపాలరావు దేశముఖ్ గారు

శ్రీ హరి రామలింగ శాస్త్రిగారు

ధనము నొసంగుచో వ్యయముదప్పదు బంగరు నేల్వ నిచ్చుచో
చినుగుట తప్పవన్న మొకజీర్ణపుత్రేణుపుతోడ బోవు. కా
వున నొకవిద్యయే యొసగు చోటను శాశ్వతమౌట నట్టియీ
విని నొనగూర్చు పుస్తకనివేశ మహోద్యమ మెన్న నలవియే ?

మారుమూలల పల్లెటూరుల పఠనాల
యంబుల నిల్పు యత్నంబొకండు
ధర్మమూర్తుల తెల్గుతల్లుల కింటింట
విద్యల గఱపించు విధమొకండు
ఆంధ్రరక్షక జాతి సమారాధ్యము సేయ
ప్రత్యేక కృషిసల్ప బడుట యొండు
వలయు గ్రంథమ్ములవి లిఖింపజేసి భాం
డాగారముల నింప నగుట యొండు

మున్నుగాగల కార్యముల్ కొన్నిగలవు
స్వార్థ మావలకున్ ద్రోసి సాగిరండు
నడుముకట్టుడు పెద్దలనుపుల జనుడు
సరసులార! గ్రంథాలయ సభ్యులార!

# గ్రంథాలయోద్యమము - మహిళామణులు

శ్రీమతి జొన్నలగడ్డ సీతాకుమారిగారు.

సరస్వతీ మందిరాలలో అంతా పూజారులుగా నుండవచ్చును. గ్రంథాలయోద్యమ నిర్వహణంతో ఆంధ్రదేశం చాలా ముందుకు చొచ్చుకపోయిందంటేను, ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ రజతోత్సవము చేసుకొని ప్రౌఢత్వం వహించుచున్నదంటేను, ఆంధ్రదేశంలోని ఎన్నో గ్రంథాలయాలు స్వర్ణోత్సవం చేసుకోడానికి సిద్ధమై యున్నవంటేను, ఆంధ్రుల సారస్వతపిపాస, ఉద్యమనిర్వహణశక్తి వెల్లడౌతున్నాయి.

ఈ గ్రంథాలయోద్యమంలో స్త్రీలు చేస్తూవున్న కృషి ప్రశంసాపాత్రంగా లేదు. స్త్రీలల్లో విద్యాధికురాండ్రు తక్కువయినా, గ్రంథపఠనాశక్తి అధికంగా వుంటుందని చాలామంది పండితుల యభిప్రాయము. వారికున్నంత అవకాశంలోనే భాషాసరస్వతిని ఆరాధించడంలో వారికుండే ఔత్సుక్యంవల్లనే నేడు ఆంధ్రజాతిలో యీమాత్రమైనా చైతన్యం గనిపించుతూ వున్నది.

మన రాష్ట్రంలో స్త్రీలకొరకు స్త్రీలచేత నడుపబడుచున్న గ్రంథాలయాలు చాలా కొంచెమే యున్నాయి. బాలికాపాఠశాలలలోని అనుబంధ గ్రంథాలయములుగాక మహిళాసంఘములవారు నడుపునవి మాత్రమే వుంటాయి. నేను కలలుగనే భావియుగంలో ప్రతిగ్రామంలోనూ ఒక మహిళాసంఘం వుండాలి. దానికి అనుబంధంగా ఒక గ్రంథాలయం, ఒక వయోజనపాఠశాల, ఒక ఆరోగ్యశిక్షణాదళము, ఒక గ్రామసేవాసంఘమూ నడుపబడుతూ వుండవలెను. ఆ సువర్ణస్వప్నం శీఘ్రంగా ఫలించడానికి భగవంతుడు తోడ్పడుగాక! గ్రంథాలయము లన్నిటిలోను ముఖ్యముగా స్త్రీలకొరకు నడుపబడు గ్రంథాలయములలోనూ స్త్రీల వాఙ్మయము అనగా స్త్రీలకొరకు వ్రాసినవి, స్త్రీలను గురించి వ్రాసినవి, స్త్రీలు వ్రాసినవి మొదలైన గ్రంథాలన్నీ సేకరింపబడి యుండవలెను. కుమారీశతకంనుంచి

వేదాంతచర్చలవరకూ, గృహవైద్య, గృహనిర్వహణ శాస్త్రాలు, వివిధకళలను సంబంధించిన గ్రంథాలు, మొల్లరామాయణంవంటి స్త్రీలచే రచింపబడ్డ గ్రంథాలు, ఊర్మిళాదేవి నిద్రవంటి గేయవాఙ్మయానికి సంబంధించినవీ అన్నీగుడా సేకరించి తరువాత ప్రధానంగా బాలవాఙ్మయాన్నిగూడా సంగ్రహించి పెట్టుకొని తరువాత వివిధశాఖలకు జెందిన వాఙ్మయమును వృద్ధిపరచుకొనవలెను.

పిల్లలకు మొట్టమొదట గురువులైన తల్లులే బాలవాఙ్మయాన్ని ముందు తాము నేర్చుకొని వారికి చెప్పవలసియుంటుంది. కేవలము స్త్రీలది మాత్రమేగాక స్త్రీ సభ్యులను కలిగియున్న భాషానిలయములు గూడా పై గ్రంథముల నన్నిటిని గూడా చేర్చియుంచుట ముఖ్యము. మరియు సంగీతము, కుట్టుపని, చిత్రకళ, పాకకళ మొదలైన ప్రత్యేక సాంకేతిక గ్రంథములను జేర్చియుంచుటలో మన గ్రంథాలయములు తగినశ్రద్ధ తీసుకొనకపోవడము విచారకరము.

స్త్రీలందరు ప్రత్యేక గ్రంథాలయములద్వారా అభివృద్ధి నందవలసినదే, వేరుమార్గమేమియు లేదా యన్న ప్రజాగ్రంథాలయముల వారికిగూడా అందుబాటులో నుండునట్లు చేయుటయే మంచిమార్గమనవచ్చును.

గ్రామగ్రంథాలయములు ప్రతి ఒక్కరికి అందుబాటులో నున్నప్పుడే ప్రజాసంస్థలనబడి వాని నామము సార్థకమౌతుంది. గ్రంథాలయ నిర్వాహకులు గ్రంథపఠనంలోనూ, గ్రంథాలయ సేవలోనూ గూడా, స్త్రీలకు కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కలుగజేయుట ఉత్తమమైన పద్ధతి. ఈసందర్భంలో తాము చేస్తున్న ప్రత్యేకసౌకర్యాలు కేవలము స్త్రీలకుగాక జాతీయౌన్నత్యానికి ముఖ్యమైనవని మనము తెలుసుకొనడము అవసరము. "Mothers make the Nations" అనునట్లు జాతినిర్మాతలైన మాతలను విద్యాపూర్ణలుగానూ, స్వధర్మనిర్వహణ శీలలుగానూ సిద్ధము జేసినయెడల జాత్యభివృద్ధి దానియంతట నది జరుగగలదు.

ప్రపంచంలో స్త్రీలు నేర్చుకోవలసినవి జ్ఞానం అమితంగా మన్నది. నిజము విచారించితే ప్రపంచములోని ప్రతివిషయముగూడా స్త్రీ నేర్చుకొనియుండవలెను. ఏమన భావిపౌరులై జాత్యభ్యుదయానికి కారకులైన బాలబాలికలు తమ జీవితంలోని అత్యధికకాలం తల్లుల వద్దనే గడుపుతారు. వారి ఆచిన్నమెదళ్లలో ఎన్నో జిజ్ఞాసలు, విచారణలు, సందేహాలు నిరంతరం ఎడతెగకుండా వుద్భవించుతూనే వుంటాయి. ఈసృష్టిలోని వింతలను గురించి, ఖగోళంలోని 'మహామాయను' గురించి, పురాణాల్లోని అద్భుతసంఘటనలనుగురించి, జంతుజాలములలోని వింతలను గురించి, అనేకరకములైన ప్రశ్నలతో తల్లులను క్షోభింపజేస్తారు. ఇంతేగాక నేడు మనదేశములో పరభాషల, పరమతముల, పరసంస్కృతుల వొత్తిడి దినదినమూ అధికమై పోతూన్న స్థితిలో తల్లులు తమపిల్లలకు - చిన్నతనములో తమ మతప్రాశస్త్యమును భాషాఔన్నత్యమును, మన సంస్కృతి ప్రాచీనత మొదలైనవన్నీ నేర్పి మన నాగరికతయొక్క మూలసిద్ధాంతముల నన్నిటిని క్షుణ్ణంగా నేర్పి బాహ్యప్రపంచములో వొదిలిపెట్టడము శ్రేయస్కరము. అప్పుడా బాలబాలికలు తమ జాతికిని, పరజాతులకును గల భేదములను సూక్ష్మముగా గ్రహించగలుగుతారు. లేకపోతే నేటిపరభాషలను ఒకటిరెండు ముక్కలు నేర్చుకొనివచ్చిన బాలబాలికలంతా స్వభాషామతసాంప్రదాయములను నిందించడం నిత్యకృత్యం ఐపోయింది. ఇలాటి స్థితిలో ప్రపంచజ్ఞానంలేని తల్లి తనపిల్లలముందే చౌకఅయిపోతుంది. “కాకవ్వ కట్టెలిల్లు కట్టింది, పిచ్చికమ్మ పిడకలిల్లు కట్టింది” ఈమొస్తరు కథలతో తనసంస్కృతిని ఎన్నాళ్లు బోధించగలుగుతుంది. ఇక్కడ సోదరి శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారి పద్యం ఒక్కటి చూపిస్తున్నాను.

“గర్భమందును బాలిచ్చు గాలమందు
బుజ్జగింపుచు నుగ్గును బోయునపుడు,
ప్రేమ లాలించి యాడించు వేళ మాత
తెలుపగల నీ తత్వమ్ము దెలుపగలరె,
యెట్టివారైన గల్పంబు లెన్నియైన.”

కనుక స్త్రీలుగూడా విధిగా సారస్వతోపాసకురాండ్రై తీరవలెను. తమ తీరికసమయమంతా గ్రంథపఠనంతో గడిపి తమకోసం గాకపోయినా, తమ జాతి యభివృద్ధికి, దేశాభివృద్ధికి విజ్ఞానం నేర్చుకోవలెను.

మన దేశంలోని గ్రంథాలయాలు స్త్రీల కెంతవరకు ప్రత్యేక సౌకర్యములు కలిగించుచున్నవో విచారించిన యెడల సంతృప్తికరమైన ప్రత్యుత్తరము దొరకదు. కొన్ని గ్రంథాలయములలో స్త్రీలకు సగము చందాపద్ధతి యున్నది. కొన్ని గ్రంథాలయములలో స్త్రీలకు గృహములకే గ్రంథములను తమ భృత్యులచేత బంపు నాచారమున్నది. అర్థికస్వాతంత్ర్యములేని స్త్రీలకు పైకనీసపు. సౌకర్యములనైనా అన్ని గ్రంథాలయములందును ఏర్పరచుట ధర్మము.

చాలా గ్రంథాలయములలో సభ్యురాండ్రుగా నున్నవారికి గ్రంథాలయమునందు అభిమానము గల్గునట్లు చేయబడుటలేదు. కార్యనిర్వాహక సభలయందు గాని, కార్యక్రమ నిర్వహణమునందుగాని, వారికిగూడా కొన్ని స్థానములనిచ్చి ప్రోత్సాహమిచ్చుట మంచిది. మన రాష్ట్రమునందు అనేకప్రజాసంస్థలలో అత్యధిక సంఖ్యాకురాండ్రైన స్త్రీలున్నప్పటికిగూడా వారికి కొంతవరకు ఏ గ్రంథాలయముగాని, మరే ప్రజాసంస్థలుగాని ఇంతవరకు ఒక అధ్యక్ష కార్యదర్శులవంటి బాధ్యతాయుతమైన పదవుల నిచ్చినట్లు వినియుండలేదు. దానికి స్త్రీలలో సామర్థ్యము లేకపోవటము కారణము కాదనుకుంటాను నాడూ నేడూ కూడా ఆంధ్రదేశచరిత్రలో "ఉయ్యాలనూదిన హస్తముతోనే సర్వసమస్తము నేలగలవారును," "గరిట బట్టినచేతనే కలము బట్టి, కత్తులంగూడ బట్టగా గల మటంచు" చాటినవారును అత్యధిక సంఖ్యాకులుగా నున్నప్పుడు వారిసామర్థ్యాన్ని శంకింపవలసిన సందర్భమే లేదు. కనుక గ్రంథాలయములు వానినిర్వాహకులు తమ ఆదర్శములను విశాలబరచుకొని సహజధీశక్తిసంపన్నలైన స్త్రీల విజ్ఞానాన్నిగూడా గ్రంథాలయాభివృద్ధికి, దేశాభివృద్ధికి వినియోగించుకొనుట మంచిది. కనీసము నారి సభ్యత్వములకు దగినన్ని స్థానముల

నైనను వారికిచ్చినయెడల అధికముగా స్త్రీ సభ్యోద్ధారము చేయుట కొక వీలుగల్పించిన వారగుదురు.

ఇది స్వాతంత్ర్యయుగము. ప్రతిజాతిలోను నేడు చైతన్యం గలిగింది. యుగయుగాలనుండి వెనుకబడిపోయిన స్త్రీలు నేడు తమకు వారసత్వంలోనూ, పౌరసత్వంలోనూ, వైవాహికంలోనూ, ప్రజాసేవ లోను గూడా సమానసత్వాలు కావలెనని కోరుకుంటున్నారు. సర్వ సమత్వ సౌభ్రాతృత్వం కావాలని వాంఛించే ప్రజాసంఘాలల్లో ముందు సర్వసమత్వం ప్రదర్శింపబడడం వాంఛనీయం గాదా?

* * * *

# వయోజన విద్యాశాఖా సమావేశము

## అధ్యక్షోపన్యాసము

### అధ్యక్షులు: శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఎం. ఏ.

ఆం. దే. గ్ర. సంఘాధ్యక్షులు.

సోదరులారా!

ప్రాథమిక **మధ్యమ** ఉత్తమ విద్యాలయాలలోను, కళాశాలలోను వైద్యము, ఇంజనీరింగు ఇత్యాది ప్రత్యేక విద్యాలయాలలోను సంసారంలోకి ప్రవేశించడానికి పూర్వం పురుషులు స్త్రీలు నేర్చుకొనే విద్యను మాణవిక విద్య యని వర్ణించవచ్చును. అటుగాక జీవితంలోకి ప్రవేశించిన తరువాత చదువను వ్రాయను నేర్చుకోడానికైతే నేమి, అంతకుముందు నేర్చుకున్నది మరచిపోకుండా ఉండడానికైతే నేమి, తీరిక కాలంలో క్రొత్తవిషయాలు నేర్చుకోడానికైతే నేమి ప్రత్యేకము తాను అవలంబించు వృత్తివ్యాపారాదులకై అధికకృషిచేసి నవీనశక్తిని సంపాదించుటకైతే నేమి, ఉబుసుపోకకు సంతోషంగా కథలు నాటకాలు చదువుకోడానికైతే నేమి మానవుడు కూర్చుకొనే ఏర్పాటులన్నీ వయోజనవిద్య యని వ్యవహరింపవచ్చును.

పుస్తకాలు పత్రికలు మొదలైన జ్ఞానసాధనోపకరణాలు చిన్న పెద్ద బళ్లలో చదివే మాణవకులకు అవసరం. ఇతరవిధాల కృషిచేసుకొనే వయోజనులకు అవసరం కావడంచేత గ్రంథాలయం వారు వీరనే భేదంలేకుండా మాణవకులకు, వయోజనులకు అందరికీ సన్నిహితమయిన సంస్థగా ఏర్పడింది.

ప్రపంచంలోని ఇతర నాగరికరాష్ట్రాలలో పైనచెప్పిన వివరణతో చాలమట్టుకు ఆచరణలో నుంచి అచటి గ్రంథాలయోద్యమము వయోజనవిద్యోద్యమునకొక యంగంగా ఉన్నా ఇవి రెండూ భిన్నమయిన ఉద్యమాలుగానే వ్యవహారం పొందుతూ ఉన్నవి. పడమటి దేశాలలో వయోజనవిద్యకు వినియోగించే సాధనాలను కొన్నిటిని పేర్కొంటె ఈవిభేదం బోధపడుతుంది. అధ్యాపకగోష్ఠులు, పోస్టలుబోధ, ఎక్స్టెంషన్ ఉపన్యాసాలు, సాయంకాలపు తరగతులు, వారమునకొకతూరి తరగతులు, ప్రజల హైస్కూలువసతిగృహాలు, ప్రజలహైస్కూళ్లు, వస్తుప్రదర్శనాగారాలనుండి ఎరవులు, ప్రచారకగ్రంథాలయాలు, కార్లమీదగ్రంథాలయాలు, పాఠకులకు సలహాచేసే సంస్థలు, రేడియో వినుకలిగోష్ఠులు ఇత్యాదులెన్నెన్నో కలవు.

కాని పడమటి దేశాలలోనూ గ్రంథాలయోద్యమం నాటికినాడు దినదినాభివృద్ధిపొందే ఉద్యమమయింది. బీరువాలలో పుస్తకాలు భద్రపరచి అడిగిన చందాదారులకు అందిచ్చే ఉద్యోగంగానుండిన గ్రంథాలయోద్యోగం నేడు సంఘంలో

పుట్టిన ప్రతివ్యక్తికీ, స్త్రీకి, పురుషునికి జీవితంలో ప్రతినిమిషమూ కావలసిన విజ్ఞానాన్ని లలితంగా, సరళంగా అందిచ్చే ఉత్తమోద్యోగంగా మారిపోతూ ఉంది. రెఫరెన్సు సర్వీసనే భోగట్టాశాఖ వృద్ధి పొందను పొందను గ్రంథాలయోద్యమానికి సరిపోయేటి వయోజనవిద్యోపకరణం యింకొకటి యుండనే యుండదు. నేడు ప్రధానాంగాలనిపించుకొన్నవి రేపు గ్రంథాలయోద్యమానికి ఉపాంగాలుగా పరిణమించుననటానికి సందేహములేదు. అదీగాక వయోజనులకు కావలసిన సర్వవిజ్ఞానానికి నేటిపరిస్థితులలో గ్రంథములు, పత్రికలు ప్రధానసాధనాలయి అమెరికా ఇంగ్లండు వగైరా అగ్రశ్రేణి రాష్ట్రాలన్నీ కూడ గ్రంథాలయసేవ యందలి స్త్రీగాని, పురుషుడుగాని యుండరాదనే దీక్షతో సర్వప్రయత్నాలు జరుపుతూ ఉండడంచేత తక్కిన వయోజనవిద్యోపకరణాలను గ్రంథాలయోద్యమానికి జోడించడం ఆర్థిక దృష్టితో జూచినా పరిపాలనవ్యవహారదృష్టితో జూచినా యెక్కువ ఫలప్రదమనడం స్పష్టం. ఆరీతి పరిణామం జరుగుటం దానికి కావలసిన సూచనలెన్నో యున్నవి.

ఇక మనదేశములో ముఖ్యంగా మన ఆంధ్రరాష్ట్రంలో మనం వయోజన విద్యాప్రచారం నేటియుగంలో ఆరంభించేయడం గ్రంథాలయోద్యమముతోనే చేసినాం. ప్రాచీనకాలములో మహోత్తమ జ్ఞానవిజ్ఞానాలకు పేరుగన్న యీమన భూమిలో వయోజనవిద్యకు సాధనాలుండలేదనుకొనకూడదు. హరికథలు, జంగం కథలు, కాలక్షేపములు, సంగీతసభలు, దేవాలయముల యాత్రలు, వీధినాటకాలు, నాటకాలు, పురాణాలు, ఇటువంటి సాధనాలెన్నో యుండినవి. కాని యివి యన్నీ ఎక్కువగా శ్రవణేంద్రియముమీద ఆధారపడి పుస్తకాలు పత్రికలతోగాని, వస్తూత్పత్తి వ్యాపారములతోగాని, ఎక్కువ సంబంధములేనివి. యంత్రయుగము విజృంభించి వస్తు విజ్ఞానశాస్త్రాలు అనంతముఖములుగా పెరిగి గ్రంథప్రతులు లక్షలుగా బయల్వెడలే యుగమున వీటికిగల ప్రయోజనము చాలపరిమితమయినది. ఆకారణంచేత ప్రాతనాటి పరికరాల నెంతవర కుపయోగించవలెనో అంతవరకూ ఉపయోగించుకొంటూ మనం ఈశతాబ్దంలో మొదటిదశకము దాటినతరువాత వయోజనవిద్యోపకరణంగా గ్రంథాలయాన్నే ప్రధానంగా వినియోగించుకొనాలి. మనమెంతో విస్తారప్రయత్నం చేయవలెనని సంకల్పించినా అది మనమనుకొన్నంత విస్తారతరం కాలేకపోయినది. కారణం ఎక్కువదూరం వెతుకనక్కరలేదు. గ్రంథాలయమును సార్వజనికవిద్యకు మూలాధారం చేయదలచిన మనతలంపునకు బునాదియైన పరిస్థితి మనదేశంలో లేకపోయింది. పుస్తకాలు పత్రికలు అక్షరంమీద ఆధారపడినవి. చదువను వ్రాయను నేర్వనివానికి ఇవి యుపయోగపడజాలవు. అక్కడికీ మనముండే యుత్సాహమూలకంగా పత్రికలు చదివి వినిపించడం, పుస్తకాలలో వుండే విషయాలను ఉపన్యాసాలమూలకంగా శ్రోతల కందివ్వడం వగైరా పనులు చేసుకుంటూ రావడంచేత ఆంధ్రదేశములో మనం గ్రంథాలయాన్ని ఒకరీతిగా సార్వజనికసంస్థగా గ్రామసీమలలోని సంసగానుడుపుగాని రాగలిగినాము. ఎంత మనమిట్టి ప్రయత్నాలుచేసినా నూటికి పదిమందికిపైబడి చదువనూ వ్రాయనూ తెలి

యని మన దేశంలో గ్రంథాలయోద్యమ ఫలాన్ని ప్రజాబాహుళ్యానికి అందజేయగలగడం అసాధ్యం. కాబట్టి ఒక మెట్టు చేరేటప్పటికి దేశంలో వ్రాయను చదువనూ అందరు ప్రజలు తెలిసికొననందున కలిగిన ప్రాధాన్యమయిన వెలితి బయటపడింది. అప్పటప్పటి కొద్దికొద్దిగా ప్రజాహిత కర్తలు రాత్రిపాఠశాలల ద్వారానూ, మరి ఇతర రీతులను సంసారంలో దిగిపోయిన వయోజనులకు అక్షరాస్యత కలుగజేసే ప్రయత్నాలు ఉన్నా అవి ఎక్కడా చాలకపోవడం మనకు వ్యక్తమయింది. ౧౯౩౭ వ సంవత్సరపు ఇండియా ప్రభుత్వశాసన మేర్పడినప్పుడు మన కోస్తాలో అక్షరాస్యులకు వోటుహక్కు సిద్ధించడంతో ప్రజలందరికి వ్రాత చదువు నేర్పించడం అత్యావసరమనే హృదయవేదన హెచ్చిపోయింది. ప్రత్యేకం వయోజనవిద్యాసంస్థ లొకటొన్ని ఏర్పడడము సంభవించింది. కాని మొట్టమొదటి వయోజనవిద్యకు ఇతరత్రా ఆంధ్రదేశములో కేంద్రంగా ఉంటూవచ్చిన గ్రంథాలయం ఈసమస్యను తనకర్తవ్యంగా గ్రహిస్తేనే దీనికొక క్రమస్వరూపం ఏర్పడుతుందని తోచి ౧౯౩౮ సంవత్సరం లగాయితు గ్రంథాలయోద్యమానికి అక్షరాస్యతా ప్రచారంకూడా జోడించి విడరాని సంబంధం వీటిరెంటికి కలదనడం స్పష్టపరచుట సంభవించింది. గ్రంథాలయములీవిషయంలో తగినంత శ్రద్ధ చేసినవని సాహసించి చెప్పుటకు వీలులేదు. గ్రంథాలయ శిక్షణతరగతులు పెట్టినప్పుడు అందులో అక్షరాస్యతను సాధించడానికి కావలసిన శిక్షణనంతయు నేర్పుచున్నాము. గ్రంథాలయ మహాసభలలో నేను జరుపుచుండే ప్రత్యేక శాఖాసమావేశం వంటి సమావేశము నేర్పరచి అక్షరాస్యతా ప్రచారము విరివిగా చేయుచున్నాము. గ్రంథాలయ ప్రదర్శనాలలో అక్షరాస్యతకు సంబంధించిన వస్తుసామగ్రిని విధములను ప్రదర్శించుచున్నాము. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమే ఆంధ్రదేశ వయోజన విద్యామహాసభ సమావేశమును తెనాలిలో జరిపినది. అయినను దక్షిణఇండియా వయోజన విద్యా మహాసమావేశమును తెలుగు భూమికి ఆహ్వానించి యున్నది. వయోజన విద్య మొదటి పుస్తకమును ప్రకటించినది. జిల్లాబోర్డుల వారికందరికిని ప్రత్యేక మీవిషయములో పనిచేయవలసినదని కోరుచు విజ్ఞప్తులు పంపినది. తెలుగుదేశములో యువకులెంతో ఉత్సాహంతో పనిచేసినారు. ఇప్పటికిని అనేకచోట్ల చేయుచున్నారు. కాని కాంగ్రెసువారు రాజ్యమేలినప్పుడు ఈకోస్తాలో మాకీవిషయమున తగిన దోహదం కలుగలేదు. తరువాత అడ్వయిజరుల ప్రభుత్వములో ౧౯౪౨ వ సంవత్సరంలో జి. ఓ. యొకటి బయలుదేరి అడ్డంకులుకూడా కలుగజేసింది. అక్షరాస్యులంటేతప్ప యుద్ధానికవసరమైన వడ్రంగం, కమ్మరం, కుట్టుపని వగైరాలుకూడా బాగా జరుగవని గవర్నమెంటువారికి గోచరించడంచేత గానివ్వండి, మరి యేయితర కారణాలచేత గానివ్వండి నేడు ఆ జి.ఓ. రద్దుకాకపోయినా అమలులేనట్టే కార్యములు జరుగుట కవకాశా లేర్పడినవి. అవి ఎట్లున్నా ఇతరు లేమిచేసినా యేమి చేయకపోయినా గ్రంథాలయాలవారు తమ గ్రంథాలకు, పత్రికలకు నిజమైన యుపయోగం కలుగవలెనని తలంచే యెడల తాము విధ్యుక్తధర్మంగా నిరక్షరాస్యతను నిర్మూలించే ప్రయత్నాలన్నిటిని చేయక

తప్పదనడం ముమ్మాటికీ నిజం. యీవిషయమయి గ్రంథాలయాలు శ్రద్ధవహించవలసినదని కోరుచున్నాను. గ్రంథాలయ నిర్వాహకులందరును దీనివిషయమయి తీక్షణముగా నాలోచింతురుగాక యని ప్రార్థించుచున్నాను.

వయోజనులకు చదువను వ్రాయను నేర్పించడం అతిసులభం, అతికష్టం, రెండూ కూడాను. నూటికి తొంబదుగురు చదువురానివారుండేటప్పుడు వీరిని వెతుక్కుంటూ పోనే అక్కరలేదు. మనం ఏవైపుకు తిరిగితే ఆవైపునే వుంటారు వీరు. అనేకుల ఇండ్లలో తమ స్వజనానికే అన్నదమ్ములకు, అక్కచెల్లెండ్రకు, ఇతరబంధువులకు చదువను వ్రాయను రాదు. కొంతచదువుకు అలవాటుపడిన కుటుంబాలలో ఇంటియిల్లాలెగారుకు చదువురాదు. ఇంటివానికి చదువురాదు. ఇరుగుపొరుగువారికిని అంతే. కాబట్టి ప్రయత్నపడే వారొక్కొక్కరికి అతిసులభంగా విద్యార్థులు దొరికిపోతారు. ఒక్కొక్క చదుకొన్నవాడు మరియొక్కరికైనా చదువను వ్రాయను నేర్పించే దీక్షబట్టితే నేడు చదువుకొన్నవారు నూటికి 10 మందో 12 మందో ఉంటే ఇంక మూడుమాసాలకు 20 యో 24 గో అవుతారు. నేడు చదుకొన్నవారు ఒక్క ఏడాది కృషిచేయగలుగుతారా దేశంలో సగభాగానికి అక్షరాస్యత అందుబాటులో పెట్టవచ్చును. కాని మాటలలో ఇది ఎంతసులువుగా కనిపిస్తుందో కార్యంలో ఇది అంతటికష్టంతో కూడుకొన్నదని నాకు తెలుసును. మన దేశములో గట్టిసంకల్పముతో పనిచేసేవారు అందులో ముఖ్యంగా చదుకొన్నవారిలో చాలాతక్కువ. ఇదే నిజంగా మంచికష్టాల కన్నిటికి కారణం. నేటి సమావేశంలోచేరి మనంపట్టుకు మనం దృఢసంకల్పులమైతే మనదేశాన్ని అనతికాలంలో దృఢసంకల్పం కలదాన్ని కావింపవచ్చును. ఇక రెండవ సంగతి మనకు దృఢసంకల్పంకలిగి ఎన్నిదెబ్బలుతిన్నా పట్టువదలక నిలిచినప్పుడు మనల నెదుర్కొనే సమస్యలు కొన్నిఉంటాయి. అందులో సంసారంలో పడిపోయిన మన సోదరసోదరీమణులకు నిరుత్సాహం మెండు. ఆ నిరుత్సాహాన్ని చెదరగొట్టడం మనకు ప్రథమకర్తవ్యం అవుతుంది. వారి విశ్వాసం చూరగొంటేగాని యీపని మనం చేయలేము. అందుచేత మన మెవరికి చదువనూ, వ్రాయను, నేర్పదలచివామో, వారిని మర్యాదగా దగ్గరజేర్చుకొని వారి కష్టసుఖాలు తెలుసుకొని, వారి మేలుకోళ్లరవి వారితో మనమేకమైపోతే తప్ప వారి నాకర్షింపలేము. పిల్లలకు చదువు నేర్పిన రీతిగా పెద్దలకు నేర్పుదామని బయలుదేరితిమా మనప్రయత్నము ఏమాత్రము కొనసాగదు. అంటే పెద్దల మనస్తత్వము కనిపెట్టడం అవసరం. పిల్లల మనస్తత్వంవేరు వీరి మనస్తత్వంవేరు. ఈశాస్త్రం పూర్తిగా విప్పడ మిక్కడ సాధ్యంకాదు. సూచించి వదలిపెట్టడంతో తృప్తిపడవలసియున్నది. ఇక పెద్దలకు చదువనూ, వ్రాయనూ, నేర్పించేవారు వారికేమి నేర్పించవలె? ఎట్లు నేర్పించవలె? ఎప్పుడు నేర్పించవలె అనేవిషయాలు గూడా తెలుసుకొనుట మేలు. వారివారి జీవితానుభవాలకు వారివారి అభిప్రాయరుచులకు, తగినమాటలు, వాక్యాలు, వ్యవహారాలు, పాఠాలు, నిర్ణయించుకొనవడమే ఉత్తమోత్తమం. చేపలుపట్టి జీవించే బెస్తనికి చదువునేర్పబోయి

వల పడవ వగైరా సామగ్రిని సూచించే పదాలతో ఆరంభించకుండా పశువు పాలతో ఆరంభించితే ప్రయోజనముండదు. మొదట చదువను, తరువాత వ్రాతను నేర్పించడం అవశ్యకం. పిల్లలకు దిద్దిబెట్టినట్లుగా పెద్దలకు దిద్దబెట్ట వీలులేదు. అలసి దస్సినవేయి నానా సంసారపు చిక్కులతో బాధపడే వీరికి చదువూ-వ్రాతలూ-ఆటపాటలుగా నుండవలసినదే గాని పాఠాలుగా నుండరాదు. అందుకనే అ ఆ ఇ ఈ వగైరా వరుసక్రమంతో ఆరంభించరాదనడం కూడ స్పష్టమే. తెలుగులో గుణింతాక్షరాలున్నవని తామలా భ్రమపడి నేర్చుకొనే వారిని చెదరగొట్టరాదు. పది పదిహేనక్షరాలు కొన్ని సులభమయిన గుణింతాలతో తెలుగులోని కొన్ని పద్యాలు చదివించడం సాధ్యం. అందులోనూ తెలుగక్షరాలు గుండ్రాలు. సున్న పెద్దదీ, సన్నదీ చుట్టడానికవస్తే దానిని నిలువుగా అడ్డంగా సగం చేయడానికవస్తే వీటిని నానా రూపాలుగా చేర్చడానికవస్తే తెలుగు అక్షరాలు, గుణింతాలు, అంకెలు అన్నీ నేర్పవచ్చు. సున్న నేను అనేకచోట్ల చెప్పినట్లు తెలుగుకు వరప్రసాదము. నేను చెప్పిన యీ వివరణమంతయు వయోజనవిద్యాబోధకుని శిక్షణమునకు చెందినది. ఇంకా ఆవిషయమయి చెప్పదలంచుకొనినచో చెప్పవలసిన యంశములు చాలగలవు. కాని అవి యన్నియు ఇప్పటి నాకర్తవ్యానికి అప్రస్తుతములు. వయోజనవిద్యాబోధకునికి శిక్షణ కావలెను. సర్వేసర్వత్ర వయోజనవిద్యాబోధకులు కావలసియున్నారు. కాబట్టి అట్టి బోధకతరగతులు సర్వేసర్వత్ర యేర్పడవలసియున్నవని చెప్పడమునకే ఇంత పరిశ్రమ. మద్రాసు విశ్వవిద్యాలయ వారికమిటీ ఏర్పడి పనిచేయుచున్నది. అన్నామలై విశ్వవిద్యాలయములో అక్షరాస్యతకిప్ప తక్కువనేమో చేయుచున్నారు. మైసూరు విశ్వవిద్యాలయమున కొంత పని చేయుచున్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయమూ వారి గొడవ యింకను ఎత్తుకొనలేదు. వీరందరిని జిల్లాబోర్డులను, మునిసిపాలిటీలను, ఉపాధ్యాయ సంఘాలను, గ్రంథాలయ సంఘాలవంటి విద్యావిషయక సంస్థలను నేను కోరేది మొదటికోరిక యేమంటే పదిహేనేసి దినాలు తరగతులు పెట్టి వచ్చేవారందరికి వయోజనవిద్యాబోధక సూత్రాలు ఎంతవివరిగా వీలైతే అంతవివరిగా విప్పించవలసినదనే. అప్పుడు వయోజనవిద్య నేర్పుటకుగల ఉత్సాహంతో కూడ కౌశలమేర్పడుతుంది. ఈకౌశలమే కార్యసాధకమవుతుంది. అప్పుడు ఎవ్వరు వయోజనవిద్య ఆరంభించినా మునిసిపాలిటీగాని, జిల్లాబోర్డులుగాని ఎవ్వరు ఆరంభించినా ఫలప్రదంగా పనికావడానికి అవకాశముంటుంది. ప్రథమోత్సాహంకొద్ది ఆరంభించిన కొన్ని ప్రయత్నాలు గట్టెక్కలేదని వ్రేలుచూపి పరిహసించేవారున్నారు. అట్టివారెప్పుడూ వుంటారు. వారివైపు చూడక మనరథాన్ని సాగించడమే మనకర్తవ్యము.

చదువను వ్రాయను మాత్రమువస్తే చాలునా అనువారనేకులున్నారు. చాలునని మనమనుటలేదు. గ్రంథాలయసంఘము పరముగా మన మీప్రచారము చేయుచుండుటచేతనే యీవిషయము స్పష్టము. వయోజనము చదువను వ్రాయను నేర్చినా మా గ్రంథాలయ పఠనాలయ శక్తులచే వారినెల్లప్పుడును ఆకర్షించి విజ్ఞానవికాసము

తెల్లపుడును వారికి అందుబాటులో నుంచగలమని మావిశ్వాసము. అందుకు నేటి నుండే చేయదగిన ప్రయత్నములు గలవు. చదువను, వ్రాయను ప్రజానీకానికి నేర్పడమెంత మనబాధ్యతో వారు ఆమాత్రము నేర్చినతరువాత వారికి శాస్త్రసాంకేతికవిజ్ఞానము వారికందుబాటుకు భాషలో అమర్చియివ్వడం మనకంతకంటే యెక్కువబాధ్యత. అట్టి గ్రంథసామగ్రి యిప్పుడింకా ఉత్పత్తికావడంలేదంటే తప్పుగాదు. అయినా చాలకొద్దియని చెప్పడానికి సందేహము లేదు. ఉన్నకొద్ది సామగ్రిని జతపరచి ప్రచారంలోకి తేవడం మనకు మొదటిపని. మా గ్రంథాలయసంఘమువారు ప్రకటించే పుస్తకాల జాబితాలలో యీవిషయం గమనిస్తూనే ఉన్నాము కాని మాకు తగినంత భోగట్టా దొరకడంలేదు. తగినవివరాలు తెలిసినవారందరు మా కార్యాలయానికి వ్రాస్తే సంతోషిస్తాము. క్రొత్తసామగ్రి ఉత్పత్తిచేసే పరిశ్రమకూడా జరుగవలెను. మైసూరు విశ్వవిద్యాలయంవారు అనునిత్యవిషయాలమీద తగినవారిచేత గ్రామాలలో ఉపన్యాసాలిప్పించి చిన్నచిన్న పుస్తకాలు ఏబదికి పైబడి ప్రకటించియున్నారు. ఇది కన్నడములో జరిగినపని. ఇట్టిపని మన ఆంధ్రములో జరుపుట ఆవశ్యకం. దీనికి తగిన దోహదం కలుగుతుందని ఎదురుచూస్తున్నాము. ఉదారులు రాజా వెంకట్రామరెడ్డిగారు విజ్ఞానసర్వస్వసాధనానికి అవకాశమేర్పడితే తాము రూ 1000-లు ఇత్తుమని విన్నప్పడం మాకెంతో ఎక్కువ దోహదం రాకపోదని తోచింది. ఒకవైపు ఈనిర్మాణమంతా చేస్తూ మరియొకవైపుగ ఈనిర్మాణాన్ని వినియోగించికొనే అక్షరాస్యులను తయారుచేయడానికి ఉపాయాలాలోచించుటే మన యీసమావేశంవంటి సమావేశాల ప్రయోజనం.

తగు ఎడల ఇంకను ఎన్నోవ్యాసములు రాగలవు. తాము అనేకవిషయములు చర్చించగలరు. నేను కొంతసూచనగా విషయమును నివేదించినాను. దీనితో జేర్చి ఆమూలాగ్రముగా సంగతులు విమర్శించి మహాసభకు తీర్మానములు సలహా చేయుదురు గాక.

*    *    *    *

# విజ్ఞానప్రచారము : మైకోఫోను

శ్రీ వై. వి. కృష్ణరావుగారు

మనదేశంలో షుమారు నూటికి 90 మంది నిరక్షరాస్యులు. ఇట్టితరి రాచకీయంగానూ వైజ్ఞానికంగా నెంతవెనుకబడి వున్నామో అర్థమవుతుంది. ఇట్టి స్థితిలో చదువుకొన్న మనం ఏమిచెయ్యాలి? నిరక్షరాస్యులకు అక్షరాస్యతద్వారాను, ప్రచారపద్ధతుల ద్వారానూ సోదరప్రజలను అక్షరాస్యులుగను, విజ్ఞానవంతులుగాను చేయుటకు మనం నిరంతరకృషి చెయ్యాలి. ఇందు ముఖ్యంగా ప్రచారపద్ధతులు అత్యంతావశ్యక మైనవి. ఇట్లని అక్షరాస్యత పనికిరాదనికాదు. అక్షరాస్యత, ప్రచారపద్ధతులమధ్య పోటీయూ కాదు. ప్రచారపద్ధతులు విషయజ్ఞానాన్ని తక్కువకాలంలో తేలికగా వృద్ధ, బాల, స్త్రీ, అక్షరాస్యులు, నిరక్షరాస్యులు అనే భేదంలేక వెదజల్లడాని కుపకరిస్తాయి.

ఇతరదేశాలలో ఉపన్యాసములు, సినీమాలు, మాజిక్కులాంతరు, రేడియోలు, టెలివిషన్‌లు (రేడియోద్వారా విన్నట్లుగానే వీటిద్వారా కంటితో చూడవచ్చును) మొదలైన వాటిద్వారా ప్రచారం చేస్తారు. ఇట్టి ప్రచారమువలన కలిగిన జ్ఞానము నభివృద్ధి చేసికొనుటకు సామగ్రి సంచారగ్రంథాలయా లందజేస్తున్నాయి. ఇట్టి ఉన్నతపథాలలో వారి ప్రచారం నడవడానికి కారణం స్వతంత్రులగుటవల్లనే. ఇందువలన ఆయాప్రభుత్వములు బాధ్యతవహించి ఉద్యమప్రచారకులకు విశేషసహాయము చేస్తున్నాయి.

మనకు తద్వ్యతిరేకము. స్వాతంత్ర్యములేక పోషణచే మన ప్రభుత్వము సహాయసంపత్తులు చేయకపోగా, పానకంలో పుడకలా అడ్డురావటంకూడా ఎల్లరెరిగినదే. అయితే ఈచిక్కులను మననిర్మాణ సమీకరణాబలంవల్ల కొద్దికొద్దిగా సవరించగలము. ఇట్లని నిరాశా నిస్పృహలకు తావీయక మనశక్తినిబట్టి, సోదరప్రజల స్థాయినిబట్టి మనం ప్రచారపద్ధతుల నవలంబించాలి. ఇట్టిపద్ధతులలో మైగఫోను ద్వారా వార్తలు చెప్పువిధానం ముఖ్యమయింది.

## మెగఫోనుతో వార్తలుచెప్పుట

తయారీ చెప్పేవారు రాజకీయ భూగోళం (ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ) మనఇండియా (మినూనుసానీగారిది) క్షుణ్ణంగా చదవాలి. అట్లాసును క్షుణ్ణంగా గుర్తించగలగాలి. తప్పనిసరిగా నోట్ చెయ్యాలి. చిత్తుకాగితము లమీద వ్రాసి పారవెయ్యక ఒకనోట్ బుక్కులో వ్రాయాలి.

ప్రదేశము:— డాబాలు, చెట్లు, గోడలు, ఎత్తైనదిబ్బలు అనుకూలంగా ఉంటాయి.

పద్ధతి:— ముందు ఒకజాతీయగీతం పాడాలి. వార్తలను సంక్షిప్తంగాను, స్ఫుటంగాను, నెమ్మదిగాను, తడుముకోకుండా చెప్పాలి. దూరప్రాచ్యం, మధ్యప్రాచ్యం మొదలగు పడికట్టుపదాలను అలవాటయ్యేవరకు కొంతకాలం విడదీసి చెప్పాలి. పట్టణాలు ప్రదేశాలు వ్యక్తులపేర్లను ఎక్కువ చెప్పి గందరగోళంచేసేకంటే చాలవరకు తగ్గించి చెప్పాలి. పేర్లు చెప్పేనపుడు ముఖ్యమైనవాటిని గూర్చి తెల్పాలి. ఉదా:- కీవ్-ఇది రష్యాలోని యుక్రెయిన్ రాష్ట్రానికి ముఖ్యపట్టణము.

తర్వాత మనదేశవార్తలనుగూర్చి చెప్పాలి. వార్తలలోని ముఖ్యవ్యక్తుల విశేషాలను క్లుప్తంగా చెప్పాలి. వెండి, బంగారు, ధాన్యాదుల ధరలను చెప్పాలి. మొత్తంవార్తలను వారానికోసారి సమీక్షచేస్తే మంచిది.

జాగ్రతలు:- ఎప్పుడు ఎత్తుప్రదేశాలు ఎక్కుతూ దిగుతూ వుండునపుడుగాని, లైటు పట్టుకొనుటకుగాని, ఎప్పుడూ ఇద్దరుండాలి. వీరు రోజుకొకరుచొప్పున చెప్పాలి. బిగ్గరగా అరవక ఒకమాదిరిగా చెప్పాలి. ఎక్కువసెంటర్లేర్పరచి కొద్దిరోజులలో మానేకంటే, తక్కువ సెంటర్లు తీసుకొని ఎప్పుడూ నడవడం మంచిది. పెద్దగ్రామములకుగూడ 5 సెంటర్లు చాలు. ప్రతిరోజు ఒకేటైముకు చెప్పాలి. అందరకు తీరికయ్యే సమయమై వుండాలి. కాబట్టి రాత్రి గం 8.0ల

నుండి గం.9.0 ల మధ్య చెప్పాలి. 15 నిమిషాలకంటె ఎక్కువకాలము మంచిది.కాదు. వ్యవసాయకూలీలుండు పల్లెలలో బాగా విడమర్చి స్థాయిని తగ్గించి చెప్పాలి. గ్రామీణవిషయాలు చెప్పునపుడు వివాదాంశమైన వాటినిగూర్చి బహుజాగ్రత్తగా చెప్పాలి.

ఈసలహాలు చూచి ఇట్టి శక్తిగలిగుంటేనే చెప్పాలని మానరాదు. చెపుతూ పైవాటి నన్నిటిని పూర్తిచేస్తే ఫలితం ఎక్కువ కలుగుతుంది. ప్రతిదినము చెప్పలేనివారు అప్పుడప్పుడు నియమితరోజులలో చెప్పవచ్చును. మెగఫోనును చీటికిమాటికి వాడరాదు. బాధ్యతలేనివారి కది అందనివ్వరాదు. ఇందువల్ల దీనిపై లక్ష్యమేర్పడుతుంది.

ఫలితాలు:— మనదేశ బీదతనంవల్ల ఒకవేళ రేడియోవున్నా అందరూవెళ్లి వినుటకు తీరికచిక్కదు. మనము వార్తలను రాత్రి 8 గం, 9 గం. మధ్య చెప్పుటవల్లను, నాలుగుమూలల చెప్పుటవల్లను ప్రజలందరకు ఆనందించుటకు వీలగును.

*           *           *           *

# నిర్వాహణ శాఖాసమావేశము



అధ్యక్షులు: శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు

# పొత్తపుగుడి కొలువరులు

## శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

పొత్తపుగుడులు పెంపొంది అవి సరిగా పనిచేయుచో తెనుగునాడు బాగు పడునను నమ్మకముకలిగి, "గ్రంథాలయ సేవకులము" అని చెప్పుకొనువారు తాము చేయవలసిన పనులు తెలిసికొని, వానినిబట్టి నడచుకొనవలె.

## చేయవలసిన పనులు

(౧) పొత్తపుగుడులవలననే ప్రజలకందఱకును జ్ఞానమును, దానివలన ఐకమత్యమును కలిగించి, దేశమునకు స్వాతంత్ర్యమును సమకూర్చి తమ దేశమును ఆదర్శదేశముగా చేయుటకు కంకణము కట్టుకొనవలె.

(౨) తమ ప్రయత్నము నెగ్గుటకు తాము పగలేని పట్టుదలయు, మచ్చలేని మంచినడతయు అలవఱచుకొనవలెనని గుర్తింపవలె.

(3) పేరుకొఱకును, అధికారముకొఱకును దేవులాడరాదు. పదవులలో నున్నను తమ అధికారము దుర్వినియోగము చేయరాదు. తోడికొలువరులతో జట్టీలు పడరాదు; వారిపై అసూయపడరాదు; పనినిబట్టి వారిని మన్నింప నేర్చుకొనవలె. తమపట్టే నెగ్గించుకొన చూడరాదు. ఆత్మస్తుతియు, పరనిందయు ఉద్యమమునకు ముప్పు తెచ్చునని ఎఱుంగవలె. అవి విడువవలె.

(౪) ఉద్యమమునకు ఎవరివలన ఎట్టిసాయము కలుగునో తెలిసికొని, వారివలన అట్టిసాయము లభించుటకు తగినట్లు తాము నడచుకొను నేర్పు బాగుగ గడించుకొనవలె.

(౫) మంచి నడతవలనను, కార్యదీక్షవలనను తాము తోడికొలువరులకు మేలుబంతులై వారి మన్ననకు పాత్రులై మెలంగవలె; అందువలన పెక్కుమందిని ఆకర్షించి ఉద్యమమున చేర్చి పని విరివిగా జరుగునట్లు చేయవలె.

(౬) బింకపునడవడి వేలుపాటు నెరవు కాన అది తమయందు ఎప్పుడును తల చూపకుండునట్లు జాగ్రత్తపడవలె.

(౭) తెనుగు బాగుగా చదువుకొనవలె; దానికితోడు సంస్కృతమును, ఇంగ్లీషును, హిందీయును, వలయుచో ఉర్దూయును నేర్చుకొనవలె; పాండిత్యము గడించుట ప్రశస్తము; ఉపన్యాసము లిచ్చుటకును, వ్యాసములును, పుస్తకములును వ్రాయుటకును సమర్థులు కావలె.

(౮) మంచి చదువరులగుటకు తోడు మంచిపాటకులగునో బంగారమునకు తావిఅబ్బినట్లగును గాన సంగీతజ్ఞానముకూడ సంపాదింప ప్రయత్నింపవలె. తేటగా

పద్యములు చదివియు, ఇంపుగా పాటలుపాడియు, చాలమందిని పాత్రపురుడులను ఆకర్షింపవలె.

(౯) పనిచేయుచున్న పాత్రపురుడులు మరింత హెచ్చు మందికి పనికివచ్చునటు చేయవలె. మూలబడిన పాత్రపురుడులు మరల పనిచేయునట్లు పాటుబడవలె. లేనిచోట్ల పాత్రపురుడులు పెట్టింపవలె.

(౧౦) సొంత యిండ్లులేని పాత్రపురుడులకు తగిన యిండ్లు లభించుటకు గట్టి ప్రయత్నము చేయవలె.

(౧౧) సభ్యుల చందాలవలనవచ్చు రాబడి గ్రంథాలయములు సరిగా పనిచేయుటకు చాలదు. కాని ఊరిఉమ్మడిరాబడినుండియు, దేవాదాయ ధర్మాదాయములనుండియు, స్థానికసంస్థలనుండియు, పరపతిసంఘములనుండియు, ధనికులగు దాతలనుండియు, బిడ్డలులేని అస్తులనుండియు, ఇంకను తక్కిన వెరవులనుండియు తగినంత డబ్బురాబట్టవలె.

(౧౨) స్మారకచిహ్నములుగా వారిపేర్లతో పాత్రములు, బీరువాలు మొదలైన కావలసిన సామాను కానుకలుగా సంపాదింపవలె.

(౧౩) పాటకచేరీలు, కవితాగోష్ఠులు, భజనలు, హరికథలు, ఉపన్యాసములు, పురాణములు చదివించుట, నాటకము లాడించుట, బొమ్మలుచూపుట, రేడియో మొదలైన సాధనములవలన హెచ్చుమందిని గ్రంథాలయములకు రప్పించి, వారిలో తగినవారిని పోషకులును సభ్యులును అగునట్లు చేయవలె. స్త్రీలను సభ్యురాండ్రుగా చేర్చి వారిలో ఒకరిని కార్యదర్శినిగా ఎన్నుకొని, ఆడవారితోను, పిల్లలతోను సంబంధించిన పని ఆమెకు అప్పగింపవలె.

(౧౪) వీలగుచో స్త్రీలకు ప్రత్యేకముగా పాత్రపురుడు ఏర్పాటుపవలె. అపుడు పిల్లలను స్త్రీగ్రంథాలయములకే రప్పింపవలె.

(౧౫) పరిస్థితులనుబట్టి ఆయాపాత్రపురుడులకు కావలసిన పుస్తకములయు, పత్రికలయు, జాబితాలు తయారుచేయవలె. రాబడినిపట్టి మిక్కిలి అవశ్యకములైనవి మొదటచేర్చి, పిదప క్రమక్రమముగా తక్కినవి చేర్చవలె.

(౧౬) చదువురానివారికి పత్రికలలో ముఖ్యభాగములును పాత్రములును చదివి వినిపింపవలె.

(౧౭) పత్రికలలోను, పాత్రములలోను ఉన్న ముఖ్యవిషయములు నల్లబల్లమీద గాని, సిమెంటుచేసిన గోడమీదగాని వ్రాసియో, తుదకు కాగితముమీద వ్రాసి అట్టలమీద అంటించి గోడకు తగిలించియో, చదువరుల పనికూడ సులువుచేయవలె.

(౧౮) పాత్రపుగుడులకు రాజాలనివారున్నచోట్లకువెళ్లి వారివారికి తగినవిషయములు చెప్పి, చదువవలసిన పాత్రములిచ్చి, అవి మరల రప్పించుకొనవలె.

(౧౯) ఎచ్చట ఎవరికి ఏవిషయములను గూర్చిన పత్రికలును పాత్రములును ముఖ్యములో తెలిసికొని అవికోర్చి, చదివి, చదివించి, చెప్పి, వ్రాసి, వారికి ఆవిషయములనుగూర్చిన జ్ఞానము సమకూర్చి వారు మేలొందుటకు తోడ్పడవలె.

(౨౦) వ్యవహారజ్ఞానము కలిగించు పుస్తకములు మొదలగునవి చేర్చి, కోరినవారికి సలహా లిచ్చుచుండవలె. కోర్టులకెక్కు దురాచారము వీలగునంతవఱకు తగ్గింపవలె. మఱచిపోయిన గ్రామస్వరాజ్యకళ పల్లెలవారికి బాగుగా పట్టుపడునట్లొనర్పవలె.

(౨౧) ఈడుమీరినవారికి చదువు నేర్పుటకు తగిన యేర్పాటు తప్పక చేయవలె.

(౨౨) పిల్లలను తగినవేళను పాత్రపుగుడులకు రప్పించి, ముచ్చటించియు, కథలుచెప్పియు, బొమ్మలుచూపియు, ఆటలాడించియు, వారిజ్ఞానము హెచ్చించి, అందువలన పత్రికలును పాత్రములును చదువుకొనవలెనను అపేక్ష వారికి కలిగింపవలె.

(౨౩) ఒడలు జబ్బులపాలుగాకుండుటకు ఎవరికి తగినసాము వారికి నేర్పుటకు ప్రయత్నింపవలె. తెలిసినవారిచే ప్రాణాయామము, ఆసనములు, దేశవాళీ ఆటలు మొదలగునవి నేర్పింపవలె.

(౨౪) చదివిన పాత్రములలో పరీక్షలుపెట్టి నెగ్గినవారికి కానుకలిచ్చి మంచి పాత్రములే చదువుటకు ప్రోత్సాహము కలిగింపవలె.

(౨౫) సభ్యులకును, ఇతరులకును ప్రోత్సాహముకలుగుటకు వార్షికోత్సవములు మొదలగునవి జరుపుచుండవలె.

(౨౬) గ్రంథాలయయాత్రలలో పాల్గొని, బాగుగా పనిచేయు పాత్రపుగుడులను గూర్చి తెలిపి, వెనుకపడియున్న వానిని ప్రోత్సహింపవలె.

(౨౭) తాలూకా, జిల్లాగ్రంథాలయమహాసభలు జరిపించి, స్వదేశ విదేశములందు గ్రంథాలయోద్యమములో జరుగు విశేషములు తెలిపి, ఆయా తాలూకా జిల్లాలలో ఉద్యమము ఉన్నతస్థితికి తెచ్చుటకు ప్రయత్నింపవలె.

(౨౮) ఆంధ్రదేశగ్రంథాలయమహాసభలలోను, ఆంధ్రదేశగ్రంథాలయ సేవకమహాసభలలోను పాల్గొని, తమ ప్రయత్నములవలననో ఇతరుల ప్రయత్నములవలననో కలిగిన లాభములు వెల్లడించి, గ్రంథాలయోద్యమము తెనుగునాట అంతట బాగుగా వ్యాపించి వాంఛితార్థము చేకూర్చునట్లు చేయవలె.

(౨౯) సాధారణముగా పాత్రపుగుడులలో జరుగుపనితో సంతృప్తిపొందక కానకొలతయు, వేడిమికొలతయు, గాలిఊనికియు తెలుపుపనిముట్లును, గ్రామఫోనులు,

మేజిక్ లాంతరులు, ప్రమాదములలో తోలిసాయము చేయుటకు వలయుపనిముట్లు మొదలగునవి సేకరింపవలె.

(౩౦) ప్రాతవ్రాతపొత్తములు, రాతిశాసనములు, రాగిరేకుశాసనములు, రాతిబొమ్మలు, ప్రాతనాణెములు, ప్రాతపోటుముట్లు మొదలగునవి సంపాదించి భద్రపఱుపవలె.

(౩౧) ఊళ్ళ ప్రోళ్ళ పొత్తపుగుడు లొండొంటికి తోడ్పడి, పెంపుచెందుటలోను, మేలుచేయుటలోను పోటీపడి చాలమందికి బాగుగా పనికివచ్చునట్లు చేయవలె.

(౩౨) ఎవరిమతము వారికి తెలియునట్లు చేసి తాము మతసహనముకలవారై పరులకవి కలిగింపవలె.

(౩౩) చెడ్డవారిని చేర్పక వారిని మంచివారినిగా చేయ ప్రయత్నింపవలె.

(౩౪) పొత్తపుగుడులులేని ఊళ్ళకు సంచార గ్రంథాలయములు పంపి అందువలన అచ్చటివారికి జ్ఞానము సమకూర్పవలె.

(౩౫) తెనుగువారందఱును పొత్తపుగుడులవలన గలిగిన జ్ఞానమువలన తాము స్వార్థపరత్వము చంపుకొని, తోడివారిని తమవలె చూడగలిగి, కలిసికట్టుతనము గడించుకొని, అందరును స్వతంత్రులై ఇహపరసుఖములు పొందసమర్థులగునటు చేయవలె.

(౩౬) తాము స్వార్థత్యాగులై, పరోపకారపరాయణులై మార్గదర్శకులై వెలయవలె.

# అనుబంధము ౧.

## శ్రీ సీతారామాంజనేయ హిందూవర్తక గ్రంథాలయ వార్షికోత్సవము అధ్యక్షోపన్యాసము

అధ్యక్షులు: శ్రీ నాగులపల్లి కోదండరామారావుగారు,
బి.ఎస్‌సి., యల్ యల్. బి.

ఆర్యులారా!

మీ నివేదికను చూడగా మీరు ౧౯౩౦ సంవత్సరమున శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయమును స్థాపించి నట్లును, నేడట్టి గ్రంథాలయమున సుమారు ౧౫౩౩ గ్రంథములు కలవనియు, ఇంకను రు. ౨౦౦ విలువకల ౧౫౦ గ్రంథములను శ్రీ కొత్తమాసు నారాయణగారు మీ గ్రంథాలయమునకు దానరూపకముగా నిచ్చిరనియు, మరియు ఈమూడు సంవత్సరములలో ౨౬౮౨ గ్రంథములు సభ్యులకు ఇవ్వబడినవనియు, ఇందువలన మీ గ్రంథాలయము మిక్కిలి అభివృద్ధి గాంచిన దనియు, ఇతర గ్రంథాలయములకన్న మీ గ్రంథాలయము సక్రమ పద్ధతులపై బాగుగా పనిచేయుచున్న దనియు విశదమగుచున్నది.

### స్వంతభవనము

మీకు ఏడువేల విలువగల స్వంతభవనము కలదు. ఈభవన నిర్మాణములో సింగరేణికాలరీసు కంపెనీవారు మీకృతజ్ఞతకు పాత్రులైరి. ఇంతేగాక వారు మీకు పెక్కుసౌకర్యములను గూడ కలుగజేసిరి. ఒక రేడియోసెట్టు, ఉద్యానవనము లభించినది. మీఅందరి పక్షమున సింగరేణికాలరీసు కంపెనీవారికి ధన్యవాదము లర్పించుచున్నాము.

మన తెలంగాణములోని ప్రజలలో జాగృతి ఆంధ్రోద్యమముతోను, గ్రంథాలయోద్యమముతోను ప్రారంభమైనది. ౧౯౦౩ సంవత్సరములో ఈ ఉద్యమము ప్రారంభమైనది. చాలా కొద్దికాలములోనే అనేక గ్రంథాలయములు మన రాజ్యములో స్థాపింపబడినవి.

కాని చాలా కొద్ది గ్రంథాలయములు మాత్రమే వృద్ధికి వచ్చి నవి. పోలీసు ఆటంకముల వలనను, మన ఆంధ్రులకుండు ఆరంభ శూరత్వమువల్లను చాలా కొద్దిగ్రంథాలయములే సక్రమముగా పని చేయుచున్నవి. సక్రమముగా జరుగుచు మంచి అభివృద్ధి పొందిన గ్రంథా లయములలో వీరాది యొకటి. బ్రిటిషుఇండియాలో గ్రంథాలయో ద్యమము చాలా అభివృద్ధిచెందినది. పల్లెలలోకూడ పత్రికలు చదువు వారు కొంతమంది ఉందురు. వినేవారు చాలామంది. కాని మన రాష్ట్రము లందలి పెద్దపట్టణములలో కూడ పత్రికలు చదువువారు తక్కువ. గ్రామములకు సాధారణముగా పత్రికలు వెళ్ళనే వెళ్ళవు. కావున ప్రజలలో పత్రికాపఠనాభిరుచి కలుగజేయుట విద్యావంతులపై ముఖ్యముగా యువకులపై నున్నది. ఈప్రచారములో గ్రంథాలయ ములు బాగుగా సాయపడును. చాలామంది అత్యుత్సాహముతో గ్రంథాలయములను స్థాపింతురు. చాలా శ్రమపడి ద్రవ్యము ప్రోగు చేసి గ్రంథముల సంపాదింతురు. కాని చదువువారు తక్కువ. దీనికి కారణమేమన చదువువారిని దృష్టిలో నుంచుకొని గ్రంథముల స్వీక రించుట లేదు. వెలువడిన ప్రతిగ్రంథమును కొనుట కొంతమంది పద్ధతి. సామాన్యమైన నొకగ్రామములో నివసించువారు వ్యవసాయకులు. ఆముక్తమాల్యద, శృంగారనైషధము, శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు వ్రాసిన వాని కఠినవ్యాఖ్యానాలు, వ్యాఖ్యానాలపై వ్యాఖ్యానాలు ప్రోగుచేసినచో వారికి యేమిలాభముండును? వారికి కావలసినది సులభమైన చిన్నగ్రంథములు. ముఖ్యముగా వ్యవసాయ మునకు సంబంధించినవి, సులభశైలిలో వ్రాసిన దేశచరిత్రలు, మన కాలములోని సమస్యలు, వారికి ఆనందము కల్గించునట్టి చిన్నకథలు, నవలలు, ఇవి వారికి ఉపయోగకరమగు గ్రంథములు. గ్రామపుస్తకా లయములు నడుపువారిలో చాలామంది పండితులుకారు. వారికి ఏవి యుత్తమగ్రంథములో ఏవి అనవసరమైనవో తెలియరావు. అందు చేత ప్రతిగ్రంథాలయములో నుండవలసిన కనిష్ఠగ్రంథపట్టికను వివర ములతో సహా ప్రకటించుట అవసరమని తలంచి విచారించగా మా.

మిత్రులగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు ౧౯౨౧లోనే అట్టి ఒక పట్టికను సిద్ధముచేసి యుండిరనియు, దానిని ప్రచురించుటకై ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు ఒక సంవత్సరముక్రింద వెంటనే తెప్పించుకొని యుండిరనియు తెలిసెను. వారు వెంటనే ఒక చక్కని చిన్నవివరణ పీఠికతో సహా ప్రకటించిన గ్రంథాలయముల కార్యకర్తలకే కాక దేశమందు యువకులకు, భాషాసేవాసక్తులకును చాలా ఉపకారము చేసినవారగుదురు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు చాలా తొందరగ ఇట్టిసహాయము చేయగలరని కోరుచున్నాను.

గ్రంథాలయములలో దేశమందు ప్రచురింపబడిన అన్నిపత్రికలు తెప్పించుట అనవసరము. ముఖ్యమగు కొన్ని పత్రికలు తెప్పించిన చాలును.

ప్రజలలో విజ్ఞానము వ్యాపింపచేయుటకై గ్రంథాలయములు స్థాపించుట చాలదు. గ్రంథాలయముతోపాటు వయోజనవిద్యకై మీరు కడుశ్రద్ధ వహించుకొనవలయును. అప్పుడప్పుడు కొంతమంది పండితులను నాయకులను రప్పించి ఉపన్యాసములు జరిపించవలెను. వయోజనులకు వ్రాయుట, చదువుట మీరు నేర్పవలెను. కాబట్టి మీరు కూలివాండ్రకు, పగలు ఉద్యోగము చేసుకొనువారి కొఱకు నొకరాత్రిపాఠశాల నేర్పాటు చేయవలయును. మీకు నొక రేడియో సెట్టు లభించినది. కాబట్టి మీగ్రామవాసులకు అభిరుచించునట్లు ప్రోగ్రాముల వినిపించవలయును. (Mental Recreation) వినోదము కొఱకు అప్పుడప్పుడు కొన్నిహరికథలు, గానము, నాటకములు, నృత్యములు మున్నగునవి యేర్పాటు చేయవలయును.

పైన సూచించిన విషయములనుబట్టి గ్రంథాలయములను ఏవో దొరికినపుస్తకములతో సంఖ్యను వృద్ధి జేయుచూ కూడబెట్టి యుంచెడుచోటు అని భావింపరాదు. పుస్తకాలయము దేశాభివృద్ధికి దేశసేవకు నిమిత్తములైనట్టివే అని గట్టిగా జ్ఞాపక ముంచుకొనవలయును. ఏస్థానములో పుస్తకాలయముండునో ఆతావున కనిష్ఠము

నలుగురైదుగురైన ధైర్యవంతులగు వారు ఏకైక కేంద్రముగ నుండ వలయును. జనులలో పరస్పరసహకారము పుస్తకాలయములే కల్గించ వలెను. మంచిగోష్ఠీస్థానము లేవిఅంటే పుస్తకాలయములే అని జను లనవలెను. మన మందికి భజనంటే చాలా ఇష్టము. జనుల నాకర్షిం చుటకు గానము ప్రధానము. పండుగలు వచ్చునప్పుడంతా పుస్తకా లయములో భజనచేయించి అప్పుడు జనులకు ప్రజాసేవయందు ఆసక్తి గలుగు నుపదేశములు చేయవలెను. గ్రంథాలయమే వార్తాప్రచార స్థానము. గ్రంథాలయమే విద్యాకేంద్రము. అందే విద్యరానివారికి విద్యపై ఉత్సాహము కలిగించి బోధించవలెను. ఈవిధముగా ఈ గ్రంథాలయమువారు సేవచేసి ధన్యులగుదురని ఆశించుచున్నాను.

## అనుబంధము ౨.

### ౨౫వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ప్రతినిధులు

#### గ్రంథాలయములు

1 పానకాలరాయ రామమోహనక్లబ్, పాలకొల్లు, పశ్చిమగోదావరిజిల్లా
2 సేవాశ్రమ వాణీమందిరం, పెదపాలెం (వయా) దుగ్గిరాల
3 శ్రీసీతారామాంధ్రగ్రంథాలయం, ఘనపురం, నైజాం
4 యువజనగ్రంథాలయం, జనగాం, నైజాం
5 భారతిపఠనాలయం, గూడూరు, జనగాంతాలూకా
6 శ్రీసీతారామచంద్ర గ్రంథాలయం, రాయపర్తి
7 ఎఱ్ఱాప్రగడ గ్రంథాలయం, గుడ్లూరు (వయా) కావలి
8 శ్రీశారదా గ్రంథాలయం, అనకాపల్లి, విశాఖపట్నంజిల్లా
9 యువజన గ్రంథాలయం, ఈడుపుగల్లు, కృష్ణాజిల్లా
10 వేమనగ్రంథనిలయం, సొలస, నరసరావుపేటతాలూకా, గుంటూరుజిల్లా
11 శ్రీవీరేశలింగ పుస్తకభాండాగారం, రేవేంద్రపాడు, తెనాలితాలూకా
12 శ్రీభాషాభిలాషిణీ గ్రంథనిలయం, దుగ్గిరాల, గుంటూరుజిల్లా
13 శ్రీరామచంద్ర గ్రంథాలయం, కొక్కిరేణి, నడిగూడెంపోస్టు, నందిగామతా॥
14 విజ్ఞానప్రకాశినీ గ్రంథనిలయము, కలకోట, మధిరపోస్టు
15 కృష్ణాజిల్లా యువజనగ్రంథాలయం, బెజవాడ

16 కృష్ణదేవరాయ ధర్మపుస్తక భాండాగారము, కోలవెన్ను, కృష్ణాజిల్లా
17 ఆంధ్రగ్రంథాలయం, కరీమాబాదు, నైజాం
18 ఆంధ్రరైతుగ్రంథాలయం, గోకినేపల్లి, నైజాం
19 శ్రీవెంకటేశ్వర గ్రంథాలయం, గార్ల, డిటో
20 గ్రామగ్రంథాలయం, కొప్పర్రు, గుంటూరుతాలూకా
21 శ్రీహనుమద్గ్రంథాలయం, మహదేవపురం, నైజాం
22 శ్రీరామచంద్ర బాలభక్త గ్రంథాలయం, కొణకంచి, కృష్ణాజిల్లా
23 శ్రీరాధాకృష్ణ గ్రంథాలయం, ఆలపాడు, తెనాలితాలూకా
24 యంగ్ మెన్స్ ముస్లిమ్ అసోసియేషన్ లైబ్రరీ, బెజవాడ
25 బాలమిత్ర గ్రంథాలయం, చేబ్రోలు, తెనాలితాలూకా
26 సారయాంధ్ర భాషానిలయం, సిరిసిల్ల
27 రామకృష్ణ గ్రంథాలయం, అలంపూరు, నైజాం
28 దుర్గా పఠనమందిరం, నూజివీడు, కృష్ణాజిల్లా
29 వాసవి గ్రంథాలయం, హైదరాబాదు
30 బాలసరస్వతీ పుస్తకభాండాగారం, మాజేరు, కృష్ణాజిల్లా
31 వేణుగోపాల పుస్తకభాండాగారం, వేంసూరు, నైజాం
32 విష్ణువర్ధన విజ్ఞాననిలయం, జముళ్లపల్లి
33 ఆర్యవైశ్య గ్రంథాలయం, జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా
34 వాసవి పఠనమందిరం, వరంగల్లు, నైజాం
35 ఆర్య గ్రంథాలయం, డిటో డిటో
36 వివేకానంద గ్రంథాలయం, శిరిపురం, నైజాం
37 ఆంధ్ర గ్రంథాలయం, చేరియాల, జనగాంతాలూకా, నైజాం
38 ఆంధ్ర యువతీ మండల గ్రంథాలయం, నారాయణగూడ, హైదరాబాదు
39 వేమన ఆంధ్రభాషానిలయం, నాంపల్లి, హైదరాబాదు
40 భారతీ యువజనసంఘం లైబ్రరీ, కారేపల్లి
41 ఆంధ్రమహాసభ గ్రంథాలయం, సింగరేణికాలరీస్
42 ప్రజాహిత గ్రంథమండలి, డోర్నకల్లు
43 శ్రీసీతారామాంజనేయ హిందూవర్తక గ్రంథాలయం, సింగరేణికాలరీస్
44 విద్యార్థిసంఘం, ఖమ్మంమెట్టు
45 విజ్ఞాననికేతనం, డిటో
46 నిజాంరాష్ట్రాంధ్ర సారస్వతపరిషత్తు, ఖమ్మంమెట్టు
47 కమ్మవిద్యార్థిసంఘం డిటో
48 రాజరాజనరేంద్ర భాషానిలయం, హనుమకొండ
49 విరాట్రాయాంధ్ర భాషానిలయం, నేలకొండపల్లి, నైజాం
50 ఖమ్మంతాలూకా ఆంధ్రజనసంఘ లైబ్రరీ, ఖమ్మంమెట్టు

## వ్యక్తులు

1 కొమ్మ్రా సీతారామయ్యగారు, పటమటలంక, కృష్ణాజిల్లా
2 కూరెల్లి వీరయ్యగారు, ఘనపురం, నైజాం
3 పరుచూరి వెంకయ్యగారు, అమృతలూరు, తెనాలితాలూకా
4 కె. ఆంజనేయశాస్త్రిగారు, వరంగల్, నైజాం
5 మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, విశాఖపట్టణం
6 చిర్రావూరి లక్ష్మీనరసయ్యగారు, ఖమ్మంమెట్టు
7 కందిరాజు శేషగిరిరావుగారు, డిటో
8 మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ
9 యం. వి. సుబ్బారావుగారు, గుంటూరు
10 వావిలాల గోపాలకృష్ణయ్యగారు, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా
11 డా॥ పట్టాభి రామశాస్త్రిగారు, పాపకొల్లు
12 జొన్నవిత్తుల కుటుంబరావుగారు, బందరు
13 నాగులపల్లి కోదండరామారావుగారు, హైదరాబాదు
14 కె. ఎస్. దత్తుగారు, కొత్తపట్టణము, ఒంగోలుతాలూకా
15 ఉమమళ్ల రామచంద్రరావుగారు, బందరు
16 అయ్యంకి వెంకటరమణయ్యగారు, బెజవాడ
17 సోమా లక్ష్మీనారాయణగారు, గార్ల
18 చందా వీరభద్రంగారు, గార్ల
19 సోమా విశ్వనాథంగారు, ,,
20 గోనుగుంట్ల వెంకటప్పయ్యగారు, గార్ల
21 పుల్లఖండం నరసింగరావుగారు, గార్ల
22 ఈ వెంకన్నగారు గార్ల
23 నపిరికంటి పట్టాభిరాములుగారు, గార్ల
24 మాదిరాజు రామకోటేశ్వరరావుగారు, హనుమకొండ
25 చుండూరు నరసింగరావుగారు, గోవిందాపురం
26 నాగబండి రంగనాయకులుగారు, డోర్నకల్లు
27 కొండపల్లి వెంకట్రామారావుగారు, కారేపల్లి
28 రంగాచారిగారు, మానుకోట
29 వట్టికొండ నాగేశ్వరరావుగారు, మధిర
30 వాసిరెడ్డి వెంకటపతిగారు, ,,
31 కారంశెట్టి నరసయ్యగారు, ఖమ్మంమెట్టు
32 అప్పన వెంకటనరుసుగారు, ,,
33 గెల్లా కేశవరావుగారు, ,,
34 పుల్లఖండం రాజయ్యగారు, ,,

35 కాళోజి రామేశ్వరరావుగారు, హనుమకొండ
36 ,, నారాయణరావుగారు, ,,
37 పెండేల సత్యనారాయణగారు, నేలకొండపల్లి
38 పెరవల్లి వెంకటరమణయ్యగారు, ఖమ్మంమెట్టు

గ్రంథాలయ సంఘములు

1 గుంటూరుజిల్లా గ్రంథాలయసంఘం
2 ఒంగోలుతాలూకా గ్రంథాలయసంఘం

---

# అనుబంధము 3.

## ౧౫ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, సింగరేణికాలరీస్ (ఇల్లెందు)

### ఆహ్వానసంఘమువారి నివేదిక

ఖమ్మంమెట్టు విజ్ఞాననికేతన వార్షికోత్సవ సమయంలో ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ నాయకుల ఆగమనాన్ని పురస్కరించుకొని ౧౫ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ వరంగల్లు జిల్లాపక్షమున సింగరేణి కాలరీస్‌లో జరుపుటకు ఆహ్వానించాము.

ది **22-6-44** తేదీన ఆం. దే. గ్రం. సంఘ కార్యదర్శిగారగు శ్రీ పాతూరి నాగభూషణంగారు విచ్చేసిరి. ఆసమయంలో స్థానికులు 37 గురు శ్రీ గోపు ఆదినారాయణగుప్తగారి అధ్యక్షతన సమావేశమయిరి. ఆహ్వానసంఘ సభ్యత్వరుసుము రూ 3-0-0 లుగా నిర్ణయిస్తూ ఆహ్వానసంఘాధ్యక్షులుగా శ్రీ పర్చ కిషనరావుగారిని, కార్యదర్శులుగా శ్రీ కోదాటి నారాయణరావుగారిని, సంయుక్త కార్యదర్శులుగా శ్రీ ఆకుల లక్ష్మీనారాయణ, గోపు ఆదినారాయణగుప్తగార్లను ఎన్నుకొనిరి. మహాసభ 20, 21 జూలై తేదీలలో శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులుగారి అధ్యక్షతన జరుప నిశ్చయించిరి.

శ్రీ హనుమంతరావుగారిని అనేకవిధాలుగా ప్రార్థించినా వారు అంగీకరించకపోవుటచేతను, వ్యవధి చాల తక్కువగా నుండుటచేతను ది 5-7-44 న ఆహ్వానసంఘ సభ్యుల సమావేశంలో తేదీలు మార్చ నైనది. ఆ సమావేశమందే ఆహ్వానసంఘ నియమావళి అంగీకరించ బడినది. 25-7-44 వ తేదీన ఆహ్వానసంఘం తిరిగి సమావేశమయి శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతన మహాసభను ఆగష్టు 24, 25, 26 తేదీలలో జరుపుటకు నిశ్చయించింది. 15-8-44 తేదీ సమావేశంలో తాత్కాలిక కార్యనిర్వాహకసంఘం అసలు కార్య నిర్వాహకసంఘంగా మార్చబడింది. 20-8-44 వ తేదీ సమావేశంలో ఆహ్వానసంఘ ఉపాధ్యక్షులుగా శ్రీ వేలమూరి నాగభూషణం, నేదు నూరి వీరరాఘవరావుగార్లను ఎన్నుకోనైనది. వివిధశాఖలకు కార్య కర్తలను ఎన్నుకొన్నారు.

## మహాసభా ప్రయత్నాలు

మహాసభకు ఒక నెలరోజులకు పూర్వంనుంచి ప్రచారం, నిధి సమీకరణ మొదలయినవి ప్రారంభించబడినవి. ఈ సందర్భంలో కర పత్రాలద్వారా, పత్రికా ప్రచురణలద్వారా గ్రంథాలయ యాత్రల మూలంగా ప్రచారం జరుపనైనది. ఆహ్వానసంఘంలో 185 మంది సభ్యులనుచేర్చి సభ్యత్వరుసుములు, విరాళాల మొత్తం రూ1201-12-0 వసూలు చేయనైనది. ఈ సందర్భంలోనే తెలంగాణాలోపల గ్రంథాలయ వివరాలను సంపాదించనైనది. మహాసభ నిమిత్తం 2000 ఆహ్వానాలు నిజాంరాష్ట్రంలోని గ్రంథాలయాలకు, బ్రిటీషు ప్రాంతంలోని గ్రంథాలయాలకు, గ్రంథాలయ సేవకులకు, గ్రంథా లయోద్యమాభిమానులకు ప్రత్యేకంగా పంపనైనది.

## మహాసభ

మహాసభ 24, 25, 26 ఆగష్టు తేదీలలో విఖ్యాతాంధ్రనాయ కులు శ్రీ బూర్గుల రామకృష్ణారావు, బి. ఏ., ఎల్. ఎల్. బి. గారి అధ్యక్షతను జయప్రదంగా జరిగింది. వివిధప్రాంతాలనుంచి ఎన్నడూ

రానంతమంది ప్రతినిధులు, ప్రేక్షకులు విచ్చేశారు. నాయకులందరూ ఈసభ గ్రంథాలయోద్యమచరిత్రలో ఒక నూతనఘట్టం ప్రారంభించిందని ప్రశంసించారు. సభాసమావేశానికి భోజనములకు తమ రాధాకృష్ణ సినిమాహాలును, దానిఆవరణలోవున్న భవనాలను ఇవ్వటమేగాక శ్రీ సీతారాంసేఠ్ గారు స్వయంగా కష్టించి పనిచేసి తోడ్పడ్డారు. శ్రీ ఇల్లిందల రామదాసుగారు భోజనవసతుల ప్రయత్నంలో చేసిన తోడ్పాటు ప్రశంసనీయమైనది. స్థానికప్రముఖులు చాలామంది తమ భవనాలను ప్రతినిధుల వసతుల నిమిత్తం ఖాళీచేసి యిచ్చారు. స్థానిక యువకులంతా శ్రమకోర్చి మహాసభ ప్రయత్నాల్లో సేవజేసి స్వచ్ఛంద సేవకులుగాజేరి మహాసభను జయప్రదం జేశారు. ఆంధ్ర జాతీయ సేవాదళంచేసిన సేవ ప్రశంసనీయం - దారిలో ప్రతినిధులకు, నాయకులకు డోర్నకల్లునందు ఉచితంగా భోజనవసతులను ఏర్పాటుచేశారు.

మహాసభతోపాటు స్థానిక శ్రీ సీతారామాంజనేయ హిందూ వర్తక గ్రంథాలయ వార్షికోత్సవము శ్రీ నాగులపల్లి కోదండరామారావు, ఎం.ఎస్‌సి., ఎల్ ఎల్.బి.,గారి అధ్యక్షతన ది 23 ఆగష్టున జయప్రదంగా జరిగింది. మహాసభకు వివిధప్రాంతములనుండి అనేకమంది ప్రముఖులు నాయకులు విచ్చేశారు. ఈవిధంగా మహాసభకు తోడ్పడిన వారందరికీ మా హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనములు సమర్పిస్తున్నాము. గ్రంథవిస్తరణభీతిచే నివేదికను ఇంతకన్నా వివరంగా యివ్వజాలనందుకు చింతిస్తున్నాము.

అత్యంత గణనీయమైన ఈసభను జరిపే బాధ్యత మాకు కలుగ జేసినందులకు ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమునకు మాధన్యవాదాలు.

ఆహ్వానసంఘపు లెక్కలు పరిశీలించబడి ఆం. దే. గ్రం. సంఘమువారిచే అంగీకరించబడినవి. సభలనిమిత్తం ఆహ్వానసంఘము ఖర్చుచేయగా మిగిలిన మొత్తం రు 50 0-0 లు బండీలు (58-5-5 హాలీలు) ఆంధ్రదేశ గ్రంథాలయసంఘానికి వారి నియమావళి ప్రకారం అప్పగించనైనది.

ది 3-1-45 సమావేశంలో జరిగిన తీర్మానం ప్రకారం ఆహ్వాన సంఘం రద్దుచేయనైనది.

విరాళములు, ఆదాయవ్యయములు, ఇతరవివరాలు దిగువ వివరించనైనది.

రు. 250-0-0 చందా చెల్లించినవారు.

శ్రీసీతారామాంజనేయ హిందూవరకగ్రంథాలయం—సింగరేణి కాలరీస్.

1 రు. 50-0-0 చందా చెల్లించినవారు.

చందా రాఘవులుగారు—ఇల్లెందు.

1 రు. 20-0-0 చందా చెల్లించినవారు.

చేప్పూరి అచ్యుతరాములుగారు—సింగరేణికాలరీస్.

4 రు. 11-0-0 చందా చెల్లించినవారు

ఓడపల్లి సత్యయ్యగారు—వరంగల్లు. హిమానదాసు ముకుందదాసుగారు, ఘనాజీ అంబాజీదత్తుగారు—వరంగల్. శ్రీ.సా. ఆలపాటి కుటుంబరావుగారు—మధిర.

23 రు. 10-0-0 చందాచెల్లించినవారు.

నారాయణగారు—సింగరేణికాలరీస్. బొడ్డు రామారావుగారు—కొత్తగూడెం. భోనగిరి వెంకట్రామయ్యగారు, బొర్ల నారాయణగారి వెంకటప్పయ్యగారు, భోనగిరి సోమయ్య & సన్సువారు, వెంకటేశ్వర రైస్ మిల్ వారు—మానుకోట. కొదుమూరు పుల్లయ్యగారు—బూర్గంపాడు. చంద్రభాన్ సింగ్ గారు, కొండపల్లి రుక్మారావుగారు—ఇల్లెందు. సుందరలాల్ గారు, నెమరిగొమ్మల రామచంద్రరావుగారు—సింగరేణికాలరీస్. బద్దిరాజు మనోహరరావుగారు, బద్దిరాజు రంగారావుగారు—మట్టెవాడ. అకుల పూర్ణానందంగారు, అనుమోల వెంకటాద్రిగారు, సుగ్గల అక్షయలింగమూర్తిగారు, ప. వెం. లక్ష్మయ్యగారు, కొమ్మినేని రోశయ్యగారు—ఖమ్మం. జంగా నర్సయ్యగారు—సిరిపురం. కోసా విశ్వనాథంగారు, కొండపల్లి శేషగిరిరావుగారు, మిర్యాల నారాయణగుప్తగారు, జటరాం సేట్ గారు—మధిర.

1 రు. 8-0-0 చందా చెల్లించిన.

గుమ్మడూరు వెంకటనర్సయ్యగారు—హైదరాబాదు.

46 రు. 5-0-0 చందా చెల్లించినవారు.

తిరాల నారయ్యగారు, యస్. యస్. సుబ్బారావుగారు, వట్టిపల్లి అనంతసత్యనారాయణగారు, రాం ఫరీజ్ గారు—సింగరేణికాలరీస్. గండె అనంతరామయ్యగారు, వి. సత్యనారాయణగారు, యం. వీరభద్రంగారు, యర్ర రామలింగయ్యగారు—డోర్నకల్లు. ఆకారపు నరసింహంగారు, జంగిలి వెంటయ్యగారు, దేవులపల్లి వెంకటజలపతిరావుగారు, తోట శివయ్యగారు, గుమ్మడవెల్లి విశ్వనాథం

గారు—వరంగల్లు. పోతిరెడ్డి గంగారావుగారు—గార్ల. సంచా చిత్తరిగారు, ఎం. పి. నరసయ్యగారు, కిలారు వెంకటసుబ్బయ్యగారు, రాయపూడి రామమూర్తి గారు—కొత్తగూడెం. మహాదేవసింగ్ గారు—కారేపల్లి. మాకాని గోపాల స్వామిగారు, జనాంగీరుజీ, శివరాంసింగ్ గారు, నారాయణసింగ్ గారు, కొండిశెట్టి అంజయ్యగారు—ఇల్లెందు. యిరుమళ్లి రాజయ్యగారు, గెల్లి లక్ష్మీనారాయణ గారు—మానుకోట. గెల్లాముత్తయ్య లక్ష్మీనారాయణగార్లు, గెల్లా కేశవరావు గారు, రాయపూడి నారాయణరావుగారు, అత్తలూరి రాఘవయ్యగారు, కారుమూరు సుబ్బారావుగారు, బిల్లంచర్ల రాములు పిల్లవెన్న కృష్ణగార్లు, గుడుగుంట్ల లింగయ్య గారు, పల్లఖండం రాజయ్యగారు, బూర్ల సాంబయ్యగారు, గెల్లా వాసుదేవుగారు, సుగ్గల మల్లేశంగారు, పసుమర్తి రామకృష్ణయ్యగారు—ఖమ్మం. పాటిబండ్ల రఘు పతిగారు—జానకీపురం. వెండ్యాల సత్యనారాయణగారు—కెలకొనన్న. వేమి రెడ్డి కోటారెడ్డిగారు—సిరిపురం. అన్నసముద్రం జగన్నాథరావుగారు, చతుర్వే దుల వెంకటకృష్ణయ్యగారు, కండిబండ వెంకటపురుషోత్తంగారు, కందికొల్లు కనకయ్య గారు, ములుగూరి పుల్లయ్యగారు—మధిర. పైడిపల్ల హనుమయ్యగారు—రాయన్నపేట.

3 రు. 4-0-0 చందా చెల్లించినవారు

రాం ప్రసాదుగారు, రామమూర్తిగారు, బుడపు వీరయ్యగారు—సింగరేణి కాలరీస్.

105 రు. 3-0 0 చందా చెల్లించినవారు

నూకా అంతయ్యగారు, జవ్వాజి సత్తయ్యగారు, యామసాని వెంకట్రాజం గారు, యామసాని నారాయణగారు, కుమ్మరికుంట్ల రాములుగారు, అనంతుల సత్య నారాయణగారు, యెలుగూరు సోమలింగంగారు, దూడల నరసయ్యగారు, చందా శివనారాయణగారు, బండారు సత్యనారాయణగారు, చక్రపాణి సత్యనారాయణ గారు, పల్లబోతుల మార్కండేయులుగారు, బొమ్మకంటి రామారావుగారు, యాత్రా తిరుపతయ్యగారు, కనుమర్లపూడి వాసుదేవుగారు, గోపు ఆదినారాయణగుప్తగారు, గోపు నారాయణగారు, నారాయణగారు, ఒకఅభిమాని, సేదునూరి వీరరాఘవరావు గారు, చేవూరి వెంకన్నగారు, ముక్కా రాజమౌళిగారు, గోపు లక్ష్మీనారాయణగారు, కొత్తమాసు నారాయణగారు, చిదిరాం బుచ్చిలింగంగారు, రాయి వెంకయ్యగారు, బొల్లోజి చంద్రయ్యగారు, పి. యతిరాజులుగారు, గంధం రాములుగారు, యిల్లెం దుల రామదాసుగారు, తేలుకుంట్ల రామయ్యగారు, నేరెళ్ల సుబ్బారావుగారు, కస్తూరి లక్ష్మీనరసింహంగారు, అరవపల్లి శంకరనారాయణగారు, వేలమూరి నాగ భూషణంగారు, దామెర్ల రఘుపతిగారు, బొడిగ రోసిగారు, చలువాది జగయ్య గారు, చందా సూర్యప్రకాశరావుగారు, పగడాల రాములుగారు, మేళ్లచెరువు కోటయ్యగారు, భాగన్నగారు—సింగరేణి కాలరీస్. సుగ్గల వెంకయ్యగారు —కామేపల్లి. దామిడి రంగయ్యగారు—బాస్తిపల్లి. పెనుపాకారి నారాయణ

గారు, చిదిరా రాజలింగంగారు, చందాల రామకవిగారు, ఎన్నిరెడ్డి రాజలింగం గారు, బి. రాజమౌళిగారు, యన్. రాజమల్లుగారు, చందా పుల్లయ్యగారు, రాయబారపు రామస్వామిగారు, గుండా మల్లయ్యగారి రాజయ్యగారు, చెలుపూరి మంకయ్యగారు, చెలుపూరి కేదారిగారు, గుండా ముత్తిలింగంగారు, మామిడి లక్ష్మీనారాయణగారు, డాక్టర్. టి. ఎస్. మూర్తిగారు, బొడ్ల వీరయ్యగారు, రుద్రదేవుగారు—వరంగల్లు. కూరెళ్ల వీరయ్యగారు—ఘనపురం. సుగ్గల మల్లేశం గారు, రాయపూడి రంగయ్యగారు, యర్రం విశ్వనాథగుప్తగారు, మాడిశెట్టి సోమ నాథంగారు, నల్లాని చక్రవర్తుల రామానుజాచారిగారు, సుగ్గల తిరుమలరావుగారు, నోముల వాసుదేవ బ్రదర్సువారు, ఛి. కన్హ్యాలాల్‌గారు, బెల్లంకొండ లక్ష్మీపతి గారు, కొమరగిరి నారాయణరావుగారు, మాగంటి సింహాద్రిగారు, గెల్లా నారాయణ గారు, కోనా పట్టాభిగారు. బూర్లె రామయ్యగారు—ఖమ్మం. రామేశ్వరజీ, గోపాలరావుగారు—కొత్తగూడెం. కొండపల్లి రంగారావుగారు, గడ్డం రాజయ్య గారు—బేతంపూడి. వెలిదండి వెంకటాద్రిగారు—ఏకురుపల్లి. కోదుమూరు రామలింగంగారు, యనాతా అప్పయ్యగారు, బవిరిశెట్టి..., వందనం వీరభద్రంగారు, మానె రాజలింగంగారు, శివవాదుల నర్సయ్యగారు, నకిరేకంటె అప్పయ్యగారు, యం. గోపయ్యగారు—మానుకోట. నరూరపు రాములుగారు, గాలి రాజయ్య గారు, గుండా లింగయ్యగారు—ఇల్లెందు. కైలాసం వైకుంఠంగారు—సికింద్రాబాదు. బదిరాజు రాజేశ్వరరావుగారు, డాక్టర్. నరసింహాచారిగారు—మట్టెవాడ. హర్దార శ్రీనివాసరావుగారు—హనుమకొండ. తూములూరి నారాయణ వేముల గుర్వయ్య గారలు. ఆళ్ల నారాయణగారు, మహమ్మద్ మొహద్దీన్‌గారు. ఉడుగు వెంకటేశ్వర రావుగారు, వంకాయలపాటి ప్రకాశరావుగారు, మొలుగూరు రాఘవులుగారు— మధిర. పరచా ఆనందరావుగారు, కొండపల్లి వెంకట్రామారావుగారు—కారేపల్లి. మాదిరాజు వెంకటశేషగిరిరావుగారు—వెంకటాపురం. గోనుగుంట్ల మార్కండే యులుగారు.—.

10 రు. 2-0-0 చందా చెల్లించినవారు

పొరుపల్లి కనకయ్యగారు, జె. నరసింహారావుగారు, యస్. వెంకటశివన్ గారు—డోర్నకల్లు. తిరుపతయ్యగారు—పేరుపల్లి. సోఖులాల్‌గారు, అగయ్య గారు—సింగరేణి. షేక్ షుకూరిగారు, ఆర్ రాజయ్యగారు,—కొత్తగూడెం. ముశినాగమల్లుగారు—ఉండవల్లిరేవు. చెరుకుమిల్లి హనుమయ్యగారు—మధిర.

2 రు. 1-0-0 చందా చెల్లించినవారు

వి. రాజయ్యగారు—లింగాల. మండెపూడి రాములుగారు—కారేపల్లి.

ఇట్లు

అధ్యక్షులు:— పర్చా శివశంకర్‌రావుగారు

కార్యదర్శి:— కోదాటి నారాయణరావుగారు

సహాయ కార్యదర్శులు:— ఆకుల లక్ష్మీనారాయణగారు

గోపు ఆదినారాయణగుప్తగారు

## కార్యవర్గ సభ్యులు

శ్రీ పి. యతిరాజులుగారు, శ్రీ ముక్కా రాజమౌళిగారు, శ్రీ చేపూరి వెంకన్నగారు, శ్రీ నేదునూరి వీరరాఘవరావుగారు, శ్రీ కస్తూరి లక్ష్మీనరసింహంగారు, శ్రీ అరవపల్లి శంకరనారాయణగారు, శ్రీ ఇల్లెందుల రామదాసుగారు.

## ఆదాయ వ్యయ పట్టిక

| ఆదాయం రు. అ. పై | | వ్యయం రు. అ. పై |
|---|---|---|
| 936-0-0 | ఆహ్వాన సంఘ సభ్యులవల్ల, విరాళాలవల్ల వసూలు | |
| 250-0-0 | శ్రీ సీతారామాంజనేయ హిందూవర్తక గ్రంథాలయం, సింగరేణి కాలరీసువారు యిచ్చినవిరాళం | |
| 15-12-0 | మిగిలిన సామగ్రి అమ్మకం | |
| | ప్రయాణపు ఖర్చులు | 222-14-9 |
| | స్టేషనరీ | 15-11-4 |
| | పోస్టల్ | 98-1-8 |
| | అచ్చు | 73-5-4 |
| | భోజన సామగ్రి | 553 1-6 |
| | ఫోటోలు | 36-8-0 |
| | గుమాస్తా వేతనం | 35-0-0 |
| | ఇతర సాదకులు | 93-12 0 |
| | పత్రికాప్రకటన చార్జీలు | 15 0-0 |
| | ఆంధ్రదేశ గ్రంథాలయసంఘంవారికి పంపినవి | 58-5-5 |
| 1201-12-0 | మొత్తము | 1201-12-0 |

భారతీ ప్రెస్, తెనాలి. పి.ఐ పి.జి. 36 - 600 — 3-6-47.

# ఆంధ్రదేశ గ్రంథాలయ
# సంఘప్రచురణములు

| | |
|---|---|
| ముసలమ్మ మరణము (పద్యకావ్యము)<br>డాక్టరు క. రామలింగారెడ్డి గారిచే | 0-8- |
| వయోజన విద్య - మొదటిపుస్తకము<br>గా. హరిసర్వోత్తమరావు గారిచే | 0-4- |
| ఆంధ్ర గ్రంథములు - మొదటి జాబితా | 0-6- |
| ఆంధ్ర గ్రంథాలయం - మొదటి సంపుటము | 2-0- |
| ,, రెండవ సంపుటము | 2-0- |
| ,, వయోజనవిద్యాసంచికమాత్రం | 1-0- |
| ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక, 1939 | 1-0- |
| ౨౩ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ | 1-0- |
| ౨౪ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ | 0-12- |
| ౨౫వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ(ఇంగ్లీషులనుబంధంతో) | 2-0- |
| గ్రంథాలయములు: రిజిస్ట్రేషను | 0-6- |
| సభలు - సమావేశములు | 1-4- |
| వయోజన విద్య - బోధనక్రమము | 1-8- |

— అచ్చులో నున్నవి —

౨౬ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

— తయారగు చున్నవి —

గ్రంథాలయ గీతాలు
గ్రంథాలయ పట్టికలు
ఆంధ్ర గ్రంథాలయోద్యమ చరిత్ర
ఆంధ్రగ్రంథములు- రెండవ జాబితా
డిటో మూడవ జాబితా